# కవిసమయములు

## సిద్ధాంతవ్యాసము



డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KAVI SAMAYAMULU : (Poetic conventions) A Doctoral thesi
by Dr. Iriventi Krishna Moorthy, Department of Telugu, Osmani
University, Hyderabad. A.P.



యువభారతి

ప్రచురణ : 120

ప్రథమ ముద్రణ : 1987

ప్రతులు : 2000

ముఖచిత్రాలంకృతి : శీలావీర్రాజు

ముద్రణ : చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్,
గంజ్ బజార్, సికింద్రాబాద్-500 003.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్-500 020.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ. 50-00




# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. ఉత్తమ భావప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువది మూడేండ్లుగా పాతకొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని 120 పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువవున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదేకాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 10,030 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వపథకాలలో భారతీ మిత్రులుగా 1500 మంది, భారతీ భూషణులుగా 138 మంది చేరినారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలచినారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం–ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి, దేశీయుల్లో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ—

అధ్యక్షుడు

ఇరివెంటి కృష్ణమూర్తి.



# మా మాట

ఇది మామాట. అంటే యువభారతి సంస్థ తరఫున ఈ పుస్తకాన్ని ప్రచురణకు ఎన్నిక చేసినందుకుగల విశిష్ట కారణాలను సాధికారికంగా వివరిస్తూ, రచయిత ప్రత్యేకకృషిని, ప్రతిభను, అర్హతనూ ప్రస్తావిస్తూ. అక్షరరూపం కల్పించిన సాహితీమూర్తికి ధన్యవాదాలనర్పిస్తూ పాఠకలోకం ముందు సవినయ సమర్పణచేసే యత్నం అన్నమాట! ఇది సాధారణంగా, సంస్థ అధ్యక్షులు ఆన వాయితీగా చేస్తూవస్తున్న పని.

ఈ "కవిసమయము" సృష్టికర్తా యువభారతి అధ్యక్షులూ డాక్టరు ఇరివెంటి కృష్ణమూర్తిగారే కాబట్టి, మామాటగా మనసులోని నాలుగు మాటలు చెప్పే మహదవకాశం, నా భాగ్యమైంది.

ఇది యువభారతి 120వ ప్రచురణ. వ్యాపారసంస్థ కాని ఒక సాహితీ సంస్థ, 120 పుస్తకాలను వెలువరించగలగడం ఎంత కష్టసాధ్యమైన పనో, సహృదయుల గుర్తించగలరని ఆశిస్తాము. సాధారణంగా "తమ కోసం" స్థాపించుకొని కృషిచేసే సంస్థలకన్న భిన్నంగా యువభారతి నడుస్తూవస్తున్నది. సమాజంలో సహజంగా కనబడే సగటుమనిషి సగటు స్వార్థపూరిత ఆలోచనా రీతులకు భిన్నంగా "సొంత లాభం కొంత మానుకో"ని కృషిసల్ప నిశ్చయించిన సాహితీ మిత్రుల సాహిత్యాభిలాషకు ఆకృతి యువభారతి. అక్షర భారతికి సేవ చేసే మహదవకాశం లభించడం భాగ్యంగా భావిస్తున్న మిత్రుల కృషి ఇది. దాదాపు ఇరవై రెండేళ్ళుగా మాకు అండగా ఆలోచనలకొండగా పెద్దదిక్కుగా, అనుసరణీయమైన మార్గాన్ని నిర్దేశిస్తూ, చెయ్యబడింది. వెంటనడిపించిన పథనిర్దేశకుడుడిగా, సుఖాల్లోనూ, ఆనందమయసమయాల్లోనూ కాక, కష్టాల్లోనూ, నష్టాల్లోనూ, వెన్నంటి నడిచిన మా కృష్ణమూర్తిగారు మాకు అత్యంత సన్నిహితులు మాలో ఒకరు గాబట్టి, మా ఆలోచనా రీతులను తన సహృదయ సంస్కార బలంతో రూపుదిద్దిన ఆప్తులుగాబట్టి, ఎంత చెప్పినా తనివి

తీరదు, ఋణభారం తీరదు. వారి సాంగత్యం ఒక **emotional integration** వారి ఉపాన్యాసం ఒక **cultural education.** వారు కలం పడితే అది ఒక **analytical interpretation** అందుకే వారి శక్తియుక్తులు యువభారతికి పెట్టనికోట; కొండంత వెలుగు; అనంతస్ఫూర్తి.

కవిసమయాలు కావ్యమర్యాదలు, అశాస్త్రీయములనిపించినా, రసార్ద్రములు తర్కమునకు లొంగకపోయినా, సహృదయ రంజకములు అలాంటి విషయాన్ని పరిశోధనాంశంగా ఎన్నుకొని, శాస్త్రీయపద్ధతిలో విశ్లేషించి, క్లిష్ట విషయాన్ని కరతలామలకం చేశారు.

వారి సాహిత్యకృషిని సహృదయ పాఠకలోకానికి అందించాలన్న మా యత్నమే ఈ ప్రచురణ. "అందరికీ పనికివచ్చే మంచి పుస్తకం వ్రాయడం మరీ కష్టమనీ, ఆ కష్టమైన పనిని కృష్ణమూర్తిగారు సులభసుందరంగా నిర్వహించారనీ" పండితుల ప్రశంసలు నందుకొన్న ఈ పుస్తకాన్ని ప్రచురించగలగడం మాకు అరుదైన అవకాశం ఆ అరుదైన అవకాశాన్ని మాకు కల్గించినందుకు మా మనః పూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తూ, ఈ కృషి సహృదయులమన్ననలకు పాత్రమౌతుందని ఆశిస్తూ మీ అండదండలు యువభారతికి కలకాలం అందించండని అర్థిస్తూ—

ఏప్రిల్ 26, 1987

**వంగపల్లి విశ్వనాథం**
సమావేశకర్త
యువభారతి

# సమయజ్ఞుడు ఇరివెంటి

ఆచార్య సి. నారాయణరెడ్డి.
ఉపాధ్యక్షులు. ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం.

సమయపదానికి అనేకార్థాలు ఉన్నా కాలం, నియమం, శపథం అనే అర్థాల్లో అది రూఢంగా ఉంది. మిత్రుడు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి కాలజ్ఞుడు, నియమజ్ఞుడు, నా పర్యవేక్షణలో ప్రారంభించిన పి. హెచ్. డి. పరిశోధన సమర్థంగా పూర్తి చేసిన ఆత్మధర్మ శపథజ్ఞుడు.

ఇరివెంటి వ్యుత్పత్తి అత్యంత విస్తృతం. సమకాలీన కవి పండితులకు అందని అనేకాంశాలు ఆయన కొననాల్క మీద గునగున పరుగుతీస్తాయి. కానీ అవి మునివేళ్ళ మీదికి రావడానికి బద్ధకిస్తాయి. ఆయన పి హెచ్. డి. పరిశోధన ఆలస్యంగానైనా, ఆరంభించక ముందే అనేక పరిశోధకవిద్యార్థులకు అజ్ఞాతపర్యవేక్షణ చేశాడు. కళాశాలల్లో సహవ్రతులం కావడంవల్ల చనువుతో కూడిన నా ఒత్తిడికి తట్టుకోలేక పరిశోధన రంగంలో ప్రత్యక్షంగా దిగాడు. మాటతీరు చమత్కారపేశలంగా ఉన్నా మనసు లోతున్న మతి మంతుడు. అందువల్ల ఎన్నుకున్న పరిశోధనాంశాన్ని ఎంతో నిశితంగా విశ్లేషించి చూశాడు కవి సమయాలను గురించి సంస్కృతంలో ఉన్న ఉపపత్తులన్నిటినీ తరచి చూశాడు. కవిసమయాలను శాస్త్రీయంగా నిర్వచించిన రాజశేఖరుణ్ని ప్రమాణంగా స్వీకరించాడు. అయితే ఇరివెంటి విశిష్టత ఏమిటి? ఈ ప్రశ్నను దృష్టిలో పెట్టుకొని చదివితే తెలుస్తుంది ఈ గ్రంథం విశిష్టత.

పూర్వలాక్షణికులు కవిసమయాల పట్టికలిచ్చారే గానీ వాటి శాస్త్రీయ నేపథ్యాన్ని వివరించలేదు. ఇరివెంటి అనేక కవి సమయాలను విశ్లేషిస్తూ వాటిని శాస్త్రీయదృష్టితో, సహేతుకదృష్టితో వివరించాడు.

ఈ పరిశోధన గ్రంథంలో లాగుడు గుణంలేదు; కుదింపు తప్ప. పుటలు పెంచాలనుకుంటే తెలుగు ప్రబంధాల్లోంచి గొప్ప గొప్ప ఉదాహరణలు కుప్పలు పోసేవారు. ఆత్మనిరూపణమే ఈ గ్రంథలక్షణం; అంగప్రదర్శనం కాదు అప్పటికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వెలువడిన సిద్ధాంత గ్రంథాల్లో సైజులో ఇది చిన్నది కావచ్చు గుణంలో మిన్నయున్నది ఇరివెంటి అభినందన స్వాభిప్రాయనే అవుతుంది. అందువల్ల ఇలాంటి స్థాయివున్న మరికొన్ని పరిశోధన వ్యాసాలను వెలువరించాలని ఆకాంక్షిస్తూ ముగిస్తున్నాను.

# అభినం(వం)దన

—ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

"ఏనకేనాప్యుపాయేన" కీర్తి ప్రతిష్ఠలను గుంజుకోవాలని గింజుకోవడం యుగలక్షణమైన ఈ కాలంలో— సునిశిత పాండిత్యం, రచనాచతురత, ఉత్తమ రచనలు, బోధనాపాటవం, కార్యనిర్వహణచణత, ఉన్నతపదస్థితి ఉన్న ఏ వ్యక్తీ "నివురుగప్పిన నిప్పులా" ఉండడు. ఉన్నవాడుంటే "నరత్నమన్విష్యతి మృగ్యతేహితత్" అన్నట్లు స్వస్వరూప జ్ఞానం ఉన్నవాడన్నమాట! ఇలాంటి అరుదైనవ్యక్తి ఇరివెంటి కృష్ణమూర్తి. వీరి పాండిత్యం వినయ సౌజన్యాచ్ఛాదితం; మనుగడ నిరాడంబరతకు ప్రతీక. వీటినన్నింటిని మించిన సహృదయత, స్నేహశీలత ఇరివెంటివారి సహజాలంకారాలు.

వీరి రచనలన్నీ వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నవే! పండితులకు, పామరులకు-అందరికీ- కావలసిన రచనలవి. అయినా, అంతకుపూర్వం ఎవరూ చేబట్టనివి! కొందరు కొంతకుకొంత ప్రయత్నించినా, ప్రాతలో అసమగ్రంగా విడిచి వేసినవి! వారింతకుపూర్వం వ్రాసిన "చాటువులు" మొదలైన గ్రంథాలు ఈ కోవకు చెందిన వాగ్భూషణాలే! ఇప్పుడు వాటినన్నింటిని మించిన "కవిసమయములు" అనే పరిశోధన గ్రంథం వ్రాసి మనలనందరిని ఋణగ్రస్తులను చేశారు. డాక్టరు ఇరివెంటివారు బాహుభాషాకోవిదులైనా "పెక్కుమాటలు" చెప్పనివారు! చెప్పదలచిన విషయాన్ని సూటిగా తేటమాటలతో గుండెకుహత్తుకొనేటట్లు- స్తవంలేని వాస్తవం- చెప్పగలిగినవారు వీరి పుస్తకాలను నేను పదేపదే సంప్రదిస్తూ ఉంటానంటే వాటిమీద నాకున్న ప్రత్యయం స్వయం వ్యక్తమేగదా!

"కవిసమయములు" అనేపేరు విననివారు, విషయం పూర్తిగా తెలిసిన తెలియకపోయినా వాటినిగురించి కొంత ప్రస్తావించనివారు, తెలుగు సాహిత్యంలో పరిచయం ఉన్నవారు- ఎవరూ ఉండరు. అయినా వీటినిగురించి బాగా

తెలిసినవారి సంఖ్య తక్కువ. ఈ విషయాన్ని గురించి కొంత తెలుసుకోందా మని జిజ్ఞాస ఉన్నా దానిని మించి ఉన్న అలసత్వం కారణంగా కొందరు; విషయ పరిజ్ఞానం ఎలా లభిస్తుందో తెలియక కొందరు; ఉదాహరణల రూపంలో కొంత తెలుసుకొని సమగ్రజ్ఞానానికి ప్రయత్నించక కొందరు; పాండిత్యబలంతో విషయ పరిజ్ఞానం సంపాదించినా కావ్యశాస్త్ర ప్రపంచంలో ఈ విషయానికి విశేషప్రాముఖ్యం లేదని భావించి కొందరు- "కవిసమయములు'' అనే వాటి విషయంలో తూష్ణీభావం వహించి ఉండగా, డాక్టర్ ఇరివెంటివారు లక్ష్యలక్షణ సమన్వయయుతమైన సమగ్రగ్రంథం వ్రాసి అందరికి తృప్తి కలిగించారు. జిజ్ఞాస ఉన్న అలసులు వివిధ గ్రంథాలను శ్రమపడి అవలోడనం చేయనక్కర లేకుండ ఈ ఒక్క పుస్తకం ద్వారా సమస్త విషయాన్ని గ్రహించగలరు. విషయ పరిజ్ఞానం కావాలనుకొన్నవారికి- ఈ ఒక్క పుస్తకంచాలు. తమకు, ఈ విషయమై ఉన్నజ్ఞానాన్ని సమగ్రం చేసుకొనదలనన వారికి కూడాఇదిచాలు. ఈ విషయానికి కావ్యశాస్త్ర ప్రపంచంలో ప్రాముఖ్యంలేదని భావించే పండితులకు ఇది కనువిప్పు కలిగిస్తుంది. ఈ విధంగా డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి "కవిసమయములు'' సర్వులకు ఉపాదేయం.

ఈ గ్రంథరచన శాస్త్రీయమైన పద్ధతిలో నడిచింది. విషయవిశ్లేషణలో, వివరణలో పూర్వాపరసంబంధం దృఢంగా ఉండి పాఠకుని చేయిపట్టుకొని గహనవిషయాల నడుమనుండి ఈ గ్రంథం నడిపిస్తుంది. పాఠకునకు తెలిసిన విషయాలనుండి, ఆతనికి తెలియని తెలియతేయవలసిన విషయాంశాలవైపు క్రమానుగతంగా రచయిత ఆలోచనావిధానం పయనించి, అవగాహనకు ఆవశ్యకాలైన యుక్తిప్రయుక్తులతో ఉదాహరణలతో, కవిసమయాలకు సంబంధించిన సర్వవిషయాలతో సహృదయపఠితకు సంబంధం కల్పిస్తుంది ఈ ఉత్తమ గ్రంథం.

ఒక్కసారి రచనా ప్రణాళికను పరిశీలిస్తేనే ఈ గ్రంథరచనలో రచయిత అవలంబించిన శాస్త్రీయ విధానం అవగతమవుతుంది. ప్రథమ ప్రకరణం, కవి సమయ నిర్వచనంతో ప్రారంభిస్తుంది. ఈ ప్రకరణం- ఈ శాస్త్రగ్రంథానికి సముచితమైన నేపథ్యం సృష్టిస్తుంది. ప్రాకపశ్చిమ, సాహిత్య శాస్త్రవేత్తల, కవుల దృక్పథాలను ఇక్కడ రచయిత ప్రదర్శిస్తాడు. మన కావ్యశాస్త్రవేత్తల, కవుల అభిప్రాయాలతో- సంస్కృత రచయితల; తెలుగు రచయితల, కవుల

అభిప్రాయాలే కాకుండా, హిందీ రచయితలు ఈ విషయమై చెప్పినవాటిని కూడా పరిగణించి తన గ్రంథంలో వాటికి చోటుకల్పించడం డా॥ కృష్ణమూర్తి గారి బహుభాషాకోవిదత్వానికి తార్కాణంగా ఉండడమే కాకుండ, విషయ సమగ్రతకు దోహదం చేసింది. ఇంక, పాశ్చాత్య (ఇంగ్లీషు) దృక్పథాన్ని చెప్పే టప్పుడు- రొమాంటిక్ కవియైన షెల్లీనుండి మార్క్సు ప్రభావంసోకిన క్రిస్టొఫర్ కాడ్ వెల్ వరకు గ్రంథరచయిత పర్యాలోచిస్తాడు ! ఈ సాహిత్య శాస్త్ర గ్రంథానికి- డా॥ ఇరివెంటివారి గ్రంథాన్ని నేను సాహిత్య (కావ్య) శాస్త్ర గ్రంథం అంటాను- ప్రాణం రాజశేఖరుని "కావ్య మీమాంస" గనుక ఈ ప్రకరణంలో రచయిత, ఆ గ్రంథనేపథ్యంలో ఇతర సంస్కృత రచయితలన్న మాటలను కొన్నింటిని విశదీకరించి "సాహిత్య శాస్త్రము - కవిసమయములు" అనే తమ గ్రంథ ద్వితీయ ప్రకరణానికి నాందిపలికారు.

రాజశేఖరుని కంటె పూర్వమే "కవిసమయము" ల ప్రయోగాలు కవుల కావ్యాలలో కనబడుతూ ఉన్నా వాటిని గుర్తించి ప్రత్యేకంగా పేర్కొన్న కావ్య శాస్త్రగ్రంథం లేకపోవడంచేత రాజశేఖరుని కావ్యమీమాంసకు ప్రత్యేక స్థానం లభించిందని వివరిస్తూ ఆతని తరువాత ఈ విషయాన్ని గురించి వివిధ రీతులలో చెప్పిన సాహిత్యశాస్త్ర సమాలోచనలను గురించి డా॥ కృష్ణమూర్తి గారు ఈ ప్రకరణంలో వ్రాశారు. ఈ ప్రకరణంలో- కవిశిక్షారూపం, అలంకార సాధన రూపం, అదోషగుణరూపం, ధ్వని-వ్యంజనారూపం, ఔచిత్యరూపం అనే పేర్లతో ఉన్న ఉపశీర్షికల క్రింద రచయిత - ఈ దృష్టితో-సంస్కృతంలో ఉన్న కావ్య శాస్త్రగ్రంథాలను, కావ్యశాస్త్రజ్ఞులను కూలంకషంగా పరిశీలించారు. వ్రాసిన ప్రతివిషయానికి మూలగ్రంథాలలోనుండి ఆధారాలను చూపించడం, మన సంశయాలను నివృత్తిచేయడం ఇరివెంటివారి రచనలోని ప్రత్యేకత.

ఈ విధంగా మొదటి రెండు ప్రకరాణాలలో తాము చెప్పదలచిన గంభీర విషయానికి సోపపత్తికమూ సముచితమూ అయిన నేపథ్యాన్ని రచించి మూడో ప్రకరణలో "కవిసమయములు - వర్గీకరణము" అను అంశాన్ని విపులంగా వివరించారు డా॥ కృష్ణమూర్తిగారు. ఏ విషయాన్నైనా సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి వివిధ దృష్టికోణాలనుండి దాన్ని పరిశీలించడం అనివార్యమే కాక అభిలషణీయం అని గుర్తించిన వివేకచూడామణి మన రచయిత. ఈ శాస్త్రగ్రంథం, ఈ ప్రాతిపదికమీద నడవడం దీని విశేషం.

మొట్టమొదట రచయిత రాజశేఖరుని వర్గీకరణను వివరించారు. అవి- స్వర్గ, భౌమ, పాతాళీయములనునవి. వీటిలో- రాజశేఖరుని దృష్టిలో- భౌమ కవిసమయాలు ప్రధానాలు- కనుక వీటినిపునః- జాతి, ద్రవ్య, గుణ క్రియా రూపాలుగా విభజించి తిరిగి వీటిలో ప్రతిఒక్కదానిని మూడు విభాగాలుగా సంస్కృత రచయిత విభజించాడు. ("త్వేపి ప్రత్యేకం త్రిధా- అసతో నిబన్ధనాత్, సతోఽప్యనిబన్ధనాత్, నియమతశ్చ"- రాజశేఖరః) ఈ విభజనలోని సామంజస్యాన్ని ఇవెంటివారు గుర్తించి వ్రాస్తూ- "రాజశేఖరుడు జాతి ద్రవ్య గుణక్రియా విభజనమునందు ఒక్కొక్క దానిని అసదుల్లేఖనము, సదనుల్లేఖనము, నియమము, అను మూడు విధములుగాచెప్పి ఉదాహరణము లిచ్చుట చూడగా జాత్యాది విభజనమునకు కాక అసదుల్లేఖనాది విభజనమునకే ప్రాముఖ్యమున్నట్లు స్పష్టమగుచున్నది..." అని చెప్పి ఈ విషయమై తమ విచక్షణాజ్ఞానమును వ్యక్తంచేశారు. శాస్త్ర గ్రంథాలలో ఎన్ని సూక్ష్మవిభాగాలున్నా వాటిలో- లోకదృష్టి ననుసరించి- ప్రాముఖ్యాన్ని పొందినవాటిని పృథక్కరించి చూపించడం వివేకమున్న విమర్శకుని ప్రథమకర్తవ్యంగదా !

ఈ తృతీయ ప్రకరణలో- ప్రథమ ద్వితీయ భాగాలున్నాయి. ప్రథమ భాగంలో "అసత్తును నిబంధించు కవిసమయములను ఒక్కొక్కటిగా పేర్కొని వాని సామంజస్యమును" రచయిత విశ్లేషించి చూపించినారు. ఇంచుమించుగానివి రెండువందలవరకు నున్నవి. వీటి నన్నింటిని విశ్లేషించి వివరించడంతో తృప్తిపడని మన కృష్ణమూర్తిగారు సంస్కృత రచనలలో నుండి మాత్రమేకాక తెలుగు రచనల నుండి కూడ ఉదాహరణాలు చూపించి సహృదయ పఠితలకు సమ్మోదం కల్పించారు. ఇదివెంటివారి శాస్త్రగ్రంథం, కేవలం రాజశేఖరుని కావ్యమీమాంసకు అనువాదప్రాయం కాదుగనుక, కావ్యమీమాంసలో కవిసమయాలలో చేరని-కాని మనకనుభూతమైన-వృక్షదోహదాలను కూడ ఇందు చేర్చి చర్చించారు. ఇలాంటి విషయాలే ఈ శాస్త్రగ్రంథపూర్ణత్వానికి సాయపడినవి ! తమ భావాలకు అనుగుణంగా అభిప్రాయాలు వ్యక్తం చేసిన ఆధునికులైన తెలుగురచయితల అభిప్రాయాలను ఆధారాలుగా గ్రహించడాన్ని కూడా ఈ పూర్ణత్వానికి కారణంగా చెప్పవచ్చు. గుడిపాటి వెంకటచలంగారి "కవి హృదయమంటేనే విషయాన్ని out of proporationగా చూడడమనుకుంటాను" అను వాక్యాన్ని ఉల్లేఖించడం ఈ సందర్భంలో చెప్పుకోదగ్గది.

ఈ ప్రకరణం ద్వితీయభాగంలో "సత్తును నిబంధింపకుండుటను సూచించు కవి సమయములను ఒక్కొక్కటిగా పేర్కొని వాని సామంజస్యమును" రచయిత నిరూపించారు. ఈ సందర్భమున కవి దృష్టికి, లౌకికదృష్టికి గల భేదాలను కూడా చక్కగా సోదాహరణంగా వివరించారు. ఈ ప్రకరణంలోని తృతీయభాగంలో "నియమము అను సంకేతమునందు కొన్ని కవిసమయ స్వరూప స్వభావములను" వివరించారు. ఇట, మన ఆలంకారికులు పేర్కొన్న నియమాలన్నింటిని చూపించి వాటి స్వరూప స్వభావాలు ప్రదర్శించారు. మకరాలు సముద్రంలోనే ఉన్నట్లు, ముత్యాలు తామ్రపర్ణినదిలోనే లభించేటట్లు వర్ణించడం మొదలైనవి ఈ భాగంలో వస్తాయి.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి ఈ శాస్త్ర గ్రంథంలో చతుర్థప్రకరణంలో-కవిసమయాభాసములు, పంచమప్రకరణంలో-కవిసమయాప్రయోజనము సమ్యక్సప్రష్టములు వీటిలో కవిసమయాభాసాలను వివరించేటప్పుడు సంఖ్యాత్మక నియమాలను గురించి ముందు ప్రస్తావించారు రచయిత. ఈ సందర్భంలో రాజశేఖరుడు కావ్యమీమాంస శాస్త్రనిర్దేశమనే ద్వితీయాధ్యాయంలో, దేశవిభాగమనే సప్తదశోఽధ్యాయంలో చెప్పినవాటిని ఆధారంగా ఇరివెంటివారు గ్రహించారు. ఈ అధ్యాయమందే "న్యాయములు కవిసమయములు" కావు అని కంఠోక్తిగాచెప్పి, "న్యాయములన్నియు నిత్యజీవితమునందు అనుభవమునకు వచ్చు సత్యాంశములు, శాస్త్రనిహితములు, లౌకికములైన ఈ న్యాయములు కవిసమయములు కావు" అని స్పష్టంచేశారు. ఇంతటితో తృప్తిపడక "కొందరు న్యాయముల లక్షణములను చూచి అవి కవిసమయలే అను భ్రాంతికి లోనగుచున్నారు. కనుక న్యాయములను కవిసమయాభాసములని చెప్పవలసి వచ్చినది." అని నిష్కర్షగా చెప్పారు !

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి "కవిసమయములు" అనే శాస్త్ర గ్రంథంలో ఐదవ ప్రకరణం "కవిసమయ ప్రయోజనము" అనేది. నిర్వచన, వర్గీకరణాది సమస్త విషయముల చర్చతరువాత వాటి ప్రయోజనాన్ని చెప్పడం న్యాయమేగదా ! ఈ లఘుప్రకరణంలో మమ్మటాదులు కావ్యప్రయోజనాన్ని గురించిచెప్పిన వాక్యాలు ఉటంకిస్తూ "కవిసమయ తత్త్వపరిశీలనమునకు, కావ్యతత్త్వ పరిశీలనమునకు నడుమనున్నయవనిక కడుసున్నితమైనది. సూక్ష్మమైనది. ఈ తెర ఆభాసము వంటిదన్నను ప్రమాదములేదు" అని రచ

యిత వ్రాయడం సమంజసం. గ్రంథంలోని ఆరో ప్రకరణం ఉపసంహారం. దీనిలో రచయిత ప్రాచీన కవుల విషయంలో మాత్రమే కాకుండా ఆధునికుల విషయంలోను కవిసమయాలు ఎంత అర్థవంతాలో వివరించారు. ఈ సందర్భంలో ఆయన వ్రాసిన క్రింది వాక్యాలు పరమసత్యాలు :

"నేటికిని విద్వత్కవుల రచనలలో సంప్రదాయ సిద్ధముగా మనకు అందిన కవిసమయములు ప్రత్యక్షములగుచున్నవి. వానిని ప్రాచీనములనియును నిరర్థకములనియును అభూతకల్పనలనియును అవాస్తవికకల్పనలనియును మిథ్యాకథనములనియును త్రోసిరాజని తూష్ణీంభావమును వహించినచో విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము, పింగళికాటూరి సౌందరనందము, గడియారమువారి శివభారతము, రాజశేఖరశతావధానిగారి రాణా ప్రతాపసింహ చరిత్రము, మధునాపంతులవారి ఆంధ్రపురాణము, వానమామలై వరదాచార్యులవారి పోతన చరిత్రము, నారాయణరెడ్డిగారి కర్పూరవసంతరాయలు, దాశరథిగారి అగ్నిధార మున్నగు జనప్రియములైన మహాకావ్యముల మాట అటుంచి, ప్రాచీన కవితారీతులపై దండెత్తిన అభ్యుదయకవి మూర్ధన్యుడు శ్రీశ్రీమహా ప్రస్థానముకూడ అర్థముకాదు. సంప్రదాయ ప్రభావమే అననేల ? కవిత్వ తత్వమునే పరిశీలించినచో దానికి క్రొత్తపాతలు లేవనియు, అది 'క్రొత్తపాతలమేలికలయిక' అనియు నిత్యనూతన మనియు స్పష్టమగును. క్రొత్తసూర్యుడు ప్రాతసూర్యుడు ఉండరు. క్రొత్తహృదయము ప్రాతహృదయము ఉండవు. నిన్న కావ్యజగత్తులో కవిసమయములు రసానుభూతికి కారణముగా ఉండెననుటయు, నిన్న వెన్నెల చల్లగా ఉండెననుటయు ఒక్కటియే."

ఈ శాస్త్రగ్రంథానికి ఉన్న "అనుబంధములు" కూడ చాలాముఖ్యమైనవి. సంస్కృతంలోని వివిధ శాస్త్రగ్రంథాలలోని (ఈ విషయానికి సంబంధించిన మూలశ్లోకాలు ఇక్కడ రచయిత ఇచ్చారు. వీటి ఆవశ్యకం ఎంతైనా ఉంది. తరువాత ప్రసిద్ధోపమా సామగ్రిని, కవిసమయాలను పట్టికలుగా ఇచ్చారు. తక్షణం చూసుకోవడానికి ఇవి చాలాబాగా ఉపకరిస్తాయి.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి ఈ శాస్త్రగ్రంథం పండితులకు పామరులకు-అందరకు-పనికివస్తుంది. చదివిన విషయమే చప్పునతట్టనప్పుడు జ్ఞాపకం తెచ్చుకోవడానికి పండితులకు; అసలు విషయాన్ని గ్రహించడానికి పామరులకు

(అంటే పండితులు కాకపోయినా ఇలాంటి విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ఉన్న విద్యావంతులన్నమాట !) ఈ గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుంది. ఈ రచయితను ప్రోత్సహిస్తూ డా॥ సి. నారాయణరెడ్డిగారన్న "అలంకార శాస్త్రమునందు అనాదృతముగా ఉండిపోయిన కవిసమయముల విశ్లేషణ మవసరమే" అనే వాక్యానికి వెనుకఉన్న భావమిదే !

మంచిపుస్తకం వ్రాయడం కష్టం. అందరికీ పనికివచ్చే మంచిపుస్తకం వ్రాయడం మరీకష్టం. ఈ కష్టమైన పనిని సులభసుందరంగా నిర్వహించిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు మన కృతజ్ఞతలకు పాత్రులు. ఆయనకు నా అభినం(వం)దనలు.

# అభినందన

**ఆచార్య ఎం. కులశేఖరరావు**

**ఆంధ్రశాఖాధ్యక్షులు ఉస్మానియా విశ్వవిద్యాలయం.**

మాన్యమిత్రులు డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారు బహుభాషాకోవిదులు హాస్యప్రియులు, సరస సంభాషణా చతురులు వారు ఉన్న మిత్రమండలిలో అయినా సమావేశాలలో అయినా, నవ్వుల వెన్నెలలు నిండిపోవలసినదే వారి ఈ సుగుణసంపత్తి నాకు గడచిన ముప్పది సంవత్సరాలుగా తెలుసు. ఇటువంటి సహృదయులైన కృష్ణమూర్తి గారు సాహిత్య పరిశోధనకు పూనుకొంటే, ఆహ్లాదకరమైన ఒక పరిశోధనాంశాన్ని గ్రహించి, దాన్ని మరింత ఆహ్లాదకరంగా చేసి, పరిశోధన ముగిస్తారని నేను అనుకునేవాణ్ని. కాని నా అంచనకు భిన్నంగా అలంకార శాస్త్రంలో ఒక ముఖ్య భాగమైన 'కవి సమయములు' అనే విషయాన్ని గ్రహించడం, దానికి సమగ్ర పరిశీలనా గ్రంథం వ్రాయడం జరిగింది. శ్రీ కృష్ణమూర్తి గారు ఏది చేసినా సమగ్రంగా చేస్తారు అనే విషయం ఈ గ్రంథం చదివిన తరువాత స్పష్టంగా తెలియవచ్చింది.

కవులు వ్రాసిన అనేక కావ్యాలను లక్ష్యంగా పెట్టుకొని, అలంకార శాస్త్రం అనే లక్షణం ఏర్పడింది. ఇది ఒకనాటి కృషి కాదు. తరతరాలుగా కవులు, లక్షణకారులు చేసిన వ్యవసాయ ఫలితం ఇది. ఈ అలంకార శాస్త్రం, కవులకు, వారు సృష్టించే సాహిత్య ప్రక్రియలకు కొన్ని నియమాలను విధిస్తున్నది. వ్యక్తికి, సంఘానికి, వ్యవస్థకు నియమాలు ఉన్నప్పుడు, కవికి, అతని సృష్టికి, కూడ కొన్ని నియమాలు అవసరమే బహుశా ఈ దృష్టితోనే సాహిత్య శాస్త్రం రూపుదిద్దుకొన్నది

మన దేశంలోని కవులు సాహిత్యకులు, అలంకార శాస్త్రం విధించిన నియమాల పట్ల తరతరాలుగా గౌరవం చూపుతునే ఉన్నారు. విశేషమేమంటే ఈ శాస్త్రం సంస్కృతంలో వెలువడినప్పటికి, సంస్కృతేతర భాషాభిజ్ఞులకు, సాహిత్యకులకు శిరోధార్యమైనది. దీనివల్ల ఆ శాస్త్రశక్తి ఎటువంటిదో స్పష్టం అవుతున్నది.

కవి అలంకారాలను రచించినా, ఉపమానాలను గ్రహించినా, ఒక పరిధిలో ఉన్న మర్యాదను అతిక్రమించక ప్రవర్తించవలెనని కవి సమయములు విధిస్తున్నవి. ఈ పధి కవికి, కవిత్వానికి చాలా ఆరోగ్యప్రదమైంది. పరోక్షంగా సాంఘిక వ్యవస్థకు కూడ ఈ విధి ఆరోగ్యాన్ని కలిగించేదే. అందుచేతనే కవులు కాని, వ్యవస్థగాని, నిరంకుశాలు కాక పోవడానికి ఈ నియమాలు కొంత వరకైనా కారణమైనాయి.

'కవి సమయాలు' అనే ఈ గ్రంథంలో, పరిశోధకుడు లక్షణకారుల దృష్టిలో దీనికి ఉండే నిర్వచనాలు, పరిధి, చక్కగా చర్చించడమేకాక, ఆ సమయంలో ఉండే బాగోగులను శాస్త్రబద్ధంగా వివరించినారుకూడా. ఈ చర్చ ఆసక్తికరంగాను, హేతుబద్ధంగాను కనిపిస్తున్నది. పరిశోధనకు ఉండవలసిన దృష్టి నైశిత్యం ప్రస్ఫుటమైంది. కవి సమయాల్లో ఒకటి, వర్షాకాలమందే మయూర నృత్యక్రేంకారములు వర్ణింపవలెనను. ఈ నియమాన్ని కవులందరు పాటిస్తారు. నింగిలోని మబ్బుల గర్జనలకు, నెమళ్ళ ఆటలకు, సంబంధం కలిగించి కవులు ఉత్ప్రేక్షిస్తూ ఉంటారు.

ఈ మర్యాదకు శాస్త్రబద్ధమైన ఆధారం ఉన్నదా అని శ్రీ కృష్ణమూర్తి గారు చక్కగా చర్చచేసినారు. వారి వివరణ ఇట్లు ఉన్నది. "వర్షాకాలముననే నెమళ్ళు, మత్తిల్లి సంతోషంతో నృత్యము చేయును కేకలు పెట్టును. జూన్ మొదలు కాని సెప్టెంబరు వరకు గల నాలుగు మాసముల కాలము సహవాసమునకును, గర్భాధానమునకును అనుకూలమైన కాలము, ఈ కాలమున మయూరములు పురివిప్పి నర్తించుచు, ధ్వనులు చేయుచు, మయూరులను ఆకర్షించును. వానిని మోహింపచేయును.వర్షాకాలము తరువాత నెమళ్ళ ఈకలు ఊడిపోవును. వాని కేకలు చప్పబడును. ఈ స్థితిలో వర్షర్తువునందు వలెవాటి నాట్యములో అత్యంత సౌందర్యముగాని క్రేంకారములలో ఉత్కృష్టమాధుర్యము గాని ఉండదు. ఈ వ్యాపారమును దృష్టియందు ఉంచుకొనియే నెమళ్ళు వర్షాకాలము నందే నృత్యములు చేయుననియు కేకలు వేయుననియు కవి సమయము ఏర్పడినది." ఇటువంటి వివరణలు ఈ గ్రంథంలో చాలాఉన్నవి. మకర సముద్రముల సంబంధం, చంపక భ్రమరముల వైరుధ్యం, పద్మ సూర్యుల సాన్నిహిత్యము మొదలైన విషయాలు అనేకంగా చర్చింపబడినాయి. గతానుగతికంగా వ్రాసే కవులకు, పండితు

లకు ఈ చర్యలు కనువెలుగును చూపిస్తాయనడంలో సందేహం లేదు. కవి సమయాలు కావ్యానికి, సౌందర్యాన్ని సంతరింపచేసే ప్రధాన సాధనాలని చెప్తూనే కృష్ణమూర్తిగారు ఇది మన సంస్కృతి రహస్యాలను, మహత్వాది సంప్రదాయాలను కవిత్వాంశాలను సాక్షాత్కరింప చేస్తున్నాయని సప్రమాణంగా వక్కాణించినారు. భారతీయ ఆత్మావిష్కరణకు. కవి సమయాలు అత్యంత ఉపయుక్తంగా ఉన్నాయని వారు భావించి, అలంకార శాస్త్రంలోని ఈ విభాగానికి సామాజిక ప్రయోజనం ఏ విధంగా సంపన్నమైందో చూపించినారు.

ఈ గ్రంథంలో ఉండే అనేకానేక విషయాల్లో నేను చెప్పినవి స్వల్పమైనవి ఆసక్తికరమైన అలంకారిక చర్చ, లాక్షణికుల అభిప్రాయ విశ్లేషణ, ఈ పరిశోధనా గ్రంథానికి ప్రాణప్రదంగా ఉన్నాయి. ఇటువంటి ఉత్తమ విశ్లేషణ గ్రంథం రచించిన మాన్యమిత్రులు డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

# కలికితురాయి

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
ఆంధ్రశాఖాధ్యక్షులు, హైదరాబాదు
కేంద్ర విశ్వవిద్యాలయం.

లక్షణగ్రంథాలు ప్రధానంగా కవులకూ, సౌందర్యతత్త్వమీమాంసనసహృదయులకూ ఉపయోగపడతాయని విమర్శకులు అభిప్రాయపడుతూ ఉంటారు కొన్ని అలంకార గ్రంథాలు ఉభయతారకాలుగానూ ఉంటాయి. భరతనాట్యశాస్త్రం ఉభయతారకమైన ఉత్తమ లక్షణ గ్రంథంగా చెప్పవచ్చు. నటులకూ, కవులకూ, సహృదయులకూ అది ఉపాదేయం. రాజశేఖరుని కావ్యమీమాంస ముఖ్యంగా కవిశిక్షా గ్రంథంగా గోచరిస్తుంది. రచయితగా ఒక వ్యక్తిత్వాన్ని సంతరించుకోవాలన్నా, కావ్యరచనా ప్రయోగం చేపట్టాలన్నా కావ్యమీమాంస తప్పనిసరిగా చదువవలసిన గ్రంథం. ఆధునికంగా చెప్పవలసివస్తే రచయితలకు ఉపయోగపడే ఒక సంశ్లిష్ట అధ్యయన ప్రణాళిక అని చెప్పవచ్చు. అందులో కవిగాని, రచయితగాని నేర్చుకోనవలసిన అనేకానేకాంశాల్లో ముఖ్యమైన అంశం 'కవి సమయాలు' పద్దెనిమిది అధ్యాయాలలో వాటికి మూడధ్యాయాలు కేటాయించాడు. రాజశేఖరుడు.

కవిసమయాన్ని గురించి సూత్రించిందీ. వివరించిందీ అయిన కావ్యమీమాంస ఆ అంశంలో ప్రామాణికంగా లాక్షణికులచేతా, విమర్శకులచేతా పరిగణింపబడుతోంది. కవిసమయంలోని అర్థం అశాస్త్రీయంగానూ, అలౌకంగానూ, పరంపరాయాతంగానూ ఉంటుందని రాజశేఖరుని నిష్కర్ష. ఈ మూడు లక్షణాలనూ ప్రధానంగా చేసికొని కవిసమయాలను విశ్లేషించి సోదాహరణంగా వివరించాడు. కవికి తాను వివేచించి చెప్పదలుచుకొన్న అంశాన్ని సవిస్తరంగా రచించి రాజశేఖరుడు కృతకృత్యుడైనాడు. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు రాజశేఖరుని వివేచనను ప్రాతిపదికగా చేసికొని కవిసమయాలను గురించి పరిశోధన గ్రంథాన్ని రచించినారు.

కావ్యానికి లక్షణం చెప్పటం లాక్షణికుడు చేసేపని. ఆ లాక్షణికుడు వివరించిన ఒక కావ్యాంశాన్ని తులనాత్మకంగా పరిశీలించటం వివేచకుడు చేసేపని. లాక్షణికుని ప్రతిపాదనలోని గుణదోషాలను నిరూపించటం విమర్శకుడు చేసేపని. మరి పరిశోధకుడు చేసేపని యేంటి? డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి పరిశోధన ప్రణాళిక దానికి ఉదాహరణంగా నిలుస్తున్నది. "కవి సమయములు పుట్టుకను, ఔచిత్యానౌచిత్యములను పరిశీలించినాను... ...కవిసమయములుగా సాధారణముగా భావింపబడుచున్న వాని నెన్నింటినో కవిసమయాభాసములుగా నిరూపించి యున్నాను. కవిసమయముల ప్రయోజనమును గూర్చియు, కల్పనా ప్రధానమైన కావ్యజగత్తులో వాని ప్రాధాన్యమును గూర్చియు వివరించుటకు ఈ సిద్ధాంతవ్యాసమున ప్రయత్నించినాను." పరిశోధన లక్షణసూక్తం కాదు; వివరణం కూడా కాదు; లక్షణ పరిశోధనం. లక్షణ గ్రంథంలోని ఒక అంశాన్ని ఇలా నిగ్గు తేల్చటం తేలికైన పనికాదు.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు కవి సమయాలను, సమయాభాసాలనూ వివేచించటంలో ప్రజ్ఞాపాటవాన్ని, పరిశోధనశక్తినీ, వెలార్చారు. ఉదాహరణకు జలాశయాలలో హంసలు మొదలైన పక్షులు లేకపోయినా ఉన్నట్టు కవులు రచించటం కవిసమయం. దీనికి కారణం పక్షులులేని జలాశయాలు సాధారణంగా లోకంలో ఉండవనే ప్రజల విశ్వాసం మూలం కావచ్చు. ఈ విశ్వాసంగా చెప్పబడే అంశం విచిత్రమైంది. వాస్తవ జీవితం అందించే అనుభూతులను సమగ్ర సుందరం చేసుకోవాలని భావుకుడు. కళనూ, సాహిత్యాన్ని ఆశ్రయిస్తాడు. జలాసయ సమగ్ర సౌందర్య దర్శనాకాంక్షనుండి ఏర్పడిన కామన హంసాదుల కల్పనకు మూలం అవుతుంది. సాహిత్యం సామాజికులకు సమగ్రానుభవ స్ఫూర్తిని అందించే స్థిర సౌందర్య వ్యక్తికి నమూనాలుగా కవి సమయాలు కావ్యలోకంలో స్థిరమౌతున్నాయి. చకోరాలుచంద్రికాపానం చేస్తాయన్న కవిసమయం ఎలా ఏర్పడింది. అని శాస్త్రీయంగా నిరూపించవచ్చు; నిరూపింపలేకపోవచ్చు. కాని, చకోరాలు వెన్నెలను గ్రోలటం సహృదయుడు పొందే సాహితీ కళానుభవానికి ఒక నిండైన నమూనా. అలాగే, ముఖాన్ని చంద్రబింబంతోనే పోల్చటం అనేది కవి సమయమై పోయింది. ఉపమాద్రవ్యాలు ఎన్నైనా ఉండవచ్చు. కాని, కాంతిమంతమై, హృదయాహ్లాదజనకమైన కాంతాముఖ దర్శనానుభవం ఏ కాలంలోనైనా ఆ ఉపమానం లోకానికి అందించినంతగా మరోఉపమానము అందించటం

లేదు. కవి సమయానికి సహృదయానుభవ సమగ్రతయే పరమ ప్రమాణం. ఆ ప్రమాణం కుదిరిననాడు అది పరంపరగా కవితలో ప్రయుక్తమౌతుంది.

కవిసమయం రసపోషకంగా ప్రయుక్తమౌతుందనీ, ఔచిత్యం దానికి జీవితమనీ, జాతి సంస్కృతినీ, ఆలోచనాధోరణినీ, సౌందర్యతత్వ సమాలోచననూ, వ్యక్తం చేస్తుందనీ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు నిరూపించిన విధం సముజ్జ్వలం. న్యాయాలు కవిసమయాలు కావని నిరూపించటం కృష్ణమూర్తిగారి వివేచన ఫలం.

డా॥ కృష్ణమూర్తిగారు అపారలోకానుభవం కలవారు; సాహిత్యాన్ని సజీవస్రవంతిగా దర్శించేవారు. వారు మిత్రులతో ఏ చిన్ని అంశాన్నయినా తీసికొని చర్చించేటప్పుడు వారి విస్తృతమైన వ్యుత్పత్తి వ్యక్తమౌతుంది. వారితో మాట్లాడటం ఒక ఎడ్యుకేషన్ అని మనకు అనిపిస్తుంది. వారి ప్రవృత్తికి తగిన పరిశోధన దొరికింది, వామనుడు త్రివిక్రముడైనట్లున్నది. కవిసమయాల మీద పరిశోధనం. పరిమితమైన అంశంమీద పరిపూర్ణమైన పరిశోధన చేయటానికి ఈ సిద్ధాంతవ్యాసం. చక్కని ఉదాహరణం. సాహిత్యమర్మాలను సహృదయులకు సరళంగా అందించే ఉద్యమం యువభారతి ఊపిరి. ఆ సంస్థ లక్ష్యానికి ఈ రచన ఒక కలికితురాయి.

# శుభాకాంక్షలు

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

మిత్రులు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారి సిద్ధాంత వ్యాసం వెలుగులోనికి రావడం సంతోషకరమైన సంగతి. కృష్ణమూర్తి శ్రేయోభిలాషినీ, ఆప్తుడనూ కావడంవల్ల నాసంతోషం మరింత అతిశయించినది.

ఈ సిద్ధాంత వ్యాసానికి అనేక యోగ్యతలున్నవి. పరిమాణంలో చిన్నదైనా ప్రమాణంలో ప్రథమశ్రేణికి చెందినది. వాస్తవానికి ఇదీ సిద్ధాంతవ్యాసాలకు మార్గదర్శకం కావాలని నా దృఢమైన అభిప్రాయం.

సాధారణంగా సిద్ధాంత వ్యాసాలు వ్రాసేవారు కొంత అధ్యయనం చేసి, కొంత నిశితంగా ఆలోచించి తమ సిద్ధాంత వ్యాసానికి కావలసిన అంశాన్ని ఎన్నుకోవడం మంచిపద్ధతి. ఈ విధమైన పద్ధతిని కృష్ణమూర్తిగారు అనుసరించడంవల్ల ఆయన పరిశోధనా కార్యక్రమం ప్రారంభించడంలో కొంత ఆలస్యం జరిగింది. ఆలస్యమైనా ఉత్తమస్థాయికి చెందిన సిద్ధాంత వ్యాసం మనకు లభించింది.

కొన్ని సిద్ధాంతవ్యాసాలు చదివినప్పుడు ఇతర భాషా సాహిత్యాలతో పరిచయంలేని లోపం మనకు కనిపిస్తున్న నిదర్శనాలు ఉన్నవి. పరిశోధకులకు ఇతర భాషా సాహిత్యాలతో పరిచయం అనివార్యమైన యోగ్యత అని నా నమ్మకం.

బహు గ్రంథావలోకనం, బహు భాషలతో పరిచయం, బహు దేశబుధులతో సంభాషణం కృష్ణమూర్తిగారి ప్రత్యేక యోగ్యతలు. ఈ యోగ్యతలతో కృష్ణమూర్తి ఒక మంచి అంశాన్ని పరిశోధనకు ఎన్నుకొని, ప్రామాణికమైన సిద్ధాంతవ్యాసాన్ని రూపొందించినారు. ఈ మాట గుణపక్షపాతం వల్లచెప్పినది.

డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి నా హార్దిక అభినందనాలు, శుభాకాంక్షలు.

# భక్త్యంజలి

విశ్వవిద్యాలయస్థాయిలో నన్నొక విద్యార్థిగా తీర్చిదిద్ది,
నాలో సాహిత్యజిజ్ఞాసను మేల్కొల్పి,
నా జీవితానికి లక్ష్యాన్ని ప్రసాదించిన
మనీషివతంసులు, మానవతామూర్తులు, ఉత్తమ దేశికులు,

ఆచార్య ఖండవల్లి లక్ష్మి రంజనంగారు
ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు
డాక్టర్ పల్లా దుర్గయ్యగారు
విద్వాన్ శ్రీ వెల్లలూరు వేంకటరాఘవ శర్మగారు

నా గురువుల దివ్యస్మృతికి

# సమర్పణం

సంస్కృతాంధ్ర భాషలలో చక్కని అభివేశాన్ని,
ఆయుర్వేదజ్యోతిర్వేదాలలో తలస్పర్శిపరిచయాన్ని సంపాదించి,
పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి "సాక్షి" వ్యాసాలలోని భాషా చమత్కృతిని తమ వచోవైఖరితో మేళవించి,

కందుకూరి వీరేశలింగంపంతులుగారి సాంఘికసంస్కరణోద్దేశాలను ఆచరణలో పెట్టి,
అనుదారులైన దాయాదులు ఆస్తిని కాజేసినా, స్వాభిమానంతో, సచ్ఛీలతా స్ఫూర్తితో తమ వ్యక్తిత్వాన్ని మలచుకొని,

భగవద్ధ్యానాన్ని, పూజాపురస్కారాలనూ అలవాటుగా చేసుకునే కర్మకాండను నిరసించి, ధన్యులై అవ్యంధ్య జీవనం గడిపిన మా తండ్రి గారు, యశః కాయులు,

బ్రహ్మశ్రీ ఇరివెంటి రాఘవశాస్త్రిగారి దివ్యస్మృతికి.

# ధన్యోస్మి

'కవిసమయముల'ను గూర్చి పరిశోధన సాగించడానికి అవకాశం కల్పించి, సిద్ధాంత వ్యాసాన్ని ముద్రించుకునేందుకు అనుమతించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞతలు.

పరిశోధనకు అంశాన్ని సూచించి, పరిశోధనా వ్యాసంగాన్ని పర్యవేక్షించి, ఎన్నివిధాలనో ప్రోత్సహించి, సముచితములైన సూచనలతో సిద్ధాంత వ్యాసాన్ని తీర్చిదిద్దిన సహృదయులు శబ్దార్థ రహస్య మెరిగిన సుకవులు. స్నేహమూర్తులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి ధన్యవాదములు.

ఈ సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా వ్యవహరించి నన్ను కృతార్థుణ్ణి చేసిన సహృదయులు అశేషశేముషీ సంపన్నులు, ప్రతిభామూర్తులు ఆచార్య శ్రీ ఎస్. వి. జోగారావుగారికి, ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికి వినమ్రాంజలి వందనములు.

శుభాశీస్సులనందజేసి, తమ అమూల్యాభిప్రాయంతో ఈ పుస్తకం విలువ పెంచిన బహుభాషావేత్తలు, ఉన్నత ప్రమాణాలందుకున్న పరిశోధకులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారికి అభివందనం.

ఆశీర్వచనాన్ని అందించిన పూజ్యులు సహృదయులు, సాహిత్య సేవా పరాయణులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నమస్సులు.

నన్ను అభినందించిన నా సహాధ్యాయులు, నిత్యాధ్యయనపరులు, బహు గ్రంథప్రణేతలు, పరిశోధకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు, ఆచార్య ఎం. కులశేఖరరావుగారికి కృతజ్ఞతలు.

సువిఖ్యాత సాహిత్య విమర్శకులు, నూతనాంశగవేషణాతత్పరులు, హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు, 'యువభారతి' ప్రచురణల ప్రధాన సంపాదకులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి ధన్యవాదములు.

కడచిన రెండు దశాబ్దాలుగా నా వ్యక్తిత్వాన్నేమలిచి, ఎందరో మహిత ప్రతిభాసముపేతులైన రచయితలతో నాకు పరిచయం కలిగించి, నన్నెంతో చదివించి, నన్ను రచనకు పురికొల్పి, సాహిత్యోద్యమంలో పాల్గొనే అవకాశం కలిగించింది 'యువభారతి'. 'యువభారతి' సంస్థాపకుల్లో ఒకరైన ఆచార్య వంగపల్లి విశ్వనాథం విజ్ఞత, దక్షత, సంస్కారం ఆ సంస్థను తీర్చిదిద్దినవి. సంస్థ పక్షాన శుభాకాంక్షలు ప్రకటించిన ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారికి కృతజ్ఞతలు. ఈ గ్రంథ ప్రచురణ బాధ్యతను తమదిగా భావించిన యువభారతి మిత్రులను విశేషించి సంస్థకార్యదర్శి శ్రీ ఎస్. వి. ప్రభాకర్‌ను నేనెన్నడూ మరువజాలను.

సంస్కృతంలో ఉన్న సాహిత్య శాస్త్ర గ్రంథాలను పరామర్శిస్తున్నప్పుడు నాకు కలిగిన సందేహాలను నివృత్తిచేసి నన్ను ప్రోత్సహించిన సుప్రసిద్ధ విద్వాంసులు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి అభివందనం.

అధ్యయనం, అధ్యాపనం నాకు ఎంత నేర్పినా, నా కలానికి వేగాన్ని అందియ్యలేకపోయినవి. మాటసాగినంత వేగంగా వ్రాతసాగదు. ఈ పట్టున నాకు అండగా నిలచి నేను చెప్పిందంతా వ్రాసి నా పరిశోధనాసాఫల్యానికి చేదోడైన వైదోడు ఉత్తమకవి, పరిశోధకుడు, సౌజన్యమూర్తి డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులకు నా శుభాకాంక్షలు.

ఈ నా సాహిత్యకృషికి ఎల్లవేళల్లో సాధువాదం పలుకుతూ, నా వెన్ను తట్టుతూ. నా అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తున్న నా అన్నగారు, ఆదర్శ అధ్యాపకులు, చతురవచోవిలాసులు, సౌమ్యమూర్తులు బ్రహ్మశ్రీ ఇవటూరి రామస్వామి ఎం.ఎ.బి.ఇడి. గారికి నా ప్రణుతులు.

కళాశాలల్లో, ప్రయాణాల్లో, సభల్లో విందుల్లో. గ్రంథాలయాల్లో నా పరిశోధన కృషిని పరామర్శిస్తూ నాకు చేయూతనిచ్చిన మహాకవి దాశరథికీ, ఆచార్య బి రామరాజుగారికీ, ఆచార్య కె. గోపాలకృష్ణరావుగారికి, ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారికీ, ఆచార్య ఎం. ఆర్. సత్యనారాయణగారికీ నమస్కృతులు.

శుద్ధప్రతిని సిద్ధంచేయడంతో నాకు తోడ్పడిన 'సుధామ'కూ, ఆర్. వసునందన్‌కూ ముద్రణ సందర్భంగా ఎన్నో విధాల సహకరించిన శ్రీ పాండు రంగయ్యకూ కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత వ్యాస ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించి ఆదుకున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారికి కృతజ్ఞతలు.

సిద్ధాంత వ్యాసరచనా సందర్భంగా, నా ఆలోచనలకు ఆధారంగా నిలిచినవి అనేక గ్రంథాలూ, పత్రికలూ, ఆ గ్రంథప్రణేతలకూ పత్రికా నిర్వాహకులకూ నమస్సులు

— ఇరివెంటి కృష్ణమూర్తి

# అనుక్రమణిక



* * *

# ప్రస్తావన

ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కావ్యహేతువులు. ప్రతిభ దైవదత్తమైనది. జన్మాంతరవాసనాసంలబ్ధమైనది. వ్యుత్పత్తి సాధనమువలన సమకూరునది. ఈ రెంటి ఉనికిని, ప్రయోజనమును సార్థకము చేయునది అభ్యాసము.

సాహిత్యమును ప్రాచీన మనియును అర్వాచీన మనియును వింగడించుట కేవలము విషయావగాహనమునకే. పాత కొత్తలు సాహిత్యమునకు లేవు. అది మానవాత్మవలె నిరంతరము, నిత్యము. భాషా సౌందర్యమును తద్రహస్యములను సమగ్రముగ అవగతము చేసికొనవలయునన్నచో పాతకొత్తల బాహ్యరూపములను గౌణముగా భావించుట అత్యావశ్యకము. ప్రాచీన కవితా సంప్రదాయములను, భాషా లక్షణములను తెలిసికొనుటకు సాహిత్య వ్యాకరణ శాస్త్రముల అధ్యయన మవసరము. సాహిత్యశాస్త్ర మర్యాదలను తెలిసికొనక పోయినచో నిన్నటి మొన్నటి కావ్య ప్రపంచముతో మనకు తలస్పర్శిగా పరిచయము కలుగదు సరికదా ఈనాటి కవితాత్మను కూడ సమీచీనముగా సాక్షాత్కరించుకొనలేము. సాహిత్య శాస్త్రావిలోడనము చేయుచున్న సందర్భమున మనకు కనపడియు కనపడకనుండు అంశములు కొన్ని ఉన్నవి. ప్రాయికముగా పలువురు అలంకారశాస్త్ర సమాలోచకులు ఆ అంశముల నంతగా పట్టించుకొనలేదు. అట్టివానిలో కవిసమయ మొకటి.

అశాస్త్రీయములును, అలౌకికములును, సంప్రదాయబద్ధములునైన వర్ణనాంశము లెన్నియో కవిసమయములుగా కావ్యములందు చోటుచేసికొని వ్యంగ్యార్థములను ప్రతిపాదించుచు కావ్యశోభను ఇనుమడింపజేయుచున్నవి. ఇవి కేవలము అభూతకల్పనలని, అనుకరణ ప్రధానములని, ప్రతిభా నిరోధకములని కొందరి మతము. రాజశేఖరుని 'కావ్య మీమాంస'లో కవి సమయ నిర్వచనమును చూచినపుడు నాకొక అపూర్వానుభూతి కలిగి, ఈ కవి సమయములను సతర్కముగా పరిశీలించి, వాని ప్రయోజనమును నిరూపింపవలెనను

ఉత్కంఠతో పరిశోధనకు పూనుకొంటిని. "ఇది పరిశోధింపదగిన అంశమేనా ?" అను విచికిత్స కలిగినపుడు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు "అలంకార శాస్త్రమునందు అనాదృతముగా ఉండిపోయిన కవి సమయముల విశ్లేషణ మవసరమే" అని నన్ను ప్రోత్సహించిరి.

కవి సమయములు అలంకార శాస్త్రమునందు కవి శిక్షా రూపమున వెలసిన కావ్య మర్యాదలు. అలంకార శాస్త్రము దేశీయ భాషలలో లేనేలేదు. ఒకవేళ ఉన్నను అది గీర్వాణభాషలో అవతరించిన సాహిత్యశాస్త్ర సిద్ధాంత చ్ఛాయలలోనే పయనించినది కాని స్వతంత్రించి ఏ అంశమును చెప్పి ఎరుగదు. ఒక్క అలంకార శాస్త్రమేకాదు పురాణ భారతీయ విజ్ఞానమంతయు సంస్కృత భాషాగతమై ఉన్నది. సంస్కృతభాషా పరిచయము లేనిచో భారతీయతకే లోటు. ఒక శతాబ్దమునకు పూర్వము మన దేశములో వైదుష్యమనగా నేటి ఇంగ్లీషుభాషా పరిచయమువలెనే సంస్కృతభాషా పాండిత్యము. ఏ విషయము లోని అంతు తేల్చుకొనవలసిన అవసర మేర్పడినను సంస్కృతమే శరణ్యము. తాను కేవలము తెలుగులో పండితుడనని ఏ ప్రాచీనకవియు చెప్పికొనలేదు. అంతదూర మెందుకు ? తెలుగు వ్యాకరణము సైతము ముందు సంస్కృతము లోనే వచ్చినది. నన్నయ్యనుండి నేటివరకు వస్తుసంపదను సంస్కృతము నుండియే కొల్లగొట్టుకొనుచున్నాము. నన్నయ 'ఉభయ భాషా కావ్య రచనాభి శోభితుఁడు', తిక్కన 'ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునన్ బారగుఁడు'. తెలుగు కవులందరును తమ కావ్యావతారికలలో వ్యాస వాల్మీక్యాది సంస్కృత కవుల ప్రశస్తిని ఉగ్గడించిరి. మల్లియ రేచన, విన్నకోట పెద్దన, అనంతామాత్యుడు, రామరాజ భూషణుడు, అప్పకవి, అడిదము సూరకవి వంటి తెలుగు లాక్షణికులు సాహిత్య శాస్త్ర రచనకు పూనుకొనిరి కాని వారి ఈ రచనలు వారి పాండిత్య ప్రకర్షను ఉగ్గడింపగల్గి, తెలుగు భాషకు మాత్రము సంబంధించిన ఛందోవ్యాకరణాది విశేషములకు ప్రామాణిక గ్రంథము లయ్యెనేకాని రసాలంకారాది సాహిత్యశాస్త్ర సంబంధములైన విషయములకు అవి ప్రమాణములు కాలేకపోయినవి. సంస్కృతమునందే శాస్త్రాధ్యయనము కావించు మర్యాదను తెలుగువారేకాదు భారతీయు లంద రును నేటికిని మరువలేకపోవుట కిదియే కారణము. సకల భారతీయ భాషా సాహిత్య సంస్కృతుల అంతరాత్మ పరిపూర్ణ స్వరూపమును, సంస్కృతము

నందున్న శాస్త్రములను అవలోకించనిదే అవగాహన చేసికొనలేము. నేటికిని అలంకారశాస్త్ర రహస్యము లన్నియును గీర్వాణభాషా విదులకే తెలియుచున్నవి కాని తదితరులకు తెలియుటలేదు. అలంకార శాస్త్రములు హద్దుల నేర్పరచు రాజకీయ పక్షముల ఎన్నికల ప్రణాళికల వంటివి కావు. ప్రభుత్వ శాసనములకు వ్యాఖ్యానములంతకంటెను కావు. అవి సాహిత్యమును గూర్చిన వివేచనమున్న గ్రంథములు. సాహిత్యాధ్యయనమునకు తోడ్పడు కరదీపికలు. కరదీపికల సాయముతో మనము చూడదలచుకొన్న వస్తువును చీకటిలో ఉన్నను చూడవచ్చును. కరదీపిక చూపదు. మనము దాని సాయముతో చూతుము. ఇక ఆ కరదీపికలు చిన్నవియును పెద్దవియును ఉండవచ్చును. పట్టుకొనువాని కనుచూపునుబట్టి, ఎరుకనుబట్టి, ఓపికనుబట్టి అవి వెలుగులు గ్రుమ్మరించుచుండును. అలంకార శాస్త్రము లన్నియును ఒకే మూసలో పోసినవి కావు. శేముషీ సంపన్నులు పండించిన పంటలవి. పరస్పర భిన్నములైన సిద్ధాంతములను వారు చేసిరి. ఒకరికంటె ఒకరు కవుల ప్రతిభను, స్వేచ్ఛను గుర్తించి ఉగ్గడించుటకు ప్రయత్నించిరి. ఉపజ్ఞాసముపేతములైన వారి వాదోపవాదములు సాహిత్యమును పరిపుష్టము చేయుటకు ఎంతేని తోడ్పడినవి. నిజమునకు ఈ సాహిత్యశాస్త్ర సిద్ధాంతములు రచయితలకు మార్గదర్శక సూత్రములే కాని వారి ప్రతిభా ప్రదర్శనమునకు సంకెళ్లు కావు.

కవి సమయములు అలంకారశాస్త్రాంతర్గతములే. తెలుగులో సాహిత్య శాస్త్రము స్వతంత్రమైనదొకటి లేకపోవుటవలన సంస్కృతాలంకారికులు పేర్కొన్న కవి సమయములనే తెలుగుకవులు నిస్సంకోచముగా గ్రహించిరి. సంస్కృతాలంకారికులు పేర్చికూర్చిన కవి సమయముల కంటె ఇతరములైనవి తెలుగుకబ్బములలో కన్పింపక పోవుటకు ఇదియే కారణముగా నూహింపవచ్చును. కవి సమయతత్త్వము సుస్పష్టముగా విశదీకరించుటకు నేను సంస్కృత కావ్యములందలి లక్ష్యములతోపాటు తెలుగు కావ్యములందలి లక్ష్యములను కూడ చూపించుటకు ప్రయత్నించినాను. కవిత్రయము వారి నుండి నేటివరకును ఈ కవి సమయములు తెలుగు కావ్యములలో అతి ప్రచురములుగా ప్రయుక్తములగుచుండుట గమనార్హమైన విషయము. ప్రజా సామాన్యమునకు అందుబాటులో ఉన్న సినిమా గీతికలవైనను ఈ కవి సమయముల ప్రభావము విశేషముగా ఉండుట రసికజన విదితము.

కవి సమయములను తమ సాహిత్యశాస్త్ర గ్రంథములలో పేర్కొన్న వారిని గూర్చి ఒకమాట. తొమ్మిదవ శతాబ్దమున వెలసిన రాజశేఖరుడు తన 'కావ్య మీమాంస'లో మొట్టమొదటిసారిగా కవి సమయమును స్థాపించి, నిర్వచించి లక్ష్యలక్షణ సమన్వయము చేసినాడు. అతని తరువాత అజితసేనుడు, హేమచంద్రుడు, అగ్నిపురాణకర్త, అరిసింహ అమరచంద్రులు, దేవేశ్వరుడు, విశ్వనాథుడు, కేశవమిశ్రుడు, అనంతార్యుడు మున్నగువారు తమ సాహిత్య శాస్త్ర గ్రంథములలో రాజశేఖరుడు చెప్పిన కవి సమయములనే కాక మరి కొన్నింటికూడ చేర్చినారు. కాని వీరిలో ఎవ్వరును కవి సమయమును నిర్వచించి యుండకపోవుటవలన రాజశేఖరుని నిర్వచనమునే గ్రహించినాను. ఆ నిర్వచనము సర్వవిధముల సమంజసముగను శాస్త్రీయముగను ఉండుటచేత దానినే ప్రమాణముగా తీసికొని కవి సమయముల పుట్టుకను, ఔచిత్యానౌచిత్యములను పరిశీలించినాను. ఈ నిర్వచనమునకు లక్ష్యప్రాయములు కాకపోయినను కవి సమయములుగా సాధారణముగా భావింపబడుచున్న వాని నెన్నింటినో కవి సమయాభాసములుగా నిరూపించి ఉన్నాను. కవి సమయముల ప్రయోజనమును గూర్చియు, కల్పనా ప్రధానమైన కావ్య జగత్తులో వాని ప్రాధాన్యమును గూర్చియు వాని సామంజస్యమును గూర్చియు వివరించుటకు ఈ సిద్ధాంతవ్యాసమున ప్రయత్నించినాను.

# కవిసమయము - నిర్వచనము

## ప్రథమ ప్రకరణము

'సమయ' శబ్దమునకు అమర కోశమున :- శపథము, ఆచారము, కాలము, సిద్ధాంతము, జ్ఞానము, సంకేతము, అవసరము, నియమము అను అర్థములున్నవి. వైదిక[1] సాహిత్యమునందు - కలసివచ్చుట, కలయిక, కలయుచోటు అను అర్థములున్నట్లు మోనియర్ విలియమ్స్ సంస్కృతాంగ్ల నిఘంటువునందు పేర్కొనెను.[2] రామాయణము[3] నందును, మహాభారతము[4] నందును ఒడబాటు, సంధినియమము అను అర్థములలో ఈ శబ్దము ప్రయుక్తమై ఉన్నది. ఆంధ్రమహాభారతము[5] నందును శపథము, ప్రతిజ్ఞ అను అర్థమునందే ప్రయోగింపబడినది. ఈ అర్థములను విచారించినచో కవి సమయమనగా కవులు చేసికొన్న నియమము లేక సంప్రదాయమని తెల్పుకొనవచ్చును.

తర్కవాచస్పతి శ్రీ తారానాథ భట్టాచార్యులచే సంకలితమైన 'వాచస్పత్యము' అను శబ్దవిజ్ఞాన కోశమునందు సమయశబ్ద విచారమున్నది.

"సమయ - పుం. సమ్ + ఇణ్ + అచ్ 1. కాలే, 2. శపథే, 3. ఆచారే, 4. సిద్ధాన్తే, 5. అంగీకారే చ (అమరః), 6. క్రియా

1. సమయాశ్శపథాచార కాలసిద్ధాంత సంవిదః
సమ్యక్ ఈయతే అనే నేతి సమయః - ఇణ్‌గతౌ - (అమరకోశము తృతీయ కాండము) సంకేత సమయః ప్రోక్తో నియమేఽవ సరేఽపిచ - ఇతిశేషః.
2. మోనియర్ విలియమ్స్ Sanskrit - English Dictonary - పుట 1164.
3. "యదాహరామో ధర్మాత్మా తత్కారుష్వ సమాహితః
రాజంస్త్వష్ట స్వసమయేభవ సత్యవతిశ్రవః" - రామాయణమ్ 4-32-51.
4. "ఏవంతే సమయం కృత్వాదాసీ భావాయ వైమిథః
జగ్మతుః స్వగృహానేవ శ్వోద్రక్ష్యావ ఇతిస్మహ" - మహాభారతమ్ 1-20-5.
5. "వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతులిందఱు నే గురుప్రయోజనమున జేసితిన్ సమయ సంస్థితి........" - ఆదిపర్వము. ఆ. 4-187.

కారకే, 7. నిర్దేశే, 8. సంకేతే, 9. భాషాయాం, (మేదినీ), 10. సమ్యాది, 11. నియమే, 12. అవసరే (హేమచంద్ర), 13. కాలవిజ్ఞానే (శబ్దచ) నియమబద్ధే అప్య శబ్దస్యేదమభిధేయా మిత్యభిధానాభిధేయ నియమబద్ధే (వాత్స్యాయన) 14. శాస్త్రేచ.

ఈ అర్థములుకూడ కవిసమయసంకేతమును వివరించుటకు సమర్థములై యున్నవి. కవులలోనున్న ఆచారమనియును, కవులు చేసికొన్న నియమ మనియును స్పష్టమగుచున్నది.[1]

లక్షణ గ్రంథములలో కవి సమయమును మొట్టమొదటిసారిగా నిర్వచించి కావ్య నిర్మాణమునందు దానికిగల ప్రాధాన్యమును వివరించినాడు రాజశేఖరుడు. అతడు రచించిన లక్షణ గ్రంథము 'కావ్యమీమాంస'. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దము వాడితడు. ఈతనికి పూర్వము వామనుడు 'కావ్యా లంకార సూత్రవృత్తి' లో పదప్రయోగ సాధుత్వమును గూర్చి ప్రస్తావించుచు 'కావ్య సమయమ'ను మాటను ఉట్టంకించినాడు.[2] కావ్యభాషలో పరం పరాగతమైన శబ్దసౌష్ఠవమును సాధించుటకు కొన్ని నియమములను సూచించి, వానిని 'కావ్య సమయము' అన్నాడు. అంతేకాని కవి సమయమను మాట కున్న ప్రసిద్ధార్థము అతని దృష్టియందు లేదు. అందువలన కవి సమయమును పేర్కొన్న ప్రప్రథమ సాహిత్యశాస్త్రవేత్త రాజశేఖరుడే. అతడు కావ్య మీమాంసలో పదునాల్గు, పదునైదు పదునారవ అధ్యాయములలో కవిసమయ మును సోదాహరణముగా నిర్వచించి దాని వైవిధ్యమును ప్రపంచించినాడు.

"అశాస్త్రీయ మలౌకికంచ పరంపరాయాతం యమర్థము పనిబధ్నంతి కవయః స కవిసమయః"[3]

---

1. వాచస్పత్యము - సంపుటి 6 పుట 5229.
   ప్రచురణ. చౌకాంబా సంస్కృత్ సెరీస్ నెం. 94 - 1962.
   "తన యగపా టౌరు లెఱుగుదు
   రని సూతుఁడు సమయ భంగమగుటకు భీముంచును......" -
   విరాటపర్వము - ఆ 2 - 345.
2. వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి - పంచమాధి కరణము - ప్రథమాధ్యాయము.
3. రాజశేఖరుని కావ్య మీమాంస - అధ్యాయము 14.

"అశాస్త్రీయమును, (అనగా శాస్త్రతః విహితము కానిదియును) అలౌకికమును, (అనగా లోకానుభవమున నేర్పడినది కానిదియును), పరంపరాగతముగ వచ్చుచున్నదియునగు నే యర్థమును కవులు తమ గ్రంథములలో నందఱు నొక్కరీతిగా కూర్తురో అదియే కవిసమయము అని అనబడును."[1]

ఈ నిర్వచనములోని 'అశాస్త్రీయము' ను పదమును వివరింపవలసి యున్నది. శాస్త్రమన నేమో తెలిసికొందుము. అమరకోశమున 'శాస్త్ర' శబ్దమునకు "శాసనం శిష్యేతే అనే నేతిశాస్త్రమ్. శాసు అను శిష్టా - శిక్షించుటయు, దీనిచేత శిక్షింపబడును కనుక శాస్త్రము. శాస్త్రశబ్దము ఆజ్ఞకును వ్యాకరణాది గ్రంథములకును పేరు. వామనుడు కావ్యాదోషము లను పేర్కొను సందర్భమున సకల కళలకును, సకల విద్యలకును, పురుషార్థ ములకును సంబంధించినదియునైన జ్ఞానము శాస్త్రమని పేర్కొనినాడు.[2] మమ్మటాచార్యుడు కావ్యహేతువులను గూర్చి వివరించుచు - ఛందస్సు, వ్యాకరణము, అభిధానము, కోశము, కల, చతుర్వర్గములు (పురుషార్థములు), గజతురగ ఖడ్గాదుల లక్షణముల నుల్లేఖించునవి శాస్త్రములన్నాడు.[3] రాజ శేఖరుడుకూడ వాఙ్మయమును శాస్త్రమనియును కావ్యమనియును ఇరు తెరగులుగా వింగడించినాడు. శాస్త్రమును అపౌరుషేయ పౌరుషేయములని మరి రెండు విధములుగా గుర్తించినాడు. చతుర్వేదములు, ఉపవేదములు, వేదాంగములు అపౌరుషేయములనియును - పురాణములు అన్వీక్షికి, మీమాంసా ధర్మశాస్త్రములు పౌరుషేయములనియును పేర్కొనినాడు. మీదు మిక్కిలి అతడు స్వతంత్రించి అలంకారశాస్త్రమునుకూడ వేదాంగములలో చేర్చి సాహిత్య శాస్త్రమును సప్తమ దర్శనముగా గుర్తించెను.[3] ఈ దృష్టితో చతుర్దశ విద్యలు శాస్త్రముల పరిధిలోనికే వచ్చును. ఈ చతుర్దశ విద్యలలో అన్వీక్షికి - అనగా తర్కము సత్యాన్వేషణమునకు సాధనము.

---

1. కావ్యమీమాంస - అనువాదము - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి - ప్ర. 1930.
2. 'కలా చతుర్వర్గ శాస్త్రస్య విరుద్ధార్థాని విద్యా విరుద్ధాని' - కావ్యాలంకార సూత్రవృత్తి - అధ్యాయము 2.
3. 'శాస్త్రాణాం ఛందో వ్యాకరణాభిధాన కోశకలా చతుర్వర్గ గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథానాం' - కావ్యప్రకాశము - ప్రథమోల్లాసము - 3.
1. కావ్య మీమాంస - ద్వితీయాధ్యాయము.

శాస్త్రధ్యేయము సత్యగవేషణము. సత్యనిరూపణము సత్యమే సౌంద ర్యము. సత్యమే మంగళము. సకల విద్యలకును సత్యమే ఆధారము. ఆధునిక కాలమున అపూర్వములైన సిద్ధులను సాధించిన విజ్ఞానశాస్త్ర మంతయును సత్యాన్వేషణమునకు ఫలితము. వేదచోదితములైన ధర్మములను నిరూపించుట కును సత్యాసత్యములను వింగడించుటకును ప్రాచీన భారతీయులు చతుర్దశ విద్యలలో ఒకటియైన అన్వీక్షికి లేక తర్కశాస్త్రమును ఊతగా గొనిరి. తర్క బలముతో వారు పారమార్థిక విషయములనే కాక దైనందిన జీవితము నందు ఘటిల్లు సమస్యలకు పరిష్కారమును సంపాదించిరి. తమ అనుభవములకు శాస్త్రరూపమును కల్పించుపట్ల తర్కమును ప్రమాణముగా పెట్టుకొనిరి. శాస్త్రీయాలోచనలకు తర్కశాస్త్ర సూత్రములు ఆధారములు. తర్కము కూడ ఒక శాస్త్రమే అయినను అది అనేక శాస్త్రముల పుట్టుకకు కారణ మయ్యెను. ఇటీవలి కాలమున మానవజీవితమునకు సంబంధించిన సర్వ వ్యాపారములను శాస్త్రీయ దృక్పథముతో పరిశీలించుట పరిపాటి అయినది. శాస్త్రమను మాటకు ఇంగ్లీషులో 'సైన్స్' (Science) అనునది పర్యాయవాచి. అవలోకనము వలనను, ప్రయోగము వలనను ఏర్పడునట్టి జ్ఞానమనియును సవిమర్శముగా పరిశీలించి క్రమబద్ధముచేసి సామాన్య సూత్రములుగా నిబద్ధింప బడిన జ్ఞానమనియును 'సైన్స్' అను శబ్దమునకు అర్థము.[1]

ఏ విషయమునకైనను కార్యకారణ సంబంధమును నిరూపించునది శాస్త్రము. శాస్త్రము మానవుని దైనందిన జీవితమునకు సంబంధించినది. మానవుడు లేనిచో శాస్త్రమేలేదు. ప్రకృతి రహస్యములను విచ్ఛేదించి ఆ ప్రకృతి శక్తులను తన వశము చేసికొని మానవుడు తన జీవితమును సుఖ మయముగను రసమయముగను పరిణమించునట్లు చేసికొనుచున్నాడు. ఈ రహస్యములను ఛేదించుపట్ల అతడు రూపొందుకొనిన శాస్త్రమే అతనికి కరదీపిక అయినది. అతని అనుభవ పరంపరలు శాస్త్ర విస్తృతికి దారితీసినవి. సంప్రదాయసిద్ధమైన భారతీయుల శాస్త్రజ్ఞానమునకును ఆధునిక కాలమున వికాసమును పొందిన విజ్ఞానశాస్త్రమునకును ఏకీభావము చెప్పుట సాహసము కాజాలదు.

1. CHAMBERS 20th CENTURY DICTIONARY - Edition (1954) - Page 988.

రాజశేఖరుడు అశాస్త్రీయమను మాటను ఉపయోగించినాడు అశాస్త్రీయమను పదమునకు - శాస్త్రోక్తముకానిది, శాస్త్రమునందు లేనిది, శాస్త్రమునకు భిన్నమైనది, శాస్త్రమునకందనిది, శాస్త్రమర్యాదలకు లొంగనట్టిది. అనగా సత్యదూరమైనట్టిది అను అర్థములను చెప్పవచ్చును. కవిసమయములను పేర్కొనునపుడు రాజశేఖరుడు స్వర్గభౌమ పాతాళీయములని వానిని ముత్తెరగులుగా వింగడించెను. అందు భౌమ కవిసమయములు ప్రధానములని పేర్కొనుచు జాతి, ద్రవ్య, గుణ, క్రియా సంబంధములైనవి నానుగు విధములనెను. మరల ఈ నాలుగు విధములయిన ఈ కవిసమయములు ఒక్కొక్కటి మూడు తెరగులనెను. ఒకటి అసత్తును (లేనిదానిని) ఉల్లేఖించుట. రెండవది సత్తును (ఉన్నదానిని) ఉల్లేఖింపకుండుట, మూడవది నియమము. (నియమిత రూపమున కూర్చుట).[1]

ఈ వింగడింపులో అసత్తును ఉల్లేఖించుట, సత్తును ఉల్లేఖింప కుండుట, నియమిత రూపమున కూర్చుట అనునది అశాస్త్రీయములని చెప్పవచ్చును. లేని దానిని ఉన్నట్లుగా చెప్పినను. ఉన్నదానిని లేనట్లుగా చెప్పినను, ఉన్నను లేకున్నను ఒక నియమము నేర్పాటుచేసికొని చెప్పినను శాస్త్రమంగీకరింపదు. సత్యకథనమే శాస్త్రధ్యేయముకదా ! అసత్తు (లేనిది) ను ఉల్లేఖించుట యనగా శాస్త్రమునందుగాని, లోకమునందుగాని ఎరుకకు వచ్చిన పదార్థములను, అంశములను ఉల్లేంఖింపకపోవుట. సత్తునకును అసత్తునకును లోకమునందు ఏ అర్థములు రూఢిగా ఉన్నవో ఆ అర్థములను దృష్టియందుంచుకొనియే రాజశేఖరుడు ఈ శబ్దములను ప్రయోగించెను. కావ్యమీమాంసలో అసత్తును ఉల్లేఖించుటకు ఉదాహరణములు పేర్కొనుచు అతడు - "తత్ర సామాన్యస్యాఽసతో నిబంధనం యథా నదీషు పద్మోత్పలాదీని జలాశయ మాత్రేఽపి హంసాదయో, యత్రతత్ర పర్వతేషు సువర్ణరత్నాదికంచ"[2] (అన్ని నదులయందును కుముదములున్నట్లు వర్ణించుట. జలాశయము లన్నింటియందును

1. సచత్రిధా - స్వర్గ్యో, భౌమః పాతాలీయశ్చ. స్వర్గ్య పాతాళీయ మోర్భౌమః ప్రధానః సహి మహావిషయః సచ చతుర్ధా - జాతి ద్రవ్యా గుణ క్రియా రూపార్థతయా తేఽపి ప్రత్యేకం త్రిధా అసతో నిబంధనాత్ సతోఽప్య నిబంధనాత్ నియమతశ్చ - (కావ్య మీమాంస - 14 వ అధ్యాయము)

2. కావ్య మీమాంస - 14 వ అధ్యాయము.

హంసహారసాది పక్షులున్నట్లు వర్ణించుట. అన్ని పర్వతములందును సువర్ణ రత్నాదులున్నట్లు చెప్పుట) అని వివరించెను.

నదులలో కమలములు కలువలు ఉండుట అసత్తు. అనుభవమున లేనిది. అయినను వాని వర్ణనము కవిసమయము ననుసరించి జరుగుచునే ఉన్నది. అదే విధముగా అన్ని పర్వతములందును సువర్ణ రత్నాదులుండుట కవిసమయ ప్రభావమున ప్రచురితమైన అంశము. ఇదే విధముగా సత్తును ఉల్లేఖింపకుండుటకు ఉదాహరణముగా రాజశేఖరుడు "సతోఽప్య నిబంధనమ్ తద్యథా నమాలతీ వసంతే నపుష్పఫలం చందన ద్రుమేషున ఫలమశోకేషు"[1] అన్నాడు. (వసంత కాలమున మాలతీ కుసుమములున్నను వర్ణింపకుండుట, చందన ద్రుమములందు ఫలపుష్పములున్నను, అశోకమునకు ఫలము లున్నను వర్ణింపకుండుట.)

లోక శబ్దమునకర్థము అమరకోశమున "లోక్యతే సర్వ మస్మిన్నితి లోకః" - లోక దర్శనే" అని ఉన్నది. సర్వము దానియందు కానబడును కాన లోకము. రాజశేఖరునకు ముందున్న ఆలంకారికులు దండి[2] భామహులు[3] కావ్య దోషములను ఉల్లేఖించు సందర్భమున 'లోక' శబ్దమును పేర్కొనిరి కాని దానిని వ్యాఖ్యానింపలేదు. వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తి'లో దేశ కాల కలాస్వభావ విరుద్ధములైన అర్థము (అంశము) లను లోకవిరుద్ధము లనెను[4] మమ్మటుడు లోకమును స్థావర జంగమాత్మక వృత్తమనెను.[5] మానవునకు దృగ్గోచరమగు స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచమంతయును లోకమని చెప్పవచ్చును. శాస్త్రములలో పేర్కొన్న పదునాల్గు లోకములలో భూలోక మొకటి. రాజశేఖరుని కవిసమయ నిర్వచనమునందున్న 'అలౌకిక' శబ్దములోని లోకము ఈ లోకమే - ఇహ లోకమే. అలౌకిక మనగా ఈ భూలోకమునందు లేని, లేక కనబడని అంశము (అర్థము) లను కవులు తమ కావ్యములలో పరంపరాయాతముగా ఉల్లేఖించినచో అవి కవిసమయములై నిరాక్షేపణీయములుగా

1. కావ్యమీమాంస. 14 వ అధ్యాయము.
2. 'దేశకాల కలాలోక న్యాయాగమ విరోధి చ' - కావ్యాదర్శము - 4-3.
3. 'దేశకాల కలాలోక న్యాయాగమ విరోధిచ' - కావ్యాలంకారము - 4-2.
4. 'దేశకాల కలాస్వభావ విరుద్ధాని లోకవిరుద్ధాని'
కావ్యాలంకార సూత్రవృత్తి - 2-2, 23-24.
5. లోకస్య స్థావరజంగ మాత్మకలోక వృత్తస్య - కావ్య ప్రకాశము 1-3.

ఉండును. లోకములో యశోహాసములకు రూపములు లేవు. వర్ణములు లేవు. కాని కవులు వీనికి ధావళ్యము నాపాదించిరి. కవి సమయాను సారముగా వీని ధవళరూపము కావ్య లోకమున నిలిచిపోయినది. ఇదే విధముగా అపకీర్తికి పాపమునకు కృష్ణవర్ణమును, క్రోధానురాగములకు రక్తవర్ణమును పులమి కవులు వీనికి స్థిరరూపములు కల్పించినారు. ప్రాయికముగా ఈ గుణములు మనకు లోకమునందు ఈ వర్ణములలో అనుభవమునకు రావు. కనుక ఇవి అలౌకికములే అని చెప్పవచ్చును. అలౌకిక మనగా లోకవిరుద్ధమైనది. దైనందిన జీవితానుభవమునందు లేనిది. జ్ఞానేంద్రియముల కందనిది. కర్మేంద్రియముల కందనిది.

రాజశేఖరుని కవిసమయ నిర్వచన సూత్రమునకు 'పరంపరాయాతమ్మ'ను శబ్దము ప్రాణము వంటిది. కేవలము అలౌకికము, అశాస్త్రీయము అయినంత మాత్రమున ఏ వర్ణనాంశముకూడ కవిసమయ మనిపించుకొనదు, అది పారంపర్యముగా సంప్రదాయ సిద్ధముగా కవిప్రయుక్తము కావలసియుండును. రాజశేఖరుడు ఒకచోట దేశభేదముచేత వస్తురూప గుణములలో వ్యత్యాసములు కనిపించినను ఆ వ్యత్యాసములను పాటింపక కవిసమయసిద్ధమైన రూపమునే ప్రమాణముగా గ్రహింపనగునని వ్రాక్కుచ్చెను.[1] దీనినిబట్టి కావ్య రచనలో ఏకరూపతను సమత్వమును రక్షించుటయే కవిసమయ లక్ష్యమని తెలియుచున్నది. అందువలననే రాజశేఖరుడు "వస్తువృత్తిరతంత్రం కవిసమయః ప్రమాణమ్"[2] అని సిద్ధాంతీకరించెను. అనగా కావ్యవర్ణనమునందు వాస్తవస్థితి కాక కవి సమయమే ప్రమాణము. ఉదాహరణకు - వర్షర్తువులో పడమటి గాలులు వీచునని పెద్దలందురు. కాని తూర్పు గాలులు వీచునని కవులు వర్ణించుట సంప్రదాయమైనది.[3] కావ్య ప్రపంచమున ఈ కవులు పేర్కొన్న సంప్రదాయములకే ప్రాధాన్యమున్నది సంప్రదాయసిద్ధి పొందినవే కవిసమయములు. వర్ణనాంశములు పరంపరా ప్రాప్తములు కానప్పుడు ఔచిత్యమునకు హానియును రసమునకు భంగమును కలుగక మానదు. ఇవి కావ్యోత్కర్షకు ప్రతిబంధకము లగునేమో యను భ్రాంతిచేత ప్రసిద్ధములైన కవి సంకేతములను ఆమోదింపక

1. "దేశేషు పదార్థానాం వ్యత్యాసో దృశ్యతే స్వరూపస్య తన్న తథా బధ్నీయాత్ కవిబద్ధ

భిన్నముగా ప్రయోగములు చేసినచో కావ్య రసాస్వాదనమునకు ఆటంక మేర్పడును. కీర్త్యపకీర్తులను ధవళ నీలములుగా వర్ణించుట పరంపరగా వచ్చు చున్నది. ఎవ్వడేనియు ఇందుకు భిన్నముగా అనగా కీర్తిని నల్లగాను, అపకీర్తిని తెల్లగాను వర్ణింప దొరకొన్నచో ఏర్పడు అయోమయస్థితి అనూహ్యాము కదా! నిజమునకు ఈ సంప్రదాయసిద్ధి అను భావము 'కవిసమయము'ను పదబంధము నందే గర్భితమై ఉన్నది. సమయమనగా ఆచారమని, సంప్రదాయమని లేక నియమమనియే కదా అర్థము!

అలౌకికములును, అశాస్త్రీయములును పరంపరా యాతములును అయిన విషయములను కవులుల్లేఖించుట కవిసమయమని రాజశేఖరుడు నిర్వచించుటయే కాక ఇవి కావ్యములలో సుప్తములై ఉండగా తాను తన బుద్ధికి తోచిన రీతిని మేల్కొల్పినట్లు (ఉద్ధరించినట్లు) చెప్పికొనెను.[1]

రాజశేఖరుని తరువాత పలువురు లాక్షణికులు కవిసమయములను కావ్యోత్కర్షకు హేతువులుగను, కవులు తెలిసికొనవలసిన రహస్యములుగను పేర్కొని నారు. వారి అభిప్రాయములను పరిశీలింపవలయును.

అష్టాదశ పురాణములలో అగ్నిపురాణమునకు సాహిత్యశాస్త్ర ప్రపంచము నందు విశేషమైన ఆదరమున్నది. సాహిత్య శాస్త్రమునకు సంబంధించిన అనేకాంశము లిందు పొందుపరుపబడి ఉన్నవి. రూపక మర్యాదలను, కావ్య లక్షణములను, రస స్వరూపమును, నృత్యాభినయాది విశేషములను, శబ్దార్థాలంకారములను, కావ్యగుణ దోషములను ఈ పురాణము తెలుపుచున్నది. అన్ని పురాణములవలెనే ఇదియు వ్యాసప్రోక్తమనియును, కనుక అతి ప్రాచీనమని యును, సాహిత్యశాస్త్ర విషయము లన్నిటికి ఇందు బీజము లున్నవని కొందరు అభిప్రాయపడిరి. కాని ఈ సాహిత్యశాస్త్ర విషయము లన్నియును ఈ పురాణ మున క్రీ. శ. 9 వ శతాబ్దముననే చేర్చబడినవి కనుక ప్రక్షిప్తములని ఇటీవలి పరిశోధకులు నిష్కర్షగా నిర్ణయించినారు.[2] పన్నెండవ శతాబ్దము వరకును

1. "సోఽయం కవీనాం సమయః కావ్యే సుప్త ఇవస్థితః
ససాంప్రత మిహాస్మభిర్యథా బుద్ధి ర్విబోధితః" - కావ్యమీమాంస. 16 వ అధ్యా.

2. డా॥ రాంలాల్ వర్మాశాస్త్రి - 'అగ్ని పురాణ్‌కా కావ్యశాస్త్రీయ భాగ్'
—నేషనల్ పబ్లిషింగ్ హౌస్ - ఢిల్లి. (1969)

కావ్య లక్షణాదులు ఇందు చేర్పబడుచునే ఉండెనని శ్రీ బలదేవ్ ఉపాధ్యాయ గారు 'భారతీయ సాహిత్య శాస్త్రి' అను గ్రంథమునందు ఉట్టంకించినారు.[1]

అగ్నిపురాణమునందు పలువురు వ్యక్తులు ఒకేమాటను చెప్పుట లేక పలువురు దానినే పలుమార్లనుట శుభావహమనియును కవుల సముదాచారమే కవిసమయమనియును సూత్రీకరింపబడి ఉన్నది.[2] కాని దీనికి వ్యాఖ్యానము కాని ఉదాహరణముకాని అందులేదు. అగ్నిపురాణమునందలి సాహిత్యశాస్త్ర విషయములు ప్రక్షిప్తములని విమర్శకుల నిశ్చితాభిప్రాయము కనుక కవి సమయమును రాజశేఖరుని కంటె పూర్వము అగ్నిపురాణము పేర్కొనిన దనుట సాహసోక్తియే అగును. కవిసమయ శబ్దమునకు అగ్నిపురాణము నందున్న విచారము రాజశేఖరుని నిర్వచనము నందలి 'పరంపరాయాతమ్మ'ను మాటకు సమీపముగా ఉన్నది. కాని అగ్నిపురాణమునందలి సాహిత్యశాస్త్ర విభాగ రచనాకాలము సంశయాస్పదముగా నున్నది కనుక కవిసమయ శబ్దమునకు అగ్నిపురాణమునందున్న విచారము రాజశేఖరుని నిర్వచనము నందలి 'పరంపరాయాతమ్మ' ను మాటకు సమీపముగా ఉన్నది. అగ్ని పురాణమునందలి సాహిత్యశాస్త్ర విభాగ రచనాకాలము సంశయాస్పదముగా నున్నది కనుగ కవిసమయ నిర్వచనమును సమగ్రముగా పరిశీలించి దాని కొక నిశ్చితరూపము కూర్చినవారిలో రాజశేఖరుడే ఆద్యుడని దృఢముగాచెప్పవచ్చును.

తొమ్మిదవ శతాబ్దమునందు ప్రభవిల్లిన రుద్రటుడు 'కావ్యాలంకారము' న కవిసమయములను సూత్రబద్ధము చేయకపోయినను, పరంపరాయాత ములుగా మహాకవి ప్రయుక్తములగు వస్తువర్ణనములు నిర్దుష్టములే అను భావమును సోదాహరణముగా వివరించెను.[3]

---

1. 'భారతీయ సాహిత్య శాస్త్ర' - ప్రసాద్ పరిషత్ - కాశీ (1950)
2. అనేకస్య తథైకేన బహీనాం బహుభిశ్శుభాః
   కవీనాం సముదాచారః సమయోనామ గీయతే"
   అగ్నిపురాణము. కావ్యగుణ విశేకము శ్లో॥ 30 అనుబంధము - 1.
3. సుకవి పరంపరయా చిరమవిగీతతయా న్యన్యథా నిబద్ధంయత్ వస్తు తదన్యాదృశమపి బధ్నీయాత్ తత్ ప్రసిద్ధమైవ సుకవితి - పూర్వసుకవీనాం పరంపరయా సమూహేన చిరం బహుపూర్వకాలేఽ విగీతతయా విగానేన నిర్దోషతయేతి యావత్ - యాద్వ స్త్వ న్యథా నిబద్ధం తదన్యాదృశమపి తత్రప్రసిద్ధన్యైవ బధ్నయాత్ - తత్వాత్మబలేన మహాకవి ప్రసిద్ధి రేవాత్ర ప్రమాణ మిత్యర్థః—" కావ్యాలంకారము - సప్తమోల్లాసము శ్లో. 8.

పదకొండవ (క్రీ. శ. 1088-1172) శతాబ్దమునకు చెందిన హేమచంద్రుడు 'కావ్యానుశాసనము'న కవిసమయమును శిక్షారూపమున ఉదాహరించుచు రాజశేఖరునివలెనే ముత్తెరగులుగా విభజించి చూపెనేకాని అతనివలె నిర్వచించలేదు.[1]

పన్నెండవ శతాబ్దపు పూర్వభాగమున వెలసిన దేవేశ్వరుడు 'కవికల్పలతా' అను లక్షణగ్రంథమున కవిశిక్షారూపమున కవిసమయముల ప్రసక్తి తెచ్చినాడు. ఇతడును కవిసమయములను మూడు విధములుగా పేర్కొని రాజశేఖరుడు చెప్పిన కవిసమయములనే గాక మరికొన్నింటిని ఉదాహరించ గలిగినాడు.[2]

పన్నెండవ శతాబ్దమునందు (1175-1250) విలసిల్లిన శారదాతనయుడు 'భావ ప్రకాశనము' అను సాహిత్యశాస్త్ర గ్రంథమునందు నవమాధికరణములో కవిసమయములను గూర్చి ప్రస్తావించెను. కాని నిర్వచించలేదు. ఆరు శ్లోకములలో కవిసమయములకు ఉదాహరణములను చూపినాడు.

భావ ప్రకాశమునకు తెలుగు వ్యాఖ్యానమును వెలయించిన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు ఈ సందర్భమున కవిసమయముల విషయమున శారదా తనయుని హృదయమును ఈ విధముగా స్పష్ట పరచినారు. "ఆయా యర్థముల నిబంధనా నిబంధనమున నొక విధాన మున్నది. ఇట్టి విధానమునే కవులు కావ్యముల నిబంధింతురు. ఇట్టి ప్రక్రియాను సంధానమునకు కవిసమయమని సంకేతము కలదు."[3]

విశ్వనాథుడు 'సాహిత్యదర్పణము' లో సప్తమ పరిచ్ఛేదమున కావ్య దోష స్వరూపనిర్ణయము చేయుచు 'ఖ్యాతి విరుద్ధత్వ' దోషము కవిసమయ ప్రసిద్ధికారణముగా గుణముగనే భాసించునని తెలిపెను.[4] రాజశేఖరుడు

1. హేమచంద్రుని కావ్యానుశాసనము - ప్రథమాధ్యాయము. చూ. (అనుబంధము 1.)
2. దేవేశ్వరుని 'కవి కల్పలతా' - చూ. అనుబంధము - 1.
3. భావప్రకాశము - శారదా తనయుడు - బోధాలోక వ్యాఖ్య - ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ. 1973.
4. విశ్వనాథుడు - సాహిత్య దర్పణము. 7-22 నుండి 25 వరకు చూ. అనుబంధము 1.

పేర్కొనిన కొన్ని కవిసమయములను దేవేశ్వరునివలె ఇతడును ఉదాహరించుట ఒక విశేషము.

పదునారవ శతాబ్దమున దక్షిణా పథమున దార్శనికుడుగా సాహిత్య శాస్త్రవేత్తగా యశస్సును గడించుకొన్న అప్పయ్యదీక్షితులు 'చిత్రమీమాంస'లో కవిసమయ శబ్దమును ప్రయోగించినారు.[1] అలంకార ప్రయోజనమును వివరించు పట్టున ఆయన కవిసమయమునకున్న ప్రధాన్యమునే ఉట్టంకించెను. కాని దానిని నిర్వచించలేదు.[2]

అరిసింహ – అమరచంద్రులు 'కావ్యకల్పలతావృత్తి' లో కవిసమయము అను పేర్కొనిరే కాని నిర్వచించియుండలేదు. రాజశేఖరుడు పేర్కొనిన కవి సమయములను వీరును ఉదాహరించిరి.

కేశవమిత్రుడు 'అలంకార శేఖరము' నందు కవిసమయ సంకేతమును కవిసంప్రదాయ మనెనే కాని నిర్వచనమేదియు వివరించలేదు. రాజశేఖరాదులు చూపిన కొన్ని కవిసమయముల నీతు డుదాహరించినాడు.[3]

పదునేడవ శతాబ్దమున వెలసిన జగన్నాథ పండితరాయలు 'రస గంగా ధరము' నందు ఉపమాదోషములను వివరించుచు కవిసమయ ప్రసిద్ధి లేకపోవుట కూడ ఒక దోషముగా భావించెను. కవిసమయములు చమత్కారమునకు సాధ నము లనియును, కావ్య సౌందర్యమునకు హేతువులనియును అభిప్రాయమును ప్రకటించెనే కాని వానిని నిర్వచింపలేదు.[4]

'కవిసమయ కల్లోలః' అను అముద్రిత గ్రంథములో అనంతార్యుడు (19–20 శతాబ్దములు) కవిసమయములను వింగడించి చూపెనే కాని నిర్వచించి

---

1. సర్వేఽపి హ్యలంకారః కవిసమయ ప్రసిద్ధ్యనురోధేన హృద్యతయా కావ్యశోభాకర యేవ అలంకారతాం భజతే – చిత్ర మీమాంస – పుట 6.

2. చూ. అనుబంధము 1.

3. చూ. అనుబంధము 1.

4. కవిసమయ సిద్ధతయా చమత్కారాప కర్షకత్వా భావేన లింగభేదోఽపి నాత్రదోషః ఏవంచ కవిసమయ సిద్ధదయా ప్రకారాంతరేణవా ప్రాగుక్తానాం దోషాణాం చమత్కా రానప కర్షకత్వే నాస్త్యేవ దోషత్వం. (రసగంగాధరము, ద్వితీయాననము – పుట 230. నిర్ణయ సాగర ముద్రణ, బొంబాయి 1939)

యుండలేదు. ఆ వింగడింపుకూడ రాజశేఖరుని అడుగు జాడలలో జరిగినదే. సోదాహరణముగా ఆతడు పేర్కొన్న కవిసమయము లన్నియును అంతకు పూర్వము ఆలంకారికులు చెప్పినవే.[1]

తెలుగులో మల్లియరేచన 'కవి జనాశ్రయము' మొదటి లక్షణ గ్రంథము. ఇది వేములవాడ భీమకవి కృతమను అభిప్రాయముతో ఆరుద్రగారు తమ "సమగ్రాంధ్ర సాహిత్యము"నందు ఏకీభవింపలేదు. వారు ఇందుకు చూపిన ఉపపత్తులు సహేతుకముగా ఉండుటచేత 'కవి జనాశ్రయము' రేచన కృతమని నమ్ముటకు వీలున్నది. ఈ గ్రంథమున సమయశబ్ద ప్రసక్తి ఉన్నది.

ఘన దండకాష్ఠ కృష్ణా
జినములు సొగయింప నొక్క జినముని చనుదెం
చె ననగ సమయ విరోధం
బని కవులకు జెప్పె కవిజనాశ్రయు డొనరన్

కాని ఇచట సమయ మనగా జైనమత సిద్ధాంతమునకు సంబంధించిన సూత్రము లేక నియమమే కాని అలంకారశాస్త్ర పరిభాషకు సంబంధించిన కవిసమయము కాదు.

రేచన తరువాత విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి'లో కావ్యదోషములను వివరించి చెప్పుచు—

చర్చసేయ జగదసమ్మతమగు నర్థ
మది విరుద్ధ మనఁగ నతిశయిల్లు
దేశకాలలోకదిక్సమయకవిరు
ద్ధాహ్వయములచేత నైదు నాఁగ.

అను పద్యమునందు సమయ శబ్దము పుట్టించినాడు. ఉదాహృతిని కూడ ఇచ్చినాడు. కాని ఈ సమయ శబ్దమునకును కవిసమయమునకును సంబంధము లేదు. ఇచట సమయ మనగా సంప్రదాయ బద్ధమైన జ్ఞానము. సంప్రదాయ మనగా మత సంప్రదాయమే ! రాజశేఖరుడు 'కావ్య మీమాంస అష్టమాధ్యాయములో

3. సంస్కృతా ముద్రిత గ్రంథము - M. S. D. 12808 - Preserved in the Govt. Oriental M. S. S. Library - MADRAS.

"సమయ విద్యాసు శైవ సిద్ధాన్తీయః" అని వ్రాయుచు శైవమత సిద్ధాంతము నకు సంబంధించిన సమయములు లేక నియమములు అని సమయ శబ్దమును వివరించెను. కవి జనాశ్రయకర్త మల్లియరేచన చెప్పిన సమయము, విన్నకోట పెద్దన చెప్పిన సమయము ఒక్కటే. వారుదాహరించిన పద్యములుకూడ ఇందు కనుకూలముగా ఉన్నవి. సమయము శాస్త్రసంబంధి కనుక కవి సమయమున కున్న అశాస్త్రీయతా లక్షణ మిట పొసగదు.

పదునేనవ శతాబ్దమువాడైన అనంతామాత్యుడు ఛందో దర్పణమున రేచన పెద్దనల మత సమయమునే సోదాహరణముగా వ్రాకుచ్చెను.

పదునారవ శతాబ్దమువాడైన ధూర్జటి 'కాళహస్తీశ్వర మాహాత్మ్యము' నందు నత్కీరుని కథలో 'తప్పిది చెప్పరాదు కవితా సమయంబున నొప్పుగాదు' అని 'కవితా సమయ' ప్రసక్తి తెచ్చినాడు. కవితా సమయ మనగా ఇచట కవి సమయమే. సింధుర రాజగమనా ధమ్మిల్ల బంధము సహజ గంధమను అర్థము వచ్చునట్లు శివుడు వ్రాసియిచ్చిన పద్యమును హరద్విజుడు చదువగా నత్కీరుడు తప్పువట్టెనట. అది కవితా సమయము కాదనెనట. కొప్పునకు సహజ సౌరభ మున్నట్లు వర్ణించుట కవి సంప్రదాయమునకు విరుద్ధమైన అంశమని నత్కీరుని వాదములోని తాత్పర్యము.

పింగళి సూరన 'కళా పూర్ణోదయా'వతారికలో కావ్య లక్షణములను వివరించుచు "సమయంబు దప్పక" అని సమయ శబ్దమును ప్రయోగించెను. కాని ఇచట సమయ మనగా కవిసమయమని ఊహించుటకు అవకాశములేదు. సమయమనగా ఇచట నియమ మను సామాన్యార్థమే. ఈ నియమము శాస్త్రీ యము కావచ్చును. కవిసమయముకూడ కావచ్చును.

రామరాజ భూషణుడు 'కావ్యాలంకార సంగ్రహము' (నరస భూపా లీయము)న అర్థదోషములను గూర్చి చెప్పుచు "దేశకాలా సముచిత విరుద్ధ మయ్యె"నని వివరించినాడు.[1] కవిసమయ మను సంకేతమును ప్రత్యేకముగా పేర్కొనక పోయినను 'విరుద్ధము' అను అర్థదోషము కవిసమయములకు సంబం ధించినదే అని వ్యాఖ్యాతృ హృదయము. 'కావ్యాలంకార సంగ్రహము' నకు ప్రామాణికమైన వ్యాఖ్యానమును రచించిన శ్రీ సన్నిధానము సూర్య

1. కావ్యాలంకార సంగ్రహము – 4 వ ఆశ్వాసము పద్యము 49.

నారాయణ శాస్త్రిగారు ఈ అర్థ విరుద్ధ దోషము నుట్టంకించు పద్యమునకు వ్యాఖ్యానము వ్రాయుచు కవిసమయములను నిర్వచించి ప్రాచీనాలంకారికులు పేర్కొన్న కవిసమయములను ప్రోగుచేసి చూపిరి. ఆ పట్టున శ్రీ శాస్త్రిగారు "సమయ మనగా సంప్రదాయము. అనగా నాచారము లేక మర్యాద"[1] అని వివరించిరి.

కానుకూరి అప్పకవి 'అప్ప కవీయము'నందు "శబ్దార్థదోష సీసమాలిక"లో "దేశ సమయములోక దిక్కాల మైత్ర విరోధాగమ కళా నిరోధములును" అని సమయ విరుద్ధ ప్రయోగమును దోష జుష్టమని వ్రాక్కుచ్చెను. అంతేకాని కవి సమయమును ఇతడుకూడ నిర్వచింపలేదు.[2] అప్పకవీయముననే మరొకచోట "సిద్ధిర్లోకా ద్వ్రశ్యా" అను ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రమును వ్యాఖ్యా నించుచు "పూర్వ కవిసమయసిద్ధ పదంబులు" అను ఒక సంకేతమును ప్రయో గించి దేశ్య పదముల స్వరూప స్వభావములను వివరించుటకు ప్రయత్నించెను. ఈ పట్టున 'సమయ' శబ్దమును అనూచానముగా వచ్చుచున్న సంప్రదాయమను అర్థమున ప్రయోగించెను. కవిసమయమునకున్న రూఢ్యర్థమును ఇది ప్రతిపా దించుట లేదనునది స్పష్టము.[3]

పరమ ప్రామాణికులైన పండితులుగా, వ్యాఖ్యాతలుగా, నాటక కర్తలుగా, ప్రసిద్ధి వడసిన శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు "ఆంధ్ర గ్రంథ విమర్శన ప్రకారలేశము" అను వ్యాసమున కవిసమయములను ఉట్టంకించుచు "కవిసమయములు స్వభావ విరుద్ధములయ్యును అవిలంఘనీయములు" అని ఉల్లేఖించిరి. సంప్రదాయానుసరణమునకు ప్రాబల్యము అట్టిదని వారి హృదయమని స్పష్టమగుచున్నది.[4]

శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు "కొన్ని కవిసమయములు" అను వ్యాసమున "కవి సంకేతిత మయినది కవిసమయము. కవిసమయములు లోకము

---

1. కావ్యాలంకార సంగ్రహము - వ్యాఖ్యానము శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి - పుట 485.

2. అప్పకవీయము - ప్రథమాశ్వాసము 34 వ పద్యము.

3. అప్పకవీయము - ప్రథమాశ్వాసము 115-118 పద్యములు.

4. భారతి, జూన్ - 1930.

నందుగాక కావ్యములందే ప్రసిద్ధములగు కొన్ని ప్రకృతి పరిణామ వర్ణనములు అని వివరించినారు.[1]

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు రామరాజ భూషణుని వసుచరిత్ర మునకు వ్రాసిన పీఠికలో వర్ణనాత్మకమైన ప్రబంధములలో కవిసమయము లుండునని తెలుపుచు, కవిసమయము లననేమో చెప్పుటకు ప్రయత్నించిరి. వారి దృష్టిలో కవిసమయము లనగా కవులచే ప్రయుక్తములగు కొన్ని ప్రసిద్ధములైన ఉపమానములు.[2] కవి సమయములు ఉపమా సామగ్రియని వారి హృదయము. ఈ పట్టున వారు చేసిన వివేచనము ఇట్లనుకొనుటకు అవకాశ మిచ్చుచున్నది. ఇది స్థూలదృష్టికి తోచు సంశయము. సూక్ష్మదృష్టితో పరిశీలించితిమేని కవిసమయ మునకున్న పారంపర్య లక్షణము వారి మాటలలో ధ్వనించుచున్నది.

శ్రీ కప్పగల్లు మఠము కరిబసవశాస్త్రిగారు "కవి సమయము" అను వ్యాసమున ఇట్లు నిర్వచించినారు. "కవిసమయ మనగా కవు లనేక విధములుగా వర్ణనా వైఖరిచే లోకవృత్తమును వెలిబుచ్చుచున్నారు. ఇట్లు చేయునపుడు పాఠకుల యాహ్లాదాతిశయమునకై ప్రతి నిత్యము మేము (మనము) చూచు చున్న పదార్థములందు సాదృశ్యములగు పదార్థములనే పోల్చునట్టి కొన్ని సంకేతమునుంచుకొనుచున్నాము. ఆ సంకేతములకే కవిసమయమని పేరు.[3]"

అనేకోదాహరణములతో శ్రీ శాస్త్రిగారు కవిసమయమును విశ్లేషించు టకు ఈ వ్యాసమున ప్రయత్నము చేసిరి. కాని కవిసమయమును నిర్వచించిన వైనము స్పష్టముగా లేదు. రాజశేఖరుని నిర్వచనముకంటె మెరుగైనదిగా కనిపించుటలేదు.

శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు "సాహిత్య సౌందర్య దర్శనము" నందు కవిసమయములను సోదాహరణముగా నిర్వచించిరి. "శాస్త్రములందు చెప్ప

---

1. వ్యాసకదంబము - బులుసు వేంకట రమణయ్య - పుట 15.
2. వసు చరిత్రము - పీఠిక - ప్రచురణ ఎమెస్కో సంప్రదాయ సాహితి. పుట XXII.
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - ప్రభవ - మార్గశీ - సంపుటము 1 సంచిక 5, 6. (1926).

బడనిదియు, అలౌకికమును పరంపరాయాతమునయిన అర్థము కవిసమయము" అని రాజశేఖరుని నిర్వచనమునే ఉట్టంకించిరి.[1]

హిందీ భాషా సాహిత్యకులలో పరమ ప్రామాణికులు విద్వత్కవి శిరోవతంసులు పండిత హజారి ప్రసాద్ ద్వివేదిగారు ఒక వ్యాసమున కవిసమయమును గూర్చి సుదీర్ఘముగా వ్రాసిరి. ఈ వ్యాసము హిందీ సాహిత్యమునకే కాక అధునాతన భారతీయ సాహితీ ప్రపంచమునకే ఒక నూత్న దృక్కోణమును ఒక విమర్శనాంశమును ప్రసాదింపగలిగినది. వ్యాసారంభముననే శ్రీ ద్వివేదిగారు కవిసమయ శబ్దమునకు అర్థమును వివరించుచు కవిసమయమనగా "కవుల అచారము లేక సంప్రదాయము"[2] అనిరి.

కావ్య జగత్తులో ఈ కవిసమయములు ప్రతీకలుగా వ్యవహృతము లగుచుండునని సుప్రసిద్ధ హిందీ సాహిత్య శాస్త్రజ్ఞులు డా॥ రాంకుమార్ వర్మగారు అభిప్రాయ పడినారు.[3]

మహా మహోపాధ్యాయ గంగానాథ్ ఝాగారు "కవి రహస్య" అను గ్రంథములో కవిసమయములను గూర్చి వివరించుచు రాజశేఖరుని నిర్వచనమునే ప్రమాణముగా స్వీకరించినారు. ఈ 'కవి రహస్యము'ను గ్రంథమును వారు ప్రాచీనకవుల కవిశిక్షా ప్రణాళికగా లేక ప్రాచీనకవుల దృష్టిలో కవులనుసరింప దగిన మార్గదర్శక సూత్ర సూచికగా పేర్కొన్నారు.[4]

1957 లో డా॥ విష్ణు స్వరూప్‌గారు వారణాసి హిందూ విశ్వవిద్యాలయమున కవిసమయములను గూర్చి పరిశోధించి "కవి సమయ్ మీమాంసా" అను గ్రంథమును వెలయించినారు. శ్రీ విష్ణు స్వరూప్‌గారు ఆ గ్రంథమున వృక్ష, పక్షి, రత్న, వారి, ఆకాశ వర్ణ, సంఖ్యా, స్వర్గ, పాతాళీయాది కవిసమయములను వర్గీకరించి హిందీ కావ్యములలో వానికి లక్ష్యములను చూపి వివరించుటకు ప్రయత్నించినారు.[5]

---

1. సాహిత్య సౌందర్య దర్శనము - పుట 26. ప్రచురణ 1972.
2. హిందీ సాహిత్య్‌కీ భూమికా - కవి ప్రసిద్ధియాఁ. పుట 225.
1. సాహిత్యశాస్త్ర - ప్రకాశకులు - భారతీయ విద్యాభవన్ అలహాబాద్ - పుట 63 (1956)
2. కవి రహస్య - (1929)
3. కవిసమయ్ మీమాంసా - హిందూ విశ్వవిద్యాలయము వారణాశి (1963)

కవిసమయములను గూర్చి సాహిత్య శాస్త్రజ్ఞులును, సాహితీ విమర్శకులును వివరించిన తీరు తెన్నులను నేనింతవరకు విశదపరచుటకు ప్రయత్నించితిని.

అలౌకికములును అశాస్త్రీయములును అయిన వర్ణనములు దోషజుష్టములను ప్రాచీనాలంకారికుల అభిప్రాయములతో ఏకీభవింపక రాజశేఖరుడు వినూత్న దృక్కోణముతో కవిసమయములకు శాస్త్రస్థాయిని ప్రసాదించినాడు.

భరతుడు ఆలంకారికులలో ఆద్యుడు. అతని నాట్యశాస్త్రమున పదునారవ అధ్యాయమున గూఢార్థాది దశవిధ కావ్యదోషములను పేర్కొనెను. అందు 'న్యాయాపేత' దోష మొకటి. "ప్రమాణ వర్జితమైన (దేశ-కాల-కలా-శాస్త్ర విరుద్ధమైన) అర్థము న్యాయోపేత మనబడును.[1]

భరతునివలెనే భామహదండి వామనులు - అలౌకికములైన వర్ణనములు దోషజుష్టములనిరి. ఈ నలుగురును రాజశేఖరునకు పూర్వ మున్నవారే. భామహుడు "దేశకాల కలాలోక న్యాయాగమ విరోధిచ ప్రతిజ్ఞా హేతు దృష్టాంత హీనం దుష్టంచ నేష్యతే"[2] అనియును, దండి - "దేశకాల కలాలోక న్యాయాగమ విరోధిచ, ఇతిదోష దశైవేతే వర్జ్యాః కావ్యేషు సూరిభిః"[3] అనియును, వామనుడు "దేశకాల స్వభావ విరుద్ధార్థాని లోకవిరుద్ధాని, కలాచతుర్వర్గ శాస్త్ర విరుద్ధార్థాని విద్యా విరుద్ధాని"[4] అనియును శాసించినను కావ్యకళా మర్మజ్ఞుడైన రాజశేఖరుడు ఈ లాక్షణికు వాదములతో ఏకీభవింపక అలౌకికములైన అశాస్త్రీయములైన వర్ణనములనుకూడ అంగీకరించి వానిని కవిసమయములను సంకేతముతో సాహిత్య శాస్త్రమున స్థాపించినాడు.

ఈ విధముగా రాజశేఖరుడు కవిసమయమును స్థాపించిన తరువాత ఏ ఒక్క ఆలంకారికుడు కూడ అతని నిర్వచనమును పూర్వపక్షము చేయలేదు. కావున ఆతని నిర్వచనమును తరువాత కాలమున ప్రభవిల్లిన ఆలంకారికులందరును అంగీకరించిరనియే నిస్సందేహముగా భావింపవచ్చును. వారు ఉదాహరించిన కవిసమయము లన్నియును ఇంచుమించు రాజశేఖరుని నిర్వచన పరిధిలోనికే చేరుచున్నవి.

---

1. నాట్యశాస్త్రము - అనువాదము. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు - పుట 446.
2. కావ్యాలంకారము - 4-2.
3. కావ్యాదర్శము 4-3.
4. కావ్యాలంకార సూత్రవృత్తి 2-2-23. 24.

ఆతడు కవిసమయములను వింగడించుచు చెప్పిన "అసతో నిబంధనాత్, సతోఽప్య నిబంధనాత్, నియమతశ్చ" అను వాక్యములనే ఆధారము చేసికొని ఆలంకారికులు కవిసమయములను విశ్లేషించి యుండిరి. కవిసమయమును సూత్రబద్ధము చేసినది ఒకే ఒక అలంకార శాస్త్రగ్రంథము 'కావ్యమీమాంస'. కేవలము ఊహాజనితములని సత్యదూరములని, దోషజుష్టములని అనాదరణమునకు గురియగుచున్న కవిసమయములను సూత్రీకరించి, వింగడించి, వానికి శాస్త్ర మర్యాదలను సంతరించి కవి సమాజమునకు పాథేయములుగా, కావ్య రసాస్వాదనమునకు ఉపస్కారకములుగా తీర్చిదిద్దిన ఖ్యాతి రాజశేఖరునకే దక్కినది. రాజశేఖరుడు ప్రౌఢకవి. సిద్ధహస్తుడైన నాటకకర్త. మీమాంసకుడు. విద్వద్వతంసుడు. అన్నిటిని మించి అపూర్వవిషయగవేషణాతత్పరుడు. కనుకనే అతని 'కావ్యమీమాంసా' రచనము నూత్నదృక్పథమున పయనించినది.

అలంకారశాస్త్రమును షడంగములతోపాటు సప్తమాంగముగా పేర్కొన్న సాహసికుడాయన. కావ్య ప్రపంచమున విస్తృత ప్రయోగము నందుండియు సాహిత్య శాస్త్రమున విస్మృతమైన కవిసమయమును తన శేముషీ విశేషముచేత ప్రబోధించి అలంకార శాస్త్రమునందు ఒక సిద్ధాంతముగా సుప్రతిష్ఠితము చేసినాడు. మూడు (14, 15, 16) అధ్యాయములలో కవి సమయ సిద్ధాంతమును సోదాహరణముగా ఉల్లేఖించినాడు. "వస్తువృత్తిర తంత్రం కవిసమయః ప్రమాణమ్మ" ని కవిసమయమునకు ప్రామాణికత్వమును సవదరించి పరంపరాయితముగా ప్రయుక్తములగుచున్న కవిసమయములు శాస్త్రసమ్మతములు కాకపోయినను, లోకసమ్మతములు కాకపోయినను దోషములు కావని కవులకు అపూర్వమైన అభయప్రదాన మొసగినాడు రాజశేఖరుడు.

ఇక అతని నిర్వచన సూత్రమునందలి సామంజస్యమును, సామర్థ్యమును, సమగ్రతను పరిశీలింతును.

"అశాస్త్రీయమలౌకికంచ పరంపరాయాతం యమర్థము పనిబధ్నంతి కవయః స కవిసమయః" (అశాస్త్రీయమును లోకవిరుద్ధమును పరంపరాయాతమునునయిన ఏ అర్థమును (విషయము) కవులు కూర్చుదురో అదె కవి సమయము.)

శాస్త్రమర్యాదలకు లొంగియుండు అంశములను కవులు ఒకవేళ ప్రయోగించినను అవి శాస్త్రాంశములే అగును. కాని కవిత్వాంశములు కావు. శాస్త్రమునందులేని లేక శాస్త్రమునకు అందని లేక శాస్త్ర విరుద్ధము లైన అంశములే పండిత పామర హృదయములను పసార్ద్రి మొనర్చుచుండును. శాస్త్రపరిధిలో ఉన్న అంశములు ప్రయుక్తములైనప్పుడు అవి సత్యములుగా భాసింపవలెను; యథార్థములుగా భాసింపవలెను. ప్రాయికముగా కవుల ప్రయోగములు శాస్త్రవిపరీతములు కాక అనుక్షణము పరివర్తన శీలములైన ఊహాలకును మనః కల్పనలకును సమీపముగా ఉండును. ఆ ఊహాలకు రూప కల్పనము చేయవలసి వచ్చినపుడు కవులకుపయోగపడు సామగ్రి శాస్త్ర సమ్మతము కానక్కరలేదు. శాస్త్రము తర్కమునకధీనము. కవిత్వము హృదయాధీనము. హృదయమునకు ఆనందమును కలిగించు వస్తుసముదాయ మును కవులు కొంత కల్పించుకొన్నారు; ఉన్నదానికి కొంత చేర్చినారు. ఈ కల్పనలకు శాస్త్రమునందు కాని లోకమునందు కాని ఆధారమున్నదా లేదా అను మీమాంసకు స్వస్తిచెప్పి కవులు వీనిని యథాతథముగా స్వీకరించు టకు ఏర్పాట్లు కావించుకొన్నారు. హృదయరంజనమునకు ఉపస్కారకము లైన ఈ ఏర్పాట్ల (కవిసమయముల)ను శాస్త్రమును విశ్వసించి దానిపట్ల ప్రమాణబుద్ధి కలిగిన సాహిత్యాచార్యులుకూడ మన్నించి కవులకు అవి అనుసరణీయములే అని ఆదేశించినారు. కనుక ఇచట 'అశాస్త్రీయ' మని రాజ శేఖరుడు కవిసమయములకు లక్షణముచెప్పి కవిత్వమును శాస్త్రమునుండి చాల చతురముగా విడదీసినాడు. వర్ణనలన్నియును శాస్త్ర సమ్మతములు కావలెనను వాదమును ఎవరేని లేవదీసినచో కవిత్వము ఉడిగిపోవలసినదే. కమనీయ కల్పనము అణగిపోవలసినదే.

శుక్లపక్షమునందు చీకట్లు, కృష్ణపక్షమునందు వెన్నెలలు లేకుండునట్లు వర్ణించుట కవిసమయము. నిజమునకు శుక్లపక్షమున చీకట్లు, కృష్ణపక్షమున వెన్నెలలు ఉండుట సత్యము; అనుభవసిద్ధము. కాని ఈ కవిసమయమున సత్యమును కప్పిపుచ్చుటకు ప్రయత్నము జరుగుచున్నది. అసత్యమును ఎత్తి చూపుటకును ప్రయత్నము జరుగుచున్నది ఈ రెండు ప్రయత్నములును శాస్త్ర విరుద్ధములు. లోకానుభవదూరములు. అయినను కవులకివి సమ్మతములైనవి. సమయములైనవి. బ్రహ్మసృష్టికంటె కవిసృష్టి

ఉత్కృష్టము కదా! బ్రహ్మసృష్టికి ఒక నియతి ఉన్నది. ఒక కట్టుబాటున్నది. కవి సృష్టికి నియతిలేదు. కట్టుబాటులేదు. అది అనన్య పరతంత్రము; హ్లాదైక మయము; నవరసరుచిరము.[1] ఇట్టి కవిసృష్టి శాస్త్రీయముకాదు. దీనికి శాస్త్రమునందు స్థానములేదు. ఎందుకనగా శాస్త్రములు నియతినేర్పరచునవి. కట్టుబాట్లు చేయునవి. సత్యపరతంత్రములైనవి. పరంపరాయతముగా కవులు ఉల్లేఖించు వర్ణనములు (విషయములు) అశాస్త్రీయములైనను అంగీకార్యములే అని రాజశేఖరుడు సిద్ధాంతీకరించినాడు. అశాస్త్రీయమను లక్షణము కవిసమయమునకే పరిమితమైనది కాదు. అది యావత్కవితా ప్రపంచమునకు సంబంధించినదనుట సాహసము కాదు. సుప్రసిద్ధ ఆంగ్లకవి విమర్శకుడు కాలెరిడ్జ్ కవిత్వము శాస్త్రీయ విజ్ఞానమునకు విరుద్ధమైనదనియును, దాని ప్రయోజనము సద్యఃపరనిర్వృతియే కాని సత్యముకాదని వాక్రుచ్చెను.[2]

విఖ్యాత సంస్కృత భాషా సాహిత్యాచార్యులు డా॥ రాఘవన్‌గారు "కవిత్వోద్దేశ్యము హృదయానంద సంధానము. ఈ ఆనందము ధ్వనివలన సాధ్యమగును. ఎవ్వడేని దీనిని ఏదేని నియమమునకు కాని, తర్కమునకు కాని కట్టబెట్టుటకు ప్రయత్నించినచో అది కవిత్వముకాద"ని[3] అభిప్రాయపడినారు. కవికత్వమునకు శాస్త్రముతో సంబంధములేదను సిద్ధాంతమునే ఆయన బలపరచినారు.

కావ్యము హేతుబద్ధము కాదు. శాస్త్రము హేతుబద్ధము. హేతుబద్ధమగుట యనగా శాస్త్రమర్యాదలకు కట్టుబడియుండుట. క్రిస్టొఫర్ కాడ్వెల్ (CHRISTOPHER CAUDWELL) అను సుప్రసిద్ధ పాశ్చాత్య రచయిత, విద్వ

1. "నియతకృత నియమరహితాం
హ్లాదైక మయీమనన్య పరతంత్రాం నవరస రుచిరాం
నిర్మితి మాదధతి భారతీ కవేర్జయతి" - మమ్మటుని కావ్యప్రకాశము.

2. "Poetry is anti thesis of Science having for its immediate object pleasure not truth" —Coleridge

3. "Poetry, being intended for the delight of the imagination, must be effective only through suggestion and hint, and when one makes it a bit of grammar or logic ceases to be a Poetry—".

—'Some Cocepts of Alankara Sastra'

ద్వియస్సకుడు తన 'ILLUSION AND REALITY' లో కవితాలక్షణములను వివరించుచు కవిత్వము హేతుబద్ధముగ నుండదను లక్షణమునుకూడ ప్రస్తావించెను. అతడు - "Poetry is irrational" అని వివరించుచు "By rational we mean confirming with the orderings men agree upon seeing in the environment. Scientific argument is ratinal in this sense Poetry ;s not"[1] అని అన్నాడు.

షెల్లీ కవి — "Poetry is Something not subject to the active Powers of the mind" అని అన్నాడు.

ఈ ఆలోచనలను పరిశీలించితిమేని శాస్త్ర నిర్మాణమునకును, కవితా నిర్మాణమునకును భేదమున్నదనియును, శాస్త్రము కవితాత్మను బంధించ లేదనియును తెల్సుకొన వచ్చును. రాజశేఖరుడు అశాస్త్రీయమను లక్షణమును కవిత్వమునకు అనుసంధించి వ్యంగ్యముగా కవిత్వమునే నిర్వచించెనెమో యని తలపోయుటకు అవకాశమున్నది. శాస్త్రముల కట్టుబాట్లకు లోగని అంశములు కవిత్వమున కోకొల్లలుగ నుండును. కాని ఆ అంశములు తరతరములుగా కవుల మనసుల కెక్కినపుడు సముదాచారములుగ ప్రచురితములగును. 'అశాస్త్రీయ' మను లక్షణమునకున్న విస్తృతి ఇట్టిది. అశాస్త్రీయమని రాజశేఖరుని వంటి శాస్త్రార్థ గాంభీర్యమును జీర్ణించుకొన్న లాక్షణికుడు వివక్షించిన ఈ కవిసమయలక్షణము విలక్షణమైనదనియును కవులకు మార్గదర్శకమనియున్న నిస్సందేహముగా చెప్పవచ్చును.

**అలౌకికము :-**

కవి సమయమునకు రాజశేఖరుడు చెప్పిన మరియొక లక్షణము 'అలౌకిక' ము. అలౌకికము అనగా ఇహలోకమునకు సంబంధించనట్టిది, మన మున్న లోకమున లేనట్టిది, మానవునకు దృష్టిగోచరమగునట్టి స్థావర జంగ మాత్మకమైన ప్రపంచమున లేనట్టిది. కవి హృదయము రసాధీనమగునప్పుడు, అతని భావములు శబ్దాకృతిని పొందునప్పుడు ఈ లోకములోనున్న వానికంటె విలక్షణములైన ఊహాతీతములైన రూపము లేర్పడును. ఈ లోకమున మనకు కనిపించు వస్తువులలో లేని వర్ణములు, వాసనలు, లక్షణములు, అందములు, చేష్టలు అందు భాసించును. ఇట్లు భాసమానమైన వినూత్నావస్థయే కవిత్వా

1. "ILLUSTION AND REALITY"— Page 128, Peoples Publishing House Ltd., Delhi (1956) —First Published in London (1937)

నిర్మాణమునకు హేతుభూతమగును. ప్రాయికముగా బ్రహ్మ సృష్టిలో ఏదో లోపమున్నట్లు కవికి కనిపించును. ఆ లోపమును సవరించుటకో యనునట్లు మార్పులు, చేర్పులుచేసి కవి తన హృదయమును ఆవిష్కరించును. ఈ మార్పులు, చేర్పులు కవితా వ్యాపారమునకు సంబంధించినట్టివి. అపారమైన కావ్య సంసారమునకు ప్రజాపతియైన కవి మనఃస్థితికి సంబంధించినట్టిది. ఆ మనఃస్థితిలో గోచరములగు వస్తు లక్షణములు ప్రత్యక్ష ప్రపంచమున లేక పోవచ్చును. మన దైనందిన జీవితానుభవమునకు విభిన్నములుగా తోచ వచ్చును. కవితా ప్రపంచమున లోకభిన్నములుగ తోచు ఈ అంశములు రసికుల ఆనందానుభూతికి కారణములగుచుండును. ఉపమాద్యలంకారములు ఈ యాథార్థ్యమునే సూచించుచున్నవి. నదులందు పద్మోత్పలములు, జలాశయములందు హంససారసములు లేకున్నను వర్ణించుట కవిసమయము. నిజమునకు నదులందు పద్మోత్పలము లుండవు. అన్ని జలాశయములలో హంససారసములుండవు. కాని ఈ పుష్పవికాసహాసములవలన, ఈ పక్షుల కలస్వనములవలన నదీ సరస్సౌందర్యములు అతిశయించును. కనుక నదీ సరోవర్ణన సందర్భమున కమలములను, కలువలను, హంససారసాది పక్షులను అవి లేకున్నను కవులు వర్ణించుట పరిపాటి. లోకానుభవమునందు లేని ఈ అంశము కావ్యలోకములోని కెక్కుటవలన నదీ సరస్సులకు నిండుదనము చేకూరును. బ్రహ్మ సృష్టిలో నిస్తేజములుగా నీరవములుగా కనిపించు నదీ సరస్సులను కవి తన సృష్టిలో సుందరతాబంధురములుగా మధురస్వనభరితములుగా ఒనర్చును. ఈ విధముగా నదీసరస్సులకు శోభాహేతువులైన కమలోత్పల మరాళసారసస్థితి వర్ణనము పరంపరాయాతమై అనుసరణీయమై కవిసమయముగా రూపొందినది. నదులలో పద్మములు లేకున్నను, సరస్సులలో హంసలు లేకున్నను ఉన్నట్లు వర్ణించుట దోషము కాకపోవుట యటుంచి గుణమేయను భావము ప్రబలి అవశ్యానుసరణీయమై, కవిసమయమై భాసిల్లగలిగినది.

వెన్నెలను దోసిళ్లతో ఎత్తికొనవచ్చునని, కడవలలో నింపుకొనవచ్చునని మరొక కవిసమయము. యథార్థ ప్రపంచములో వెన్నెల ఎండవలెనే ఒక కాంతి విశేషము. నీళ్లవలె, పాలవలె ఇది పాత్రలలో ఇముడదు. దోసిళ్లలోనికి రాదు. లోకములో చంద్రికలను ఇట్లు నింపుకొనుట విడ్డూరమైన విషయము. సత్యదూరమైన అంశము. కనుకనే అతి అలౌకికము. లోకములో ఉన్నదానిని

చెప్పుటకు కవిత్వమును ఆధారముగా చేసికొనవలసిన పనిలేదు. వక్రోక్తి అనావశ్యకము. కన్నులున్న వాడెవడైనను చూడగలడు. లోకమునందులేని అంశములను కవులేల వర్ణింపవలయునను ప్రశ్న ఉదయింపవచ్చును. కాని లోకాలోకనమువలన కలిగిన అనుభూతిని కవి ప్రకటించునప్పుడు వ్యంగ్య ధోరణిని అవలంబించును. భంగ్యంతరముగా చెప్పుటకు ప్రయత్నించును. ఈ ప్రయత్నమే ఆహ్లాదసంధాయకమైన కవిత్వమునకు బీజప్రాయము. రాజశేఖరుని కవిసమయ నిర్వచన సూత్రముననున్న 'అలౌకిక' శబ్దము 'అశాస్త్రీయ' మను శబ్దమువలెనే అతిగభీరమైన నిగూఢమైన విస్తృతమైన అర్థమును ప్రతిపాదించు చున్నది. 'అలౌకిక' మను శబ్దము చాల పదిలముగా పనితనముతో వేసినది. ఈ శబ్దము కవిసమయమునకే పరిసీమితమైనది కాదు. నిఖిల కావ్యసంసారము నకు సంబంధించి నట్టిది. ఇది శాస్త్రము లేర్పరచిన సమయము కాక కవు లేర్పరచుకొన్న సమయము. కనుక దీనిలోని యాథార్థ్యముల జోలికిపోక సహృదయులు కావ్యానందము ననుభవింతురు. కావ్యనందమనగా అలౌకికా నందమును ప్రసాదించునను ఆలంకారికుల ప్రసిద్ధాభిప్రాయమును ఈ అలౌకిక శబ్దము ఝటితిస్ఫూర్తిగా వ్యంజించు చున్నదనుట సాహసము కాక పోవచ్చును.

## పరంపరాయాతము :-

నిర్వచనములోని 'పరంపరాయాతమ్మ'ను శబ్దమును పరిశీలింతుము. అశాస్త్రీయమైన అంశమును ఎవ్వడేని వర్ణించినచో అది శాస్త్రమునకు విరుద్ధ మైన ప్రయోగమని లేదా శాస్త్రోక్తము కాదని శాస్త్రజ్ఞులు కొట్టివేయుదురు. లోకములో లేని అంశమును ఎవ్వడేని వర్ణించినప్పుడు అది అసత్యమని, అభూతకల్పనమని సహృదయులు ఈసడించుకొను ప్రమాదమున్నది. శాస్త్రము ఒప్పకున్నను, లోకమునందు లేకున్నను ఆ వర్ణనాంశము ఒకవేళ పరంపరా యాతమైనచో శాస్త్రకారులుకాని, లోకజ్ఞులుకాని దోషముగా పరిగణింపరు. ఇది రాజశేఖరుని కవిసమయనిర్వచనములోని అంతరార్థము. అతని తరువాత వెలసిన ఆలంకారికులలో అందరును లోకశాస్త్ర విరుద్ధములైన వర్ణనాంశములు కవిసమయ ప్రసిద్ధములైనచో దోషముగా పరిగణించవలసిన అగత్యములేదని తీర్మానించి కవిసమయములు ఉపాదేయములే యని ఆదేశించిరి. ఈ ఆదేశము రాజశేఖరుని నిర్వచనమునకు వ్యాఖ్యానప్రాయముగా ఉన్నదని ప్రత్యేకించి

చెప్పనక్కరలేదు. అశాస్త్రీయమైనను అలౌకికమైనను వర్ణనాంశము సంప్రదాయసిద్ధిని బడసిననే గాని కవిసమయము కాదు. అందుకే పరంపరాయాతమ్ము' ను శబ్దము ఈ నిర్వచనమునకు ప్రాణమువంటిదని ముందే చెప్పియుంటిని. 'ఆప్టే సంస్కృత నిఘంటువు' లో సంప్రదాయమను మాటకు TRADITION AN ESTABLI SHED CUSTOM, USAGE, అను అర్థములున్నవి. సంప్రదాయమనగా పరంపరాగతముగా అందిన పరిజ్ఞానము. TRADITION, CONVENTION అను ఇంగ్లీషు పదములు సంప్రదాయమునకు సమానార్థకములు. సామాన్య లోకవర్తన మెప్పుడును పరమార్థమును దర్శించుటకు యత్నింపదు "గతానుగతికోలోకః నలోకః పారమార్థికః, సైతా సైకతలింగేన తామ్రము పాత్రం వినశ్యతి." ఒకడు తన రాగిచెంబును ఇసుకలో దాచిపెట్టి దాచిన తావును తిరిగి గుర్తించుటకు ఆ స్థలమున ఇసుకతో లింగాకారమును కల్పించెనట. అతడు మహాపండితుడట. సైకతలింగ నిర్మాణము నతడు చేసెనని పలువురును కొని తామును అట్లే చేసిరట. కొంతకాలము తరువాత ఆ పండితునికి పలువురు నిర్మించిన సైకతలింగములలో తనదేదో తెలిసికొనలేక విచికిత్స ఏర్పడెనట. కనుక పరంపరాయాతముగా ఒక తరము ముందు తరమునకు అందించిన అనుభవజ్ఞానమునకున్న ప్రాబల్యము సంప్రదాయాకృతిని దాల్చును. సంప్రదాయములుగా ఏర్పడిన అంశములను పూర్వపక్షము చేసిన సందర్భములు క్వాచిత్కములుగానే ఉన్నవి. శాస్త్ర ప్రపంచమున అనుభవము విస్తరించుచున్న కొలది శాస్త్రమర్యాదలుకూడ మారుచుండును. కాని సంప్రదాయములు విశ్వాసములై జనసామాన్యము మెదళ్లలో గూడుకట్టుకొని పోవును. సంప్రదాయపు మూసలో పోసి చెప్పిననేగాని క్రొత్త అంశముకూడ వారి మనస్సుల కెక్కదు. ఆదికవి వాల్మీకి వర్ణనములు నేటికిని పాథేయములగుచునే యున్నవి. వేదములు వాల్మీకి వ్యాసాదులను ప్రభావితులను చేసినవి. వాల్మీకి వ్యాసులు కాళిదాసాదులకు, కాళిదాసాదులు నన్నయాదులకు సంప్రదాయమును అందించుచువచ్చిరి. నేటికిని మహాకవిత్వలక్షణములకు ఒజ్జబంతులుగా వీరి రచనలు నిలిచిపోయినవి.

ఇట్లు బహుధా ప్రాచుర్యము నందుకొన్న కవిసమయములకు ఏకసూత్రత కల్పించు ప్రయత్నము ప్రాచీనులలోగాని, అర్వాచీనులలోగాని రాజశేఖరుడు తప్ప ఇతరు లెవ్వరును చేసియుండలేదు. అంతియేకాదు నిర్వచన

మును ఖండించి క్రొత్తగా చెప్పిన వాడెవ్వడును లేడు. కావ్య ప్రపంచమున కవిసమయములు సంపాదించుకొన్న స్థానమును బట్టియు, రాజశేఖరుడు వానిని సూత్రబద్ధముచేసిన పద్ధతిని బట్టియు ఆ నిర్వచనము ప్రామాణికమైనదని నిర్దుష్టమైనదని సమంజసమైనదని సిద్ధాంతము చేయవచ్చును.

రాజశేఖరుని కాలమునాటికే కవిసమయములు కొందరు 'ధూర్తుల'[1] మూలమున అపహాసనమునకు గురియగుచుండెనట. అట్టివానిని అతడు ప్రమాణీకరించి కవులకు అనుసరణీయములుగా పేర్కొని సాహిత్యశాస్త్రమున సముచిత స్థానము కల్పించెను.

శాస్త్రోక్తములు కాకపోయినను, లోకవ్యవహారమునందు లేకపోయినను కేవలము రసదృష్టితో కవులు ప్రయోగించిన కవిసమయములు కావ్యమునకు వన్నెతెచ్చు అలంకారసాధనములుగా వెలయుచున్నవను యాథార్థ్యమును గమనించి అర్వాచీనాలంకారికులు రాజశేఖరుని దృష్టికిరాని కవిసమయములను తమ గ్రంథములలో ఉదాహరించినారు. ఇట్లు కవిసమయములకు సాహిత్య శాస్త్రమునందు ప్రముఖస్థానము లభించినది. అటు శాస్త్రప్రమాణమునకును ఇటు లోకవ్యాపారమునకును సరిపోని కావ్య ప్రపంచమునందు మాత్రము ప్రాచుర్యమునందుకొన్న కవిసమయములకు నిర్వచనము సంఘటింపజేయుట చాల కష్టసాధ్యము. నిర్వచనము ఘటింపజేయుట యనగా శాస్త్రదృష్టితో ప్రమాణీకరించి సూత్రబద్ధముచేయుట. అనగా అతివ్యాప్తి అవ్యాప్తి దోషములను పరిహరించి, అనావశ్యకములైన పదములను పరిత్యజించి సంక్షిప్తముగా అసందిగ్ధముగా చెప్పుట.[2]

దారి తెన్నులేక పండితుల ప్రమాణబుద్ధికికూడతోపని, సామాన్యుల అనుభవమునందు లేని వర్ణనాంశములను అలంకారశాస్త్ర సామగ్రిగా గుర్తించి సూత్రబద్ధముచేసిన రాజశేఖరుడు కావ్యస్రష్టలకు ఉపదేశమును, సహృదయులకు రసాస్వాదనాఫణితిని సూచించి చరితార్థుడయ్యెను.

---

1. "తత్ర కశ్చిదాధ్యాత్వేన వ్యవస్థితః కవిసమయేనార్థః.
పరస్పరోపక్రమార్థ స్వార్థాయ ధూర్తైః ప్రవర్తితః"
—రాజశేఖరుని కావ్య మీమాంస 14 వ అధ్యాయము.

1. "అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్
అస్తోభమన వద్యంచ సూత్రం సూత్రకృతో విదుః"

# సాహిత్య శాస్త్రము - కవిసమయములు

## ద్వితీయ ప్రకరణము

సాహిత్యశాస్త్ర గ్రంథములలో ప్రత్యక్షముగా కొన్నింటి యందును, పరోక్షముగా కొన్నింటియందును కవిసమయముల ప్రసక్తియున్నది. రాజశేఖరుని కంటె పూర్వము కవిసమయములను గూర్చి ప్రత్యేకముగా ఉట్టంకించిన గ్రంథము లేదు. ఆయన తన కావ్యమీమాంసలో కవిసమయమును నిర్వచించి, స్థాపించిన తరువాత సాహిత్యశాస్త్రసమాలోచకులెందరో దాని ప్రాధాన్యమును బహురూపములుగా గుర్తించినారు. అందు ముఖ్యములైన అయిదింటిని ఇట పేర్కొందును.

### 1. కవిశిక్షారూపము

కొందరు పండితులు (ఆచార్యులు) "శాస్త్రమును, లోకమునుకాదని ఇచ్చవచ్చిన తెరగున ఉల్లేఖించుట అనగా (కవిసమయోల్లేఖనము) దోషము కాదా ?" అని లేవదీసిన సందేహమునకు సమాధానముగా రాజశేఖరుడు- "కవిసమయములు కవులకు మార్గము ననుగ్రహించు నవి"నియును," అవి దోషములు కాజాలవ"నియును నిష్కర్షగా చెప్పినాడు.[1] దీనివలన కవిసమయములు కవి శిక్షారూపములుగా అనుసరణీయములే అనుభావము అతని సమాధానమునందు ధ్వనించుచున్నది. రాజశేఖరుని తరువాత కవిసమయములును కవి శిక్షారూపములుగా పేర్కొన్న ఆలంకారికులను వారి గ్రంథములను ఈ దిగువ నుదాహరించుచున్నాను.

---

1. కవిసమయములను గూర్చి రాజశేఖరుడు వివరించిన కావ్య మీమాంసా విభాగము (14. 15. 16 అధ్యాయములను) ను గ్రంథాంతముననున్న అనుబంధము I లో సూచించి యున్నాను.

1. హేమచంద్రుని 'కావ్యానుశాసనము'
2. అంసింహ అమరసింహుల 'కావ్యకల్పలతావృత్తి.
3. దేవేశ్వరుని 'కావ్యకల్పలత'
4. అజితసేనుని 'అలంకార చింతామణి'
5. కేశవ మిశ్రుని 'అలంకార శేఖరము'.
6. శారదా తనయుని భావప్రకాశనము
7. విశ్వనాథుని సాహిత్య దర్పణము

ఈ గ్రంథములలో కవిసమయములను సిద్ధాంతీకరించు ప్రయత్నము జరుగలేదు. రాజశేఖరుడు చేసిన అసత్తును నిబంధించుట, సత్తును నిబంధింపకుండుట, నియమము అను విశ్లేషణమును అనుసరించియే అర్వాచీన లాక్షణికులందరును ఈ కవిసమయములను పేర్కొనినారు. వీరిలో ఎవరెవరు ఎన్నెన్ని కవిసమయములను క్రొత్తగా చేర్చి చూపినను ఎవరుగాని రాజశేఖరుడు చెప్పిన కవిసమయములను ఉదాహరింపక విడువలేదు. భాషా వ్యాకరణ సంబంధములైన కవిసమయములను మొట్టమొదట ఉల్లేఖించినవాడు 'అలంకార శేఖర' కర్త కేశవమిశ్రుడు.

ఈ కవిసమయములను కవులేకాక సహృదయులు కూడ తెలిసికొనవలసిన అవసర మెంతేని యున్నది.

## 2. అలంకారసాధనరూపము

దండి 'కావ్యాదర్శనము'న – "కావ్య శోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే"[1] అని వ్రాయుచు కావ్యమునకు శోభను కలిగించు ధర్మమును అలంకార మనినాడు.

కావ్యాత్మ ధ్వనియని సిద్ధాంతము చేసిన ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోకము'నకు 'లోచన'మను వ్యాఖ్యను వ్రాసిన అభినవగుప్తుడు "గుణాలంకారౌచిత్య సుందర శబ్దార్థ శరీరస్యసతి ధ్వననాత్మని కావ్యరూపతా వ్యవహారః" అని చెప్పెను. ధ్వననా వ్యాపారమైనప్పటికిని గుణాలంకార సంపద్వ్యక్తమైన

1. కావ్యాదర్శము 2-1.

సుందర శబ్దార్థ శరీరముగల వాక్యమునకే కావ్యాత్మత యని ఆయన హృదయము.

అప్పయదీక్షితులు 'చిత్ర మీమాంస'లో అలంకారము లన్నియును కవి సమయముల తోడ్పాటుతో మరింత హృద్యములుగను, కావ్య శోభాకరములు గను ప్రకాశించునని వక్కాణించినారు.[1]

'రస గంగాధర' కర్త జగన్నాథ పండితరాయలు కవిసమయ సిద్ధముకాని ఉపమ దోషయుక్త మనినారు.

ఉపమాద్యలంకార నిర్మాణమునందు సాధనభూత మగుచున్న ఉపమా సామగ్రిని ఈ కవిసమయములు సమకూర్చును. కవిసమయములనుగూర్చి తెలియ నిచో ఉపమాద్రవ్యముల ధర్మములు తెలియవు. కావున కవిసమయములు అలంకారసాధనారూపములుగ కావ్యశాస్త్రజ్ఞులచే గుర్తింపబడినవి.

## 3. అదోష గుణరూపము

ఈ అదోషత్వ, గుణత్వ రూపమునకు రెండు పక్షములున్నవి. మొదటిది - కవిసమయ సిద్ధమైన వర్ణనము అదోషమేకాక గుణముకూడ నగుట.

రెండవది - కవిసమయవిరుద్ధమైన వర్ణనము దోషమగుట.

మొదటిది :- కావ్యప్రకాశకర్త మమ్మటుడు లోకవిరుద్ధమైన వర్ణనము కవిసమయ సిద్ధమైనప్పుడు దోషము ఉండదని సోదాహరణముగా వివరించినాడు.

"సుసిత వసనాలంకారాయాం కదాచన కౌముదీ
మహసి సదృశిస్వైరం యాంత్యాం గతోఽస్తమ భూద్విధుః
తదనుభవతః కీర్తిః కేనాప్య గీయత యే నసా
ప్రియగృహ మగాన్ముక్తా శంకాక్వనాసి శుభఃప్రదః"

---

1. సర్వేపిహ్యలంకారః కవిసమయ ప్రసిద్ధ్యనురోధేన హృద్యతయా కావ్యశోభాకర ఏవ అలంకారతాం భజతే-అతః "గోసదృశః కవయః" ఇతి నోపమా - అప్పయ దీక్షితులు. 'చిత్ర మీమాంస'.

2. మమ్మటుని 'కావ్య ప్రకాశము' సప్తమోల్లాసము 266.

అత్రా మూర్తాపి కీర్తిః జ్యోత్స్నావత్ప్రకాశరూపా కథితేతి లోక విరుద్ధమపి కవి ప్రసిద్ధేర్న దుష్టమ్"[1]

అమూర్తమైన కీర్తికి జ్యోత్స్నారూపము లోకవిరుద్ధము. ఐనను కవిసమయమునననుసరించి ఇట్లు ఉల్లేఖించుట దోషముకాదు. జయదేవుడు తన 'చంద్రాలోకము'న విద్యావిరుద్ధమైన వర్ణనము కవిసమయకారణమని అదోష మని ఇట్లు నిరూపించినాడు.

"తవ దుగ్ధాబ్ధిః సంభూతైః కథం జాతా కలంకితా
కవీనాం సమయాద్విద్యా విరుద్ధోఽదోషతాం గతః"[2]

"ఓ చంద్రా! క్షీరసాగరమునందు పుట్టిన నీకు కళంక మెక్కడిది? క్షీరసాగరమునందు పుట్టిన చంద్రుడు నిష్కళంకుడును, అత్రినేత్ర జన్యుడగు చంద్రుడు కళంకితుడు నగుట పురాణ ప్రసిద్ధము. ఇట్లు పురాణ ప్రసిద్ధ విషయమునకు విరుద్ధముగా వర్ణించుట విద్యా (శాస్త్ర) విరుద్ధమైన దోషము. అత్రినేత్రమును బుట్టిన చంద్రునకును, క్షీరసాగరమున బుట్టిన చంద్రునకును ఐక్యము చెప్పుట కవిసమయము. ఈ చంద్రద్వయమునందు కళంకముండుట కూడ కవిసమయమే. అందువలన పురాణ (విద్యా) విరుద్ధమైన వర్ణనము నందు దోషములేదు.

విశ్వనాథుడు 'సాహిత్య దర్పణము'నందు—"నిర్హేతుతాతు ఖ్యాతేఽర్థే దోషతాం నైవ గచ్ఛతి, యథా సంప్రతి సంధ్యా సమయశ్చక్రద్వంద్వాని విఘటయంతి"[3]

(వర్ణ్య విషయము లోక ప్రసిద్ధమైనప్పుడు నిర్హేతుతాదోషతా ఉండదు. ఉదా: ఈ సంధ్యాకాలమిప్పుడు చక్రవాకముల జంటను విడదీయు చున్నట్లు తోచుచున్నది.) అని వ్రాయుచు ఖ్యాతార్థములో నిర్హేతుతా దోషము ఉండదు అని వివరించెను. అందుకు నిదర్శనముగా సంధ్యా సమయము

1. మమ్మటుని 'కావ్య ప్రకాశము' సప్తమోల్లాసము 266.
2. జయదేవుని 'చంద్రాలోకము' ద్వితీయ మయూఖము శ్లో - 43.
3. విశ్వనాథుని 'సాహిత్య దర్పణము' - సప్తమ పరిచ్ఛేదము. శ్లో.-22.

నందలి చక్రవాకమిథునవియోగమును చూపినాడు. అంతేకాకుండ "కవీనాం సమయే ఖ్యాతే గుణః ఖ్యాతి విరుద్ధత్వమను దోషము కవిసమయ ప్రసిద్ధి కారణముగ గుణముగనే భాసించునని అభిప్రాయ పడినాడు. ఖ్యాతి విరుద్ధత్వమనగా లోకమెరిగిన అంశమునకు విరుద్ధముగా చెప్పుట.

రెండవది : కవిసమయ విరుద్ధమైన వర్ణనము దోషము.

మమ్మటాచార్యుడు, యువతీ పాదాఘాతముచే అశోకము పునరంకురోద్గమమగుట కవిసమయ విరుద్ధమగుటవలన దోషమని పేర్కొనినాడు. ఏలయన కవిసమయము ననుసరించి యువతీ పాదాఘాతమువలన అశోకమునందు పుష్పోద్గమమగునే గాని పునరంకురోద్గమము కాదు.

"ఉపపరిసరం గోదావర్యాః పరిత్యజతాధ్వగాః
సరణిమపరో మార్గస్తావద్భవద్భిరిహేక్ష్యతామ్
ఇహహి విహతో రక్తాశోకః కయాపి హతాశయా
చరణ నలినన్యాసో దంచన్నవాంకుర కంచుకః"

"అత్ర పాదాఘాతేనా శోకస్య పుష్పోద్గమః కవిషు ప్రసిద్ధోన పునరంకురోద్గమః" (*కావ్య ప్రకాశము-సప్తమోల్లాసము 265.)

ప్రతాపమును ధవళముగా వర్ణించుట ప్రసిద్ధి (కవిసమయ) విరుద్ధమని జయదేవుడిట్లు ఉదాహరించినాడు.

"........................
ప్రసిద్ధయా విద్యయావాఽపి విరుద్ధమ్ ద్వివిధమ్ మతమ్
న్యస్తేయం పశ్య కందర్ప ప్రతాపధవళద్యుతిః
........................

(చంద్రాలోకము - జయదేవుడు 2-34,35) ప్రతాపమునకు రక్తవర్ణమును చెప్పుట కవిసమయము. ధవళవర్ణము చెప్పుట కవిసమయ విరుద్ధము. కావున దోషము.

కవిసమయము దోషముకాక గుణమేయను అభిప్రాయమును వాచ్యముగా పేర్కొనక పోయినను దోషము మాత్రము కాదను విషయమును

మమ్మటునకంటె ముందే రుద్రటుడు తొమ్మిదవ శతాబ్దమునందే సూచించి నాడు. ఇతడు కవిసమయమను సంకేతమును ప్రయోగింపకయే 'మహాకవి ప్రసిద్ధము' లైన వర్ణనములు నిరాధారములైనను పరంపరాయాతముగా కవులు ఉపయోగించుచుండుట వలన అవి స్వీకార్యములే యను భావమును వెలిబుచ్చెను. ఇంతియేకాక మహాకవిప్రసిద్ధములైన వర్ణనములు అదోషము లనియును, ప్రమాణబద్ధములనియును దానికి భిన్నముగా స్వతంత్రించి ప్రయోగింపకూడదనియును సిద్ధాంతీకరించెను. దిశలు ఆకాశము మూర్తములు కావు. ఐనను కవులు వీనిని నిర్మలములుగా (మూర్తములకు చెప్పినట్లుగా) వర్ణించుట పరిపాటియని ఉదాహృతులను చూపెను.[1]

## 4. ధ్వని, వ్యంజనా రూపము :

ధ్వనివాదులననుసరించి అర్థశక్తి నుండి ఉత్పన్నమగు సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని-కావ్యము (ఉత్తమ కావ్యము) యొక్క పన్నెండు ఎనిమిది భేదములు, కవి ప్రౌఢోక్తి సిద్ధము, కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధము, వస్తువు మరియు నలంకారములపై ఆధారపడి యున్నవి. కవి ప్రౌఢోక్తి సిద్ధమనగా కవియే వక్తయగుట. కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధమనగా పాత్ర వక్త యగుట. ఈ రెంటిలో ఒక్కొక్కటి నాలుగు విధములు.

1. వస్తుకృత వస్తుధ్వని
2. వస్తుకృతాలంకార ధ్వని
3. అలంకార కృత వస్తుధ్వని
4. అలంకార కృతాలంకార ధ్వని.

---

1. యద్యన్యథాత్వం నివార్యతే తర్హి కథం దిశాకాశాదిష్వ మూర్తేషు మూర్తి ధర్మాః కవి భిర్వర్ణ్యతే. యథా నిర్మితాదిశః నిర్మలం నభ ఇతి. తథా విచేతనేషు సచేతన ధర్మా ఇత్యాహః

—సుకవి పరంపరయా చిరమ విగీతతయా న్యథా నిబద్ధం యత్‌వస్తు తదన్యా దృశమపి బధ్నీయాత్తత్ప్రసిద్ధమైన సుకవీతి. పూర్వసుకవీనాం పరంపరయా సమూహేన చిరం బహుపూర్వకాలేఽ విగీతతయా విగానేవ నిర్దోషయేతి యావత్. యద్వస్త్వన్యథా నిబద్ధం తదన్యాదృశమపి తత్ప్రసిద్ధమైవ బధ్నీయాత్. నత్వాత్మబలేన. మహాకవి ప్రసిద్ధిరేవాత్ర ప్రమాణ మిత్యర్థః —రుద్రటుని కావ్యాలంకారము - ఏడవ అధ్యాయము.

ఉదాహరణమునకు—'సాహిత్య దర్పణము'లో వస్తుకృత వస్తుధ్వని— శరకారుడు వసంతుడు, యోద్ధ కామదేవుడు, యువతులే లక్ష్యముగాగల మామిడిపూల గుత్తుల బాణములు; కవిప్రౌఢోక్తి సిద్ధములైన వస్తువులు. వీని వలన మదన విజృంభణము (కామోద్దీపనము-ఋతువు వసంతము) రూపమైన వస్తుధ్వని తోచుచున్నది.

"సజ్జేహి సురహి మాసోణ దావ అప్పే ఇజు అఇజణ లక్ఖసుహే అహిణ వసహ ఆరముహేణవ పత్తలే ఆణజ్గస్సరే."

(సజ్జయతి సురభిమాసోన చార్పయతి యువతిజనలక్ష్య సహాన్ అభినవ సహకారముఖాన్ నవ (పల్లవ) పత్రలాన్ అనఙ్గస్యశరాన్) అత్ర వసంతః శరకారః, కామోధన్వీ, యువతయో లక్ష్యం, పుష్పాణిశరా, ఇతి కవి ప్రౌఢోక్తి సిద్ధంవస్తు, ప్రకాశీభవన్మదన విజృంభణ రూపమ్ వస్తువ్యక్తి.[1]

అలంకార ధ్వనికి ఉదా :

"రజనీషు విమలభానోః కరజాలేన ప్రకాశితమ్‌వీర !
ధవళయతి భువనమండల మఖిలం తవకీర్తిసంతతిః సతతం"
అత్ర కవిప్రౌఢోక్తిసిద్ధేన వస్తునాకీర్తి సంతతేశ్చంద్రశాలా
దధికాల ప్రకాశత్వేన వ్యతిరేకాలంకారో వ్యంగ్యః[2]

"ఓ రాజా! చంద్రజ్యోత్స్నలు రాత్రులందు భువన మండలమును ప్రకాశింపజేయును. నీ కీర్తి సంతతి తన స్వచ్ఛ ప్రకాశముచేత దీనినెప్పుడును ప్రకాశింప జేయుచుండును." ఇచట కవి ప్రౌఢోక్తి (కవిసమయ) సిద్ధ వస్తువు చేత కీర్తి సంతతి చంద్రకిరణ జాలాధికకాల ప్రకాశత్వముచేత వ్యతిరేకాలంకారము వ్యంగ్యము.

## 5. ఔచిత్య రూపము :

అల్లరాజు 'రసరత్న దీపిక'లో కవిసమయ స్వీకృతార్థము రసపోషకమని చెప్పినాడు.

1. 2. సాహిత్య దర్పణము - చతుర్థ పరిచ్ఛేదము.

"అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్యకారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా"[1]

తి పూర్వాచార్యాః పఠంతి. అస్యాయమర్థః యత్రౌచిత్యం వర్తతే
విసమయ స్వీకారమ్ తదేవ రసపోషణంకురుతే అన్యథా రసవైరస్యమేవ.[2]

ఇంతవరకు ఉల్లేఖించిన వివిధాంశముల పరిశీలనము వలన ఈ కవి
మయములు కావ్యరచనకు అత్యంతావశ్యకములైన సాధనములనియును
దితమగుచున్నది. కవిసమయములు రసావిష్కరణమునకు ప్రత్యక్షముగా
డపడకపోయినను తత్సాధనమునకు ఇవి పరోక్షముగా ఉపస్కారకములగు
నుటలో సందేహము లేదు

కావ్యోత్పత్తి హేతువులలో శిక్ష కూడ ఒకటి.

"శక్తిర్నిపుణతాలోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుద్భవే"

ని కదా మమ్మటుని మతము. ఈ కారణముచేత శిక్షారూపమైన కవిసమయము
వ్యహేతువగుననుటలో విప్రతిపత్తిలేదు.

సాహిత్య శాస్త్రజ్ఞులందరును కావ్యము నిర్దోషముగను, సగుణముగను
ండవలయుననను అభిప్రాయమును వ్యక్తపరచి యున్నారు.[3] కవిసమయ

---

1. ధ్వన్యాలోకమున దీనికి మూల మిట్లున్నది. "అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్య కారణమ్. ఔచిత్యోప నిబంధస్తు రసస్యోప నిషత్పరా."

2. 'రసరత్న దీపికా' అల్లరాజు 6-43.

3.
| | |
|---|---|
| మమ్మటుడు : | తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి |
| విద్యానాథుడు : | గుణాలంకార సహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ |
| వాగ్భటుడు : | శబ్దార్థౌ నిర్దోషౌ సగుణౌ ప్రాయః సాలంకారౌ కావ్యమ్ |
| హేమచంద్రుడు : | అదోషౌ సగుణౌ సాలంకారౌచ కావ్యమ్ |
| అగ్ని పురాణము : | కావ్యమ్ స్ఫుటదలంకారమ్ గుణవద్దోష వర్జితమ్ |
| సరస్వతీ కంఠాభరణము : | నిర్దోషం గుణవత్కావ్యాలంకారై రలంకృతమ్ |
| భామహుడు : | సర్వథా పదమప్యేకం న నిగాద్య మవద్యవత్ విలక్ష్మణాహి కావ్యేన దుఃసుతేనేవ నింద్యతే. |

కావ్యాలంకారము 1-11.

ప్రయోగము దోష జుష్టము కాదనునది ఆలంకారికులంగీకరించిన విషయమే. విశ్వనాథుడు కవిసమయమును కావ్యగుణముగనే గుర్తించినాడు. దోషాభావముకూడ గుణమే అను మతమునకు సాహిత్యశాస్త్రమునందు చెల్లుబాటున్నది. అభినవగుప్తుని మతమును అనుసరించి దోషవిపర్యయమే లేదా దోషాభావమే గుణమనునది భరతుని హృదయము. ఆనందవర్ధమని తరువాత వెలసిన సాహిత్యాచార్యులుకూడ దోషరాహిత్యమే గుణమని నమ్మినారు.

ఈ అభిప్రాయములను పరిశీలించినచో కవిసమయగతములైన అశాస్త్రీయ అలౌకిక వర్ణనములు కావ్యగుణములుగనే భాసించునని విశదమగుచున్నది.

ప్రాచీనాలంకారికులు అలంకారములను అర్థగుణములుగనే గుర్తించినారు. దండి కావ్యశోభాకరములైన సర్వలక్షణములను అలంకారములనెను.[1] వామనుడు అలంకారములనుండి గుణములను పృథక్కరించినాడు. గుణములను కావ్యశోభాకరములగు నిత్యధర్మములుగను, అలంకారములను కావ్యశోభనతిశయింపజేయు అనిత్యధర్మములుగా పేర్కొనినాడు.[2] వామనుని తరువాత ఓజః ప్రసాదాది గుణములు అంగిరసాశ్రయములుగా గుర్తింపబడుటవలన ఈ పృథగ్భావమింకను స్పష్టమైనది.[3] ఓజః ప్రసాదాది గుణములకు భిన్నములైన ఇతర గుణములన్నియును అలంకారములుగనో లేక దోషాభావములుగనో నిలిచిపోయినవి.

అలంకారమునకున్న విస్తృతార్థమును దృష్టియందిడుకొని, కవిసమయ సాంగత్యముచే అలంకారములు మరింత ఉజ్జ్వలముగా భాసించునని అప్పయదీక్షితులు, జగన్నాథ పండితరాయలు నొక్కిచెప్పియుండిరి. ఈ విధముగా కవిసమయములు కావ్యశోభాకరధర్మములకు సంబంధించిన పరిజ్ఞానమును కలిగించుటకు సమర్థములని నిష్కర్షగా చెప్పవచ్చును.

---

1. దండి - కావ్యాదర్శము 2-1.

2. "కావ్యశోభాయాః కర్తారౌ ధర్మాగుణాః
తదతిశయ హేతవస్త్వలంకారః" —వామనుడు.

3. యే రసస్యాంగినో ధర్మా శౌర్యాదయ ఇవాత్మనః
ఉత్కర్షహేతవః తేస్యుః అచలస్థితయోగుణాః —కావ్య ప్రకాశము (మమ్మటుడు)

కవిసమయ (కవి ప్రౌఢోక్తి సిద్ధ) గతమైన వస్తువు ఉత్తమ కావ్యమునకు హేతుభూతమని ధ్వనివాదులు స్పష్టముగా సిద్ధాంతీకరించినారు. వారి మతము ననుసరించి ముఖ్యార్థమును బాధించునది దోషము. ముఖ్యార్థమనగా రసమే.[1] రసోత్పత్తికి కారణములు విభావాదులు. విభావములకు ఉత్కర్షాహేతువులు కవిసమయములు. ఇట్లు కవిసమయములు పరోక్షముగా కావ్యరూపమైన రససృష్టికి దోహదముచేయుచున్నవి.

ఔచిత్య దృష్టితో కూడ కవిసమయములు రససాధకములే. ఔచిత్యము రసమునకు ప్రాణభూతము.

"ఔచిత్యస్య చమత్కారకారిణే చారుచర్వణే
రసజీవిత భూతస్యవిచారం కురుతేఽధునా"[2]

అర్థ దృష్టితో చూచినను, వస్తు దృష్టితో చూచినను, కవిసమయములు ఔచిత్యమునకు ఆధారము.

వర్ణ్యవస్తువునకు భావానుకూలమైన స్వరూపమును కల్పించి కావ్య సౌందర్యమును సవదరించుటయే కవిసమయోద్దేశము. కుంతకుడీ వర్ణ్యవస్తువునే కవికౌశల జన్యమైన ఆహార్యవస్తువనెను. ఇది అర్థాలంకారమునకు భిన్నమైనది. అలంకారమునకే అలంకారము నాపాదించు సౌందర్యతత్త్వమిది. ఈ ఆహార్య వస్తువును విశ్లేషించునపుడు వక్రోక్తికిని కవిసమయమునకును గల స్వతస్సిద్ధ సంబంధము స్పష్టము.

ఈ విధముగా గుణదోషాలంకార ధ్వన్యౌచిత్యాద్యనేక సాహిత్య శాస్త్ర సంప్రదాయ స్వరూపగతములై కవిసమయములు కావ్యరససృష్టికిని రసాస్వాదనమునకును ఉపస్కారకములగుచున్నవి.



1. ముఖ్యార్థ హతిర్దోషః రసశ్చ ముఖ్యస్తదాశ్రయాద్వాచ్యః —మమ్మటుడు.
2. క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చ - 7 కారిక.

# కవిసమయములు - వర్గీకరణము

## తృతీయ ప్రకరణము

ఏదేని విషయమును సమగ్రముగా అవగాహన చేసికొనవలసి వచ్చినపుడు ఆ విషయమును అనేక దృక్కోణములతో పరిశీలించుట అనివార్యమే కాదు అభిలషణీయము కూడ. ఇట్టి పరిశీలనమునందే వర్గీకరణమునకు అవసర మేర్పడును. వ్యాసుడు వేదములను నాలుగు విధములుగ ఋగ్యజుస్సామాథ ర్వణములుగ విభజించి వేదచోదితములైన ధర్మములను, విధులను తత్త్వములను అధ్యేతలకును అనుష్ఠాన పరులకును సుబోధకములుగా ఒనర్చెను. ఇదే విధముగా కళాశాస్త్ర విద్యా విషయకములైన ఎన్నియో అంశములను వర్గీకరించిన విధానము మనకు ఆర్షసాహిత్యమునందేకాక ఆధునికములైన సారస్వతము లందుకూడ కనబడును. వేదములు నాలుగు. శాస్త్రములు ఆరు. పురాణములు పదునెనిమిది. కళలు అరువది నాలుగు-ఇత్యాది. ఈశ్వరతత్త్వము కూడ ముత్తెరగులై సృష్టిస్థితిలయములకు కారణభూతులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా రూపొందినది. శాస్త్ర విషయ వివరణము నందు వర్గీకరణమువలన సౌలభ్యమేర్పడును అతివ్యాప్త అవ్యాప్త దోషములకు అవకాశము లేకుండును. వస్తువుయొక్క బహుముఖీన ధర్మములు స్పష్టముగా కరతలామలకములగును. ఈ వర్గీకరణ విధానము తర్కబద్ధముగా సాగుట ముఖ్యము. విషయము విపులమగుచున్న కొలదియు ఏర్పడు వర్గముల సంఖ్యయు హెచ్చుచుండును.

ప్రాయికముగా సాహిత్యశాస్త్ర గ్రంథములలో ద్యోతకమగుచున్న వర్గీకరణము ఆయా ఆలంకారికులు తాము ప్రతిపాదించు సిద్ధాంతములకు అనుగుణములుగా చేసికొన్నది. కనుకనే అర్థాలంకార భేదములలో ధ్వనిభేదము లలో రసభేదములలో ఇంకను అనేకాంశముల భేదములలో అన్యథాత్వము కనిపించుచున్నది.

అనేక విషయములు శాస్త్రములందు చర్చింపబడును. శాస్త్ర మర్యాదల ననుసరించి విషయ పరిజ్ఞానమంతయును సూత్రబద్ధమై సంక్షిప్తతను సంతరించు

కొనును. లోకమునందనేక విషయములున్నను మానవుని అనుభవ పరిధిలోనికి వచ్చినవి మాత్రమే శాస్త్ర నిర్మాణమునకు హేతుభూతములగును. దైనందిన జీవితానుభవము శాస్త్ర పరిజ్ఞానము పరస్పరాశ్రితములు. కాని శాస్త్రము నందును లోకమునందును లేని విషయములను ఒక పరిధిలోనికి తీసికొనివచ్చుట కష్టసాధ్యము. దేశకాల పాత్రములను అనుసరించి అనుభవములలో వైవిధ్యముండితీరును. ఆ వివిధానుభవములను కొన్ని ప్రమాణములతో కొలిచి సామాన్య లక్షణములను రూపొందించుట శాస్త్రలక్షణము. లోకానుభవమునందు లేనిదానిని శాస్త్ర పరిధియందు ఇముడని దానిని సూత్రబద్ధముచేయుట కష్టసాధ్యము. కవిసమయము ఈ కోవకు చెందినవి. ఐనను శాస్త్రమర్యాదలను అనుసరించి వీనిని వర్గములక్రింద విభజించినచో పరిశీలించుటకు సుగమమైన మార్గమేర్పడును.

## రాజశేఖరుని వర్గీకరణము :

రాజశేఖరుడు తన కవిసమయ నిర్వచనమును దృష్టియందిడుకొని వర్గీకరించిన పద్ధతిని వివరింతును.

రాజశేఖరుడు కవిసమయములను స్వర్గ, భౌమ, పాతాళీయములని ముత్తెరగులుగా వింగడించినాడు. అందు భౌమ కవిసమయములు ప్రధానములని చెప్పి వానిని జాతి, ద్రవ్య, గుణ, క్రియా రూపములుగా విభజించినాడు. ఆ తరువాత ఈ నాల్గింటిలో ఒక్కొక్కదానిని మూడు భాగములుగా చేసినాడు, ఆ మూడు—'అసత్-నిబంధనమ్ సతోఽవ్యనిబంధనమ్, నియమమ్' అనునవి.

రాజశేఖరుని తరువాత కవిసమయములను తమ సాహిత్యశాస్త్ర గ్రంథములలో వివరించిన అజితసేనుడు, హేమచంద్రుడు, అరిసింహ, అమరచంద్రులు, దేవేశ్వరుడు, కేశవమిశ్రుడు మున్నగు ఆలంకారికులు రాజశేఖరుని వర్గీకరణమునే అనుసరించినారు. విశ్వనాథుడు మాత్రము ఈ వింగడింపుల జోలికిపోక కేవలము కవిసమయములను మాత్రమే పేర్కొనెను. ఈ ఆలంకారికులలో ఎవరుగాని రాజశేఖరుడు ప్రధానముగా చెప్పిన స్వర్గ-భౌమ-పాతాళీయములను త్రివిధ విభజనను చూపలేదు. వ్యాఖ్యాన ప్రాయము

లుగా వెలసిన తెలుగు సాహిత్యశాస్త్ర గ్రంథములందు కూడ రాజశేఖరుని వర్గీకరణ ప్రణాళికకు అన్యథాత్వము లేదు.

రాజశేఖరుని కవిసమయ నిర్వచనమునకున్న పరిధిలోనే కవిసమయము లను విభగడించుటలో సామంజస్యమున్నది. రాజశేఖరుని కవిసమయ నిర్వచనము - అసదుల్లేఖనము (అసత్ - నిబంధనము), సదనుల్లేఖనము (సత్ - అనిబంధనము), నియమము అను ప్రధానమైన వర్గీకరణమందు సువ్యక్తమగుచున్నది. అసదుల్లేఖనము, సదనుల్లేఖనమును శాస్త్రము అంగీకరింపదు. లోకమునందు లేనివి లేక లోకమునకు అతీతమైనవి అలౌకికములు కదా! ఇక నియమములమాట యన్ననో-ఆ నియమములు కూడ పరంపరాయాతముగా కవులు చేసికొన్నవే కాని లోకమునందు గాని శాస్త్రమునందు గాని వానికి చెల్లుబాటు లేదు. కనుక నిర్వచనము ననుసరించి ఈ మూడింటినే ప్రధానముగా పేర్కొనుటలో ఒక సౌలభ్యమున్నది.

రాజశేఖరుడు జాతి ద్రవ్య గుణక్రియా విభజనమునందు ఒక్కొక్క దానిని అసదుల్లేఖనము, సదనుల్లేఖనము, నియమము అను మూడు విధములుగా చెప్పి ఉదాహరణములిచ్చుట చూడగా జాత్యాది విభజనమునకు కాక అసదుల్లేఖనాది విభజనమునకే ప్రాముఖ్యమున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ జాత్యాది విభజనము అశాస్త్రీయతను గాని, అలౌకికతను గాని పరంపరాయాతత్వమును గాని అవగతము చేసికొనుటకు అంతగా ఉపయోగపడదు. అంతేకాక జాత్యాది విభజనము నందలి సూక్ష్మభేదములను గ్రహింపకున్నను సదనుల్లేఖనాది వర్గీకరణమునకు విప్రతిపత్తి ఏర్పడదు. మరొకవిషయమేమనగా ఈ జాత్యాది విభజనము భౌమ కవిసమయములకే రాజశేఖరుడు పరిమితము చేసినాడు. స్వర్గపాతాళీయ కవిసమయములను పరిశీలించినచో అవి యన్నియును నియమరూప కవిసమయములే అని నిశ్చయింపవచ్చును. రాజశేఖరుని తర్వాత కవిసమయములను ప్రస్తావించిన ఆలంకారికులలో అజితసేన, హేమచంద్ర, అరిసింహ అమరచంద్రులు సదనుల్లేఖనాది విభజనమును ప్రధానముగా గ్రహించి జాత్యాది వర్గీకరణమును గౌణముగా భావించినారు. ఇక దేవేశ్వర, విశ్వనాథ, కేశవమిశ్ర, నరసభూపాలీయ వ్యాఖ్యాతలు సదనుల్లేఖనాది విభజనను మాత్రమే గ్రహించి జాత్యాది వర్గీకరణమును స్పృశింప లేదు.

మరొక అంశము—జాత్యాది వర్గీకరణ పరిధిలోనికి స్వర్గపాతాళీయ కవిసమయములు రావు.

మొత్తము మీద ఈ వర్గీకరణ పరిణామమును పరిశీలించినచో రాను రాను జాత్యాది విభజనకు ప్రాముఖ్యము పోయి సదసుల్లేఖనాది వర్గీకరణమునకే చెల్లుబడి లభించినట్లు తెలియవచ్చునున్నది. ఈ కారణములను దృష్టియందుంచుకొని స్పష్టత కొరకును, సౌలభ్యముకొరకును, రాజశేఖరుని సదసుల్లేఖనము ప్రధానముగా గల వర్గీకరణము ననుసరించి ఇంతవరకు ఉపలబ్ధములైన కవి సమయములను ఉదాహరించి వాని సామంజస్యమును, వాని పుట్టుకకు కారణములను పరిశీలింతును.

# ప్రథమ భాగము

## అసత్ - నిబంధనము (అసదుల్లేఖనము)

కేవలము సత్యకథనము (సత్ - నిబంధనము - సదుల్లేఖనము) కవిత్వాశయము కాదు. సత్యమును మాత్రమే చెప్పుట లేక సత్యమును విశ్లేషించుట శాస్త్ర మర్యాద. కవిత్వము వ్యంగ్యముగా సత్యమును ప్రతిపాదించునేమో! అట్టి సత్యమును గ్రహించుట సహృదయుల సంస్కారముపై ఆధారపడి యుండును. కవిసృష్టి బ్రహ్మసృష్టికంటె విభిన్నము. విశిష్టము. కవి తన అనుభూతులకు అక్షరాకృతులను కల్పించునపుడు ఆ ఆకృతులు సమగ్రసౌందర్యముతో శోభిల్లునట్లు ప్రయత్నించును. ఆ సౌందర్య సమగ్రతను సాధించుటకు ఆతడు ఈ లోకమునలేని వస్తువులను కల్పించుకొని, వానికి గుణదోషముల నాపాదించుకొని తనదైన నవసృష్టికి మూలపురుషుడగును. ఇక ఈ సృష్టిలో సత్యాసత్యముల మీమాంస ఉండదు. ఆతని హృదయాంతరాళములోనికి చొచ్చుకొని పోవుటకు ఈ మీమాంస ఉపకరింపదు సరికదా ఆతని సృష్టి కేవలము అబద్ధమను అభిప్రాయమును కలిగింపజేయును. సాహిత్యములో చర్మచక్షువులకు మాత్రము గోచరమగు వస్తుజాలమే ఉండవలెననుట కావ్యకళ నుండి కల్పనను త్రోసిరాజనుటయే. సుప్రసిద్ధ విమర్శకులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "తత్త్వశాస్త్ర సిద్ధాంతులేమందురోకాని సాహిత్యము వారమగు మనకు సత్యములేని అసత్యముకాని అసత్యములేని సత్యముగాని సాధారణముగా దొరకు పదార్థము కాదు."[1] అని కావ్యతత్త్వమును గూర్చి చెప్పిన అంశము కవిసమయములకు వర్తింపచేసికొనవచ్చును. అసత్తును అనగా లోకమునందుగాని, శాస్త్రమునందుగాని కనపడని లేక లేనివస్తువును నిబంధించుట అసత్ - నిబంధనము. ఈ అసత్ - నిబంధనము కవిసమయము. అట్లని కేవలము అభూతకల్పనము లేదా వినూత్న కల్పనము కవిసమయమనిపించుకొనదు. అవి అనూచానముగా సంప్రదాయముగా కావ్యములలో రూఢమై

---

1. సారస్వతాలోకము - రాయలనాటి రసికత.

పోవలెను. దానిని ప్రశ్నించుటకు అధికారము గాని, అవకాశమును గాని ఎవరును పొందలేరు.

కావ్య ప్రపంచమున రూఢమైపోయిన కవిసమయములలో నేను ఇతఃపూర్వము వేసికొన్న వర్గీకరణ ప్రణాళిక ననుసరించి మునుముందు అసత్తును నిబంధించు కవిసమయములను ఒక్కొక్కటిగా పేర్కొని వాని సామంజస్యమును విశ్లేషించుటకు ప్రయత్నింతును.

## 1. నదులలో సముద్రములలో పద్మోత్పలములు లేకున్నను ఉన్నట్లు వర్ణించుట :

సరస్సులలో పద్మోత్పలములుండుట ప్రకృతి సిద్ధము. నదులయందుకాని, సముద్రములందుకాని ఇవి ఉండుటకు వీలులేదు. నిలకడగా ఉన్న నీటి అడుగున గల పంకమునందు మాత్రమే కమలకుముదములుద్భవించుట కవకాశమున్నది. నదీ నదములందును సముద్రములందును కమలోత్పలములుండుట కవిసమయము. పురాణేతిహాసములందును కావ్యములందును దీనికి లక్ష్యము లనేకములుగా ఉన్నవి.

పంక, జల శబ్దములకును వాని పర్యాయవాచకములకును 'జ', 'జాత', 'రుహ'. అను శబ్దములను చేర్చినపుడు ఏర్పడు శబ్దరూపములన్నియు పద్మమునకు పర్యాయ పదములగుచున్నవి. నీటియందు ఒక పద్మమే పుట్టుటలేదు. పద్మమే పెరుగుటలేదు మరెన్నియో చరాచరములుద్భవించు చున్నవి. అయినను జలజము, జలజాతము, జలరుహము, పంకజము, పంకేజాతము, పంకరుహము ఇత్యాదిశబ్దములు కేవలము పద్మార్థముననే రూఢి అయినవి. కనుక ఎక్కడెక్కడ జలమున్నదో అక్కడక్కడ పద్మములుండుట సంభవమను ఊహ జనించుటకు అవకాశమేర్పడినది. సరస్సు, నది, సముద్రములలో కనిపించు సమానరూపము జలము. నదీ సింధుశబ్దములు ఏకార్థబోధకములు. కనుక సరస్సులలోవలె నదులయందును సముద్రముల యందును పద్మములుండునను అభిప్రాయమునకు తావేర్పడియుండును.

పుడమిపై ప్రవహించు నదులన్నిటికి గంగయను సామాన్య సంకేతమున్నది. హిమాద్రిలో పుట్టి బంగాళాఖాతమునందు కలసిపోవు గంగకును,

ఆకాశగంగకును ఐక్యము చెప్పుట పురాణ ప్రసిద్ధము. 'త్రిపథగ' అనగా స్వర్గ మర్త్య పాతాళములందు ప్రవహించునది అనగా గంగ. ఆకాశగంగలో స్వర్ణ కమలములున్నట్లును అవి సౌరభాన్వితములనియును పురాణేతిహాసకావ్య ప్రపంచములో పలుచోట్ల వర్ణనములున్నవి. ఖగోళ శాస్త్రమున ఈ ఆకాశ గంగను గూర్చి పరమాద్భుతముగ పరిశీలనము జరిగినది. నిర్మలాకాశమున మనకు కనిపించు పాలవెల్లి అనేక నక్షత్రముల సమూహము. నిజమునకు ఈ సుదీర్ఘ నక్షత్రమాలయే ఆకాశగంగ. నక్షత్రములన్నియు పద్మములు.[1] మన దేశమునందున్న నదులన్నియును పరమ పవిత్రములైన తీర్థములుగా గంగా సన్నిభములుగా ప్రస్తుతింప బడనవి. నన్నయ్య గోదావరిని 'దక్షిణగంగ' అనెను. కనుక ఆకాశగంగలోనున్న పద్మములు అన్ని నదులయందును ఉండ వలెనని ఊహించి ఉన్నవి అని తృప్తిపడుటలో అనౌచిత్యము లేదు.

దేవతల ఉద్యానవనమున ప్రవహించు స్వర్గంగను వాల్మీకి 'దేవపద్మిని' అన్నాడు. ఇచట 'పద్మిని' అనగా పద్మములు కలది అని అర్థము.[2]

సప్తర్షులు శివపూజకై స్వర్ణకమలములను ఆకాశగంగనుండి తెచ్చిరని కాళిదాసు రంఘువంశమునందున్నది.[3] దేవకంటకుడైన తారకుడు స్వర్గంగ లోని బంగారు పద్మాలను పెరికి తన ఉద్యానదీర్ఘికలలో నాటుకొనెనని కుమారసంభవమున కాళిదాసు వర్ణించెను.[4] శిప్రానదిలో పద్మములున్నట్లు మేఘదూతమునకూడ వర్ణనమున్నది.[5] గంగలో నీలోత్పలమున్నట్లు ఆదికవి

1. జ్యోతిర్వేదము - రెండవ ప్రకరణము - గొబ్బూరు వేంకటానంద రాఘవరావు.

2. దేవాక్రీడ శతాకీర్ణాం దేవోద్యానయుతాం నదీం
దేవార్థమాకాశగతాం విఖ్యాతా దేవ పద్మినీమ్ — రామాయణము 1-50-15.

3. అత్రాభిషేకాయ తపోధనానాం సప్తర్షిహస్తోద్ధృత దేవపద్మాం
ప్రవర్తయామాస కిలానుసూయా త్రిస్రోతసం త్ర్యంబక మౌళిమాలామ్
—రఘువంశము. సర్గ 12.

4. మందాకిన్యాః పయఃశేషం దిగ్వారణ మదావిలం
హేమాంభోరుహ సస్యానాం తద్వాప్యో ధామ సాంప్రతమ్ - కుమార సంభవము 4-22.

5. దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటతి కమలామోద మైత్రీకషాయః - మేఘదూతము 1-30

వర్ణించెను.[1] రాజశేఖరుడు కూడ ఈ కవిసమయమును పేర్కొను సందర్భమున "కువలయవన కాంత్యా జాహ్నవీం సోఽభ్యపశ్యత్" అని ఉదాహరించినాడు. తెలుగు కావ్యాలలో కోకొల్లలుగా దీనికి ఉదాహృతులున్నవి. అల్లసాని పెద్దన వరశాతరంగిణీదరవికస్వరనూత్న కమలకషాయ గంధము వహించి" అన్నాడు. విశ్వనాథ సత్యనారాయణ "పెన్నానదీ సముత్పన్న కైరవదళ శ్రేణిలో తెన్గువాసించునాడు" అన్నారు.

భారతీయ సంస్కృతిలో పద్మము సౌభాగ్యమునకును, సంపదకును, కళకును, పవిత్రతకును, సౌందర్యమునకును, ప్రతీక. దర్శనములందును శాస్త్రములందును పద్మము అనేక విషయ పరిజ్ఞానమునకు సంకేతము. బౌద్ధ జైనాది వివిధ మత సంప్రదాయములలో పద్మమెన్నింటికో చిహ్నము. వేయేల! సృష్టికర్తయైన బ్రహ్మ పద్మసంభవుడుకదా! దివ్యసౌందర్యమునకును మానవసౌందర్యమునకును పద్మము ఉపమాద్రవ్యము. పద్మము ఆకాశగంగలో ఉన్నందువలన పురాణప్రఖ్యాతిని వహించినది. భారతీయుల దైనందిన జీవితమునందు పౌరాణిక మర్యాదలకున్న ప్రాముఖ్యము ఎల్లరెరిగినదే. ఆ కారణముచేత దివ్యత్వమునకును సౌందర్యమునకును లక్ష్యప్రాయమైన పద్మము లేనిదే నదుల సౌందర్యము అసంపూర్ణమని కవులు భావించినట్లు ఊహింప వచ్చును. కమలోత్పలముల ప్రసక్తిలేని నదీ సౌందర్యవర్ణనము భారతీయ కావ్యప్రపంచమున లేదనుట సాహసము కాదు. సరస్సునకు 'పద్మిని', 'కమలిని' అను పర్యాయవాచకము లేర్పడుట ఎల్లరు ఎరిగినదే. నీరులేని ఏటిని, నిజముకాని మాటను, విద్వాంసులు లేని సభను, కన్నులులేని ముఖమును, బిడ్డలులేని గృహమును ప్రాజ్ఞులు అప్రకాశములనిరి, కమలములు లేని సరస్సునుకూడ ఈ అప్రకాశములతో చేర్చిచెప్పుట విశేషము. పద్మోత్పల ములు సముద్రమునందు ఉండున్నట్లు ఊహించుటకు పౌరాణిక గాథలు కూడ కారణమైనవి. సురాసురులు అమృతము కొరకు క్షీరవారాశిని మథించినప్పుడు పద్మము ప్రభవిల్లెననియును, అందుండియే లక్ష్మి అవతరించెనను గాథ ప్రసిద్ధము.

---

4. క్వచిత్తీరరుహైర్వృక్షైర్మాలాభిరివ శోభితామ్
క్వచిత్ఫుల్లోత్పలాచ్ఛన్నాం క్వచిత్పద్మ వనాకులామ్ – రామాయణము 2-50-20.

లోకమున లేకున్నను, శాస్త్రము అంగీకరింపకున్నను ఈ విషయము నిర్వివాదాంశమై, కావ్యగతాంశమై కవిసమయమై నేటికిని భాసించుచున్నది. నదులలో కమలోత్పలముల ఉనికి సాహితీలోకముననే కాదు ప్రత్యక్ష ప్రపంచమున కూడ సంభవమే-సత్యమే అనునంత గాఢముగా ఈ కవిసమయము నాటుకొని పోయినది. సముద్ర నదీ నదములలో పద్మ కుముదములు ఉండుటకు వీలు లేదనియును కనుక వర్ణింపరాదనియును ఎవ్వరేని శాసింప సమకట్టినచో కవులు లక్ష్యపెట్టరు సరికదా! సహృదయవిమర్శకులు సైతము దానిని పట్టించుకొనరు.

## 2. జలాశయములందు హంసాది పక్షులు లేకున్నను ఉన్నట్లు వర్ణించుట :

రాజశేఖరుడు సోదాహరణముగా వివరించిన ఈ కవిసమయమును తర్వాత వెలసిన అలంకారికులందరును ఉదాహరించినారు. జలాశయములను వర్ణించునపుడు అందు హంస సారసాది పక్షుల విహారములను వాని కలకూజితములను వర్ణింపవలెనని కవులకు అలంకారికుల సూచన.[1] వాల్మీకి రామాయణములో 'స్యందికానది' మయూర హంసాది పక్షులతో కలకలలాడుచుండెనని వర్ణనమున్నది.[2] దశరథుని రాజ్యవైభవ సూచకముగా ఆతని రాజ్యమునందలి తటాకములన్నియును పక్షి భ్రమర సంభృతములై ఉండెనని కాళిదాసు వర్ణనము.[3] రాజశేఖరుడు ఈ కవిసమయమునకు ఉదాహరణములుగా రెండు

---

1. కేశవమిశ్రుని 'అలంకార శేఖరము' ... మరీచి 12.

2. "గోమతీం చాప్యతిక్రమ్య రాఘవః శీఘ్రగైర్హయైః
మయూర హంసాభిరుతాం తతార స్యందికాం నదీం" - రామాయణము 2-94-12.

3. నయనగుణోపతితామివ భూపతేః సదుపకారఫలం శ్రియమర్థినః
అభియయుః సరసో మధుసంభృతాం కమలినీ మలినీర పతత్రిణః"
—రఘువంశము 9-2.

శ్లోకములు చూపినాడు. వర్షోదకముతో జాలువారుచున్న చిన్న వాగునందు కూడ హంససారసాది పక్షులున్నట్లు ఆ శ్లోకములలో వర్ణించినాడు.[1]

హంససారసాది పక్షులు జలాశయమాత్రముననుండుట కవిసమయము. హంసలు అన్ని జలాశయములలో ఉండకపోవచ్చును గాని నీరున్న తావులలో కొన్ని విధములగు పక్షులు తప్పనిసరిగా నుండుట సహజము. నదీసరోవరములు కేవలము జలపూరితములై ఉండుట చూపరకు తృప్తిని కలగింపవు. అందు అందమైన పూలు, ఆ పూలచుట్టుతుమ్మెదలు, జలతరంగాలలో నదీ సరస్తీరాలలో తేలియాడు తిరుగాడు పక్షులు, ఆ పక్షుల మధురకూజితములు ఇవన్నియును ఉన్ననే కాని ఆ జలాశయములకు సౌందర్యములేదు. ఆకర్షణము లేదు. నిండుదనము లేదు. జలాశయ గౌరవమునకు ఈ హంసాదిపక్షులిట్లు కారణములగుచున్నవి.

నదులలో సరస్సులలో దీర్ఘికలలో హంసాదిపక్షులు ఎల్లవేళల ఉండుట ఫలశుభప్రదమని వరాహమిహిరుడు వక్కాణించియున్నాడు. అంతేకాక హంసాదుల మధురనిస్వనములు అనల్పసౌఖ్యావహములనియును వివరించినాడు.[2] కనుక జలాశయములు తమకు శుభప్రదములుగా ఉండవలయునను మహాత్వాకాంక్షయే హంసాది పక్షులు వీనియందున్నట్లు ఊహించుటకు అవకాశము కలిగించినది. జలాశయములు జలసమృద్ధములై ఉన్నప్పుడే పక్షులను అవి ఆకర్షించును. ఆశ్రయమిచ్చును. నిర్జలములైన జలాశయములు క్షామ సూచకములు కదా! ఈ కవిసమయమునకు మంగళమయమును పవిత్రమును అయిన ఈ భావముకూడ ఒక ఆధారము కావచ్చును. జల, తరు, రస, కేదారములకు అధిదేవతలైన యక్షదంపతులకు హంసమిథునములు ప్రతీకలని

1. ఆసీదస్తి భవిష్యతీ హసజనో ధన్యోధనీ ధార్మికః
యః శ్రీకేశవత్ కరిష్యతి పునః శ్రీమత్ కుడుంగేశ్వరః
హేలాందోళిత హంససారసకుల క్రేంకార సమూర్ఛితై
రిత్యాఘోషయతీవ తన్నవ నదీయచ్చేష్టితం వారిభిః" – కావ్యమీమాంస 14–అధ్యా.
సఖం జరీటాసపయః ప్రసాదాసాకస్యనో మానస మాచ్ఛిన్నత్తి
కాదంబరాండవ చక్రవాక ససారస క్రౌంచకులాంయాతా – కావ్యమీమాంస 17–అధ్యా.

2. "హిందీ సాహిత్యకీ భూమికా - కవి ప్రసిద్ధియాఁ" – పుట 255.

పండితహజారీ ప్రసాద్ ద్వివేది తెలిపియున్నారు.[1] హంసల ఉనికి దేవతాత్వమును సూచించు చున్నది. ఈ పవిత్రభావమే ఈ కవిసమయమేర్పడుటకు మూలమని ఊహింపవచ్చును.

హంసాది పక్షులకు కావలసిన ఆహారము జలాశయములలో లభ్యమగుట సర్వసామాన్యమైన విషయము. హంసలకు తామరతూండ్లు ఆహారము, సారసములకు చేపలు, నత్తలు, జలగలు మున్నగు జలకీటకములు ఆహారము. కనుక జలాశయములనాశ్రయించుకొని పక్షులుండునని ఊహించుటలో విప్రతిపత్తిలేదు.

ఈ కవిసమయ ప్రభావమున పక్షులులేని జలాశయములు సాధారణముగా లోకములో ఉండవను విశ్వాసము ప్రజాబాహుళ్యములో ప్రబలముగా ఏర్పడిపోయినది. ఈ విశ్వాసమే కవిసమయమైనది.

ఈ కవిసమయమునకు ఉదాహరణములు తెలుగు కావ్యములలో ఎన్నింటినైనను చూపవచ్చును. ఎఱ్ఱాప్రెగడ ఆంధ్రమహాభారత ఆరణ్యపర్వము లోని ఈ పద్యము—

"స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంససారస మధువ్రత నిస్వనముల్ చెలంగగా
గరము వెలంగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్."

అల్లసాని పెద్దన మనుచరిత్రములో స్వరోచి భార్యలతో గూడి

"మసృణ బిసాహార మాంసల హంసికా
సంసదాసార కాసార తటుల"

యందు విహరించెనని వర్ణించినాడు.

## 3. జలాశయ మాత్రమున శైవాలమున్నట్లు వర్ణించుట:

ఆలంకారికులలో కేశవమిశ్రుడు ఈ కవిసమయమును ఉదాహరించినాడు. జలము నాశ్రయించుకొని యుండు వనస్పతి విశేషము శైవాలము.

1. కాశీ విద్యాపీఠ పత్రిక - 1936: పుట 376.

శైవాలమనగా-జలేశేతే శైవాలం. శైవలంచ-శీఙ్ స్వప్నే-జలమందుండునది. కావున జలమున్న తావులలో నెల్ల శైవాలపుటునికిని గుర్తించవచ్చును. శైవాలము జలచరములకును పశులకును ఆహారము. అది నదీ సరస్సౌందర్యమును అతిశయింప జేయునని కవులు వర్ణింతురు. నదీ సరోవరములను సుందరీ మణులతో నుపమించు సందర్భమున శైవాలమును వారి శిరోజములతో పోల్చుదురు. ఇది సంప్రదాయ సిద్ధము. సరసౌందర్యమును అతిశయింపజేయు పద్మములు శైవలముతో గూడి మరింత అందముగా అలరారును. శైవాల ప్రాధాన్య మెంతయున్నను నీరున్నచోటెల్ల ఇది యుండుననుట సత్యముకాదు. లోకానుభవమునకు దూరమైన అంశము. శాస్త్రీయముకూడ కాదు. కాని పరంపరగా కావ్యలోకమున చోటుచేసికొని కవిసమయముగా స్థిరపడి పోయినది. శైవలము అనేక విధములు. నీరు నిలకడగానున్న స్థలములలో పాచి రూపముననో నాచురూపముననో ఇది పెరుగుటకు అవకాశమున్నది. జలాశయములలో ఉన్నను లేకున్నను ఏ రూపముననున్నను శైవాలములేని జలాశయము ఊహాకే తట్టదు. శైవాలమున్న నీరు అంత స్వచ్ఛమైనది కాక పోవచ్చును. స్వచ్ఛజలములు శైవాలము ఉండకూడదను కోరికకు విరుద్ధముగా ఈ కవిసమయము శైవాలముండియే తీరవలెనను అభిప్రాయమునకు ఆలవాలమైనది. ఏవో కొన్ని ఓషధులు తరులతాగుల్మాదులు వాతావరణమందలి తేమను గ్రహించి బ్రతుకనేర్చునేమోగాని జలసంపర్కము లేకయే శైవలము పుట్టి పెరుగుట అనూహ్యము. కొన్ని సందర్భములలో ఈ శైవాల విశేషములు మన కంటికి కనపడకుండ సూక్ష్మరూపమున జలములందుట కూడ సంభవమే. కనుక కవులు వదలక జలాశయమాత్రమున శైవలముల ఉనికిని గుర్తించి వర్ణించిరి. కవులు వదలనప్పుడు జనులు వదలరు.

## 4. పర్వతములలో స్వర్ణరత్నాదికములున్నట్లు వర్ణించుట :

పర్వతము లన్నింటియందు స్వర్ణరత్నములుండవు. ఏవో కొన్నిటి యందే ఉండును. అయినను పర్వతమునందు ఉన్నట్లు ఊహించి వర్ణించుట కవి సంప్రదాయము. వివిధములైన రత్నములు, వివిధములైన ధాతువులు పర్వత వర్ణనమునందు ప్రధానస్థానమాక్రమించినవి. సంస్కృతమునందే కాక సకల భారతీయ సాహిత్యము లందును ఈ కవిసమయమునకు దీనికి అనేక

లక్ష్యము లున్నవి. జీమూత భర్త అను పర్వతము స్వర్ణమయమగుటచేత సకల దిశలయందును కీర్తి వహించి యున్నదని రాజశేఖరుడు **ఉదాహరించెను.**[1]

భూగర్భశాస్త్రము ననుసరించి స్వర్ణము ఒక ధాతువు. ధాతువులు భూగర్భమునందును కొండలయందును నిక్షిప్తములై ఉన్న సంగతి అందరికిని తెలిసినదే. నదులలోయలలో ఉన్న ఇసుకలో కూడ బంగారపు పొడి (**Alluvial Gold**) లభించును.

బంగారము కొండలలో భూగర్భములో ఇతర ధాతువులతో కూడి కాని లేక విడిగా కాని లభించును. ప్రాచీనులు బంగారమును సంపాదించినది ఈ రెండు ప్రదేశములోనే ఇప్పుడు గనులు త్రవ్వి వెలికి తీయవలసి యుండును. కనుకనే ప్రాచీనులకు కొండలలో బంగారము లభించునను విశ్వాసము ఉండ వచ్చును. ఈ విశ్వాసమునకు ఆధారము పురాణములలో ఉన్నది. భారతమున ఉత్తరదిశాభివర్ణన సందర్భమున హిమాలయము 'కనకాకరము'గా పేర్కొన బడినది.[2] ఇక మేరుపర్వతమునకు 'హిమాద్రి' అను నామాంతరమే ఉన్నది. మహాభారతమున మేరు పర్వత ప్రశస్తి ఇట్లున్నది.

"జ్వలన్త మచలం మేరుం తేజోరాశి మనుత్తమమ్
ఆక్షిపన్తమ్ ప్రభాంభానోః స్వశృంగైః కాంచనోజ్జ్వలైః
కనకాభరణం చిత్రం దేవగంధర్వ సేవితమ్
అప్రమేయ మనాధృష్య మధర్మ బహులైః జనైః"
—మహాభారతమ్ 1-7-5, 6.

హిమాద్రి హేమాద్రులు కులపర్వతములు. భారతీయుల దైనందిన ధార్మిక జీవితమునందు ఈ పర్వతములకున్న ప్రాముఖ్యము అనన్య సామాన్యము. యజ్ఞహవిర్భాగములకు అర్హతను సంపాదించుకొన్నవి. నదులలో గంగా

1. నాగా వాసశ్చిత్ర పోతాభిరామః
స్వర్ణస్థితి వ్యాప్త దిక్చక్ర వాలః
సామాత్స్యఖ్యం జగ్మి వానంబురాశే
రేషఖ్యాత స్తైన జీమూతభర్తా —కావ్యమీమాంస - చతుర్దశోధ్యాయము.

2. జీమూతస్యాత్ర విపర్షే రుపతస్థే మహాత్మనః
సాక్షాత్ హైమవతా పుణ్యవిమలః కనకాకరమ్ —మహాభారతమ్ 5-110-23. 24.

గౌతము లెంత మహిమాన్వితములో గిరులలో ఇవి అంతటివి. ఈ పర్వతముల యందును స్వర్ణము అతిమాత్రముగా ఉన్నదని పురాణ ప్రసిద్ధి. వీనిలో ఉన్న స్వర్ణాది ధాతువులను పర్వత సామాన్యమునందును చేర్చకున్నచో వర్ణనము అసమగ్రమగునని కవులు ఊహించి యుందురు. పసిడిలేని పర్వతము వారి దృష్టిలో గౌరవభాజనము కాదు. స్వర్ణము అనర్ఘమైన ధాతువు. పరమ పవిత్రము. మంగళమయము. ఆరోగ్యప్రదాయిని. సంపదలకు అధిదేవతయైన లక్ష్మీదేవి హిరణ్యవర్ణ, హిరణ్మయి, స్వర్ణమాలికాభూషిత.[1] సృష్టికర్తయైన బ్రహ్మ హిరణ్యగర్భుడు, భారతీయులకు బంగారము ధనవిశేషమేకాదు, దైవ స్వరూపముకూడ.

సాహిత్యము నందును నిత్యజీవితము నందును బంగారమునకున్న ప్రాముఖ్యము ఇంతింతనరానిది. బంగారము మంచివన్నెకు, మంచిగుణమునకు, మంచి విలువకు విశేషణప్రాయము. ఏవో కొన్ని కొండలలో బంగారము లభించుట సత్యమే. ఈ సత్యమును ఆధారముగా చేసికొని తమకు గౌరవ పాత్రమైన ప్రీతిపాత్రమైన బంగారమును అన్ని కొండలలో లభించునట్లూహించి పర్వత గౌరవ సౌందర్యములను పెంచి తృప్తిపడుట ఆచారమై పోవుటవలన ఈ కవిసమయము పుట్టియుండవచ్చునని ఊహించుటకు అవకాశమున్నది. అన్ని కొండలలో బంగారము లభించునని చెప్పుట అసత్తును నిబంధించుటయే, కాని పురాణమతసంప్రదాయప్రభావమువలన ఇది సత్యమేయని విశ్వసించు భారతీయులను ప్రశ్నించుట సాహసమే యగును. ఈ కవిసమయము - అనగా కవులు చేసికొన్న ఏర్పాటు ప్రజలు చేసికొన్న ఏర్పాటుగా నిలిచిపోయినది. నిజమునకు లేకున్నను ఉన్నట్లు ప్రజలకే నమ్మకమున్నప్పుడు కవులకు ఉండక పోవునా! కవులు మాత్రము ప్రజలుకారా?

స్వర్ణాది ధాతువులవలెనే పర్వతము లన్నింటియందును రత్నములున్నట్లు వర్ణించుట కవిసమయ సిద్ధము. పురాణేతిహాసకావ్యములలో దీనికి అనేకోదాహృతులున్నవి. కాళిదాసు హిమాలయమును మితిలేని రతనములకు నిధాన

1. హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్ - చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం

శ్రీసూక్తమ్.

ముగా వర్ణించినాడు.[1] భారవి రత్నమయములైన హిమగిరిశిఖరములను వర్ణించినాడు.[2] ఇంద్రనీల పర్వతము నీలమణియుక్తమని వర్ణించినాడు.[3]

వజ్ర ప్రవాళగోమేధిక పుష్యరాగాది నవరత్నములకు ప్రజాజీవితమునందున్న ప్రాముఖ్యము జగద్విదితము. ఆర్థికముగా వీనికి ఎంత విలువ ఉన్నదో సాంప్రదాయికముగా జ్యోతిశ్శాస్త్ర విహితముగా వీనికి అంత విలువ ఉన్నది. పూజాభాజనములైన దేవతా విగ్రహములకు రత్నభూషలు లేనిదే అలంకారము సమగ్రము కాదు.

రత్నఖచితములైన ఆభరణములపట్ల సౌందర్యోపాసకులకున్న ప్రేమకు అంతులేదు. ఆయా వర్ణముల రత్నములకు ఆయా జన్మనక్షత్రములకును సంబంధమున్నది. ఆదిత్యాది నవగ్రహములదయను సంపాదింపగోరి ఆగ్రహముల మహిమాభియుక్తములైన రత్నములను ధరించుట సంప్రదాయము. మణులలో కొన్ని విషాపహారకములు. కొన్ని మణికిరణముల స్పర్శచే ఆహారమున విషమున్న సంగతి తెలియవచ్చును. వజ్రాదిమణులు మిక్కిలి కఠోరమైనవి. ఛేదించుట మిక్కిలి కష్టము. సులభముగా అరుగవు కనుక గడియారముల నిర్మాణమునందును మరికొన్ని సున్నితములైన యంత్రనిర్మాణములయందును మణులకున్న ప్రాముఖ్యము అనల్పము. ఇంత పవిత్రములైన, ఇంత సుందరములైన, ఇంత అనర్ఘములైన మణులు ఏవో కొన్ని కొండలలో మాత్రము లభించును. సామాన్య పర్వతములలో లభించుననుకొనుట కేవలము ఊహ. రత్నములుగల కొండలు విలువైనవి. గౌరవాస్పదములైనవి. కనుక పర్వతముల మహిమాతిశయమును వర్ణింపవలసి వచ్చినపుడు వానికి ఎనలేని

---

1. "అనంతరత్న ప్రభవస్యయస్య హిమం నసౌభాగ్య విలోపి జాతమ్.
ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతీం దోఃకిరణేష్వివాంకః"
—కుమార సంభవము. 1—3.

2. నవవినిద్రజపాకు సుమతిష్వాం ద్యుతిమతా నికరేణ మహాశ్మనామ్
విహితసాంధ్య మయూఖమివ క్వనాన్నిచిత కాంచన భిత్తిషు సానుషు—

3. నీలాశ్మరశ్మి పటలాని మహేభయుక్త
సూత్కార సీకర విసృంజితటాంతరేషు
ఆలోక్య......సరళీకృత కంఠనాలాః
సానందమంబుదధియాఽత్ర మయూరనార్యః —కిరాతార్జునీయమ్.

ప్రాధాన్యమును సమకూర్చి పెట్టవలసి వచ్చినపుడు కవులు అనూచానముగా వానిని రత్నమయములుగానే వర్ణించుటలోని ఔచిత్యమును పాటించుచు వచ్చిరి. పూర్వము పృథుచక్రవర్తి ఉపదేశమున హిమాలయమును వత్సముగా, మేరువును దోగ్ధగచేసి భూమి (గోరూపము) నుండి భాస్వద్రత్నములను మహౌషధులను పర్వతములు పితికికొని పోయినవను పురాణగాథను కాళిదాసు 'కుమార సంభవము' నందు ఉట్టంకించి యుండెను.[1]

భారతీయుల విశ్వాసములకు, ఊహాలకు పురాణ గాథలు అతి మాత్ర ముగా ఆధారములగుచున్నవి. ఎన్నియో లోకోక్తులకు మరెన్నియో పలుకు బళ్లకు పురాణేతిహాసములు ఊతగా ఉన్నవి. పర్వతము లన్నియు హిమాలయ కారణముగా రతనాలను సంపాదించెనను పురాణ గాథకు ఈ కవి సమయము చేరువగా ఉన్నది. వజ్రాదులు విలువ గలవే అయినను, అవి శిలా విశేషములే. శిలా విశేషములు శైలాంతర్గతములని ఊహించుటలో సాహసము లేదు. కొండలలోని శిలలు పలువన్నెలవి. సూర్య కిరణముల స్పర్శచేత తళతళ లాడుచు, వెన్నెలలో మిలమిలలాడుచు ఎన్నియో శిలలు కన్నుల పండువు సేయుచుండును. స్థూలదృష్టికి ఇవి భాస్వంతములైన మాణిక్యములుగనే కనిపించును. ఈ ప్రకాశగుణమే ఆ రాళ్లు మణులను ఆభాసకు కారణము. ఈ ఆభాస కవిత్వావిర్భావమునకు మూలభూతమైన తత్త్వము. మానవుని సౌంద ర్యాభిలాషకు నిదర్శనము. కొండలన్నింటిలో మణులున్నవను మాట అబద్ధమే కావచ్చును. శాస్త్రమునకు భిన్నమైనది కావచ్చును. కాని శాస్త్రీయమైన సూక్ష్మ పరిశీలనము వలన మనకు తెలియునది జ్ఞానము లేక సత్యము. కవిత్వము ప్రాయికముగా ఆనందానుభూతికి నామాంతరము. శాస్త్రము వస్తు ధర్మమును తెలుపును. మనోధర్మము శాస్త్రబద్ధముగా నుండదు. ఆనందమనునది మనో ధర్మముకాని వస్తుధర్మము కాదు.

శాస్త్ర పరిశోధనల పర్యవసానముగా చంద్ర మండలము శుష్కమైన దనియును విషమమైనదనియును రసవిహీనమైనదనియును చక్రాళ్లకు మనికి పట్టనియును స్వయముగా కాంతిమంతము కాదనియును తేలినది. అయినను

1. యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌస్థితే దోగ్ధరిదోహదక్షే
భాస్వన్తిరత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రమ్
—కుమార సంభవమ్ 1-2.

మనకు చంద్రబింబము ప్రియురాలి ముఖమువలె వర్ణితమై ఆస్వాదనీయమగు చున్నది. నిజమునకు మానవ శరీరము కూడ ఎముకల గూడు. ఈ అస్థిపంజరము సకల భోగములకు యోగ్యముగా అత్యంతాకర్షణీయమైన శరీరముగా కనిపించుచున్నది. విజ్ఞాన పరిశోధనలవలన తేలిన ఈ యాథార్థ్యములు చంద్రబింబముపట్ల శరీరముపట్ల మనకేపాటి వైముఖ్యమును కలుగజేసినవి ? కనుక యథార్థ తత్త్వము వేరు. యథార్థానుభూతి వేరు. ఈ రెంటికి ఉన్న సూక్ష్మ భేదమే కవితానుభూతి.

## 5. ప్రతి పర్వతము నందును గజములు లేకున్నను ఉన్నట్లు వర్ణించుట :

వన్య మృగములలో గజమునకు విశేష ప్రాముఖ్యమున్నది. ప్రాచీనుల చతురంగ బలములలో రాజలాంఛనములలో ఒకటిగా ప్రసిద్ధిని పొందినది. బల దర్పములకును, ఔన్నత్యమునకు. గాంభీర్యమునకును గజము ఉపమా ద్రవ్యము: గజదంత నిర్మితములైన అలంక్రియలనేకములు; అనర్ఘములు. యువతుల నడకలను ఏనుగు నడకలలో పోల్చుట సర్వకవిసామాన్యము. భారతీయుల జాతీయ జీవనమునకు సంబంధించిన ఎన్నియో లోకోక్తులకు సద బంధములకు ఏనుగుల ఆకారములు అలవాట్లు తావలములై ఉన్నవి. ఏనుగు శ్రేష్ఠ వాచకములలో ఒకటి. శివుడు గజచర్మాంబరధారి. విఘ్నేశ్వరుడు గజ ముఖుడు. ఇంద్రుని వాహనము ఐరావతము. ఎనిమిది దిక్కుల యందును ఎనిమిది ఏనుగులున్నవనియును, అవి భూభారమును వహించుచు అష్టదిగ్గజ ములుగా పేరొందినవనియును పురాణ విశ్వాసము. దేవాయతనములలోని వాహనములలో గజ వాహన మొకటి. ఏనుగు సంపదకును సౌభాగ్యము నకును మంగళభావమునకును ప్రతీక. కనుక ఏనుగును చంపకూడదని నిన్నటి మొన్నటి రాజ శాసనము. ధర్మ సూత్రము. వేదకాలము నుండి ఆధునిక కాలము వరకు ఏనుగు మానవులకు చిరపరచితమైన మృగరాజము. పురాణ కావ్య కథా నాటకాది సాహిత్యములందు ఏనుగుల ప్రసక్తి బహువిధములుగా ఉన్నది.

పర్వత సామాన్యమునందు గజముల ఉనికిని వర్ణించుట కవి సమయము.

మహోన్నతాకృతిగల ఏనుగు శాకాహార జంతువు. ఐనను చిన్న చిన్న అడవులలో అది లభ్యముకాదు. సాంద్రారణ్యములు, పచ్చపచ్చని పర్వత

ప్రదేశములు ఏనుగులకు మనికిపట్టులు. ఆఫ్రికా ఖండము నందును శ్రీలంక లోను బర్మా అస్సాం అడవులలోను మైసూరు కేరళ అరణ్యములలోను ఏనుగు లున్నవి.

అన్ని కొండలలోను ఏనుగులున్నవని కవులూహించుటలోని ఔచిత్య మును విచారింతము.

కొండ ప్రదేశము లన్నను నిర్జనారణ్యములన్నను సామాన్యముగా ఒకే తాత్పర్యము. కనుక అవి దట్టమైన అరణ్యములలో ఉన్నను కొండలలో ఉన్నను కొండలలోనే ఉన్నవనుకొనుటలో తప్పులేదు.

అనేక కావ్యములలో ఏనుగుల వప్రక్రీడలను కవులు తనివితీర వర్ణించి నారు.[1] ఏనుగులను కొండలతో ఉపమించుట సర్వ సామాన్య విషయము ఏనుగులు మదించి భూమిని గాని నదీకూలమును గాని కొండనెత్తమునుగాని చెట్టుకాండమునుగాని దంతములతోడను కుంభములతోడను ఢీకొని గోకికొనుచు దురదను తీర్చుకొనెడి క్రీడను వప్రక్రీడ యందురు.

ఏనుగునకు ఇభమనియును గజమనియును నామాంతరములు. ఇభమనగా- ఏతమదమితి ఇభః - మదమును పొందునది. ఇక గజమనగా - గజతి మాద్యతీత గజః గజమదౌ - మదించునది. మత్తేభమునకు గల 'మదోత్కట', 'మదకల' శబ్దములు ఈ యర్థమునే ప్రతిపాదించుచున్నవి. అతిబలశాలియైన ఏనుగు మదోన్మత్తమైనప్పుడు, అది ఢీకొనుటకు తగిన కొండనెత్తములు మహా వృక్షములు ఉండవలెను. చిన్న చిన్న అడవులలో వట్టి మెట్ట ప్రాంతములలో ఏనుగులుండుట అసంభవము. అంతేగాక ఏనుగునకు నాగమను పేరుకూడ ఉన్నది. నాగమనగా - నగే గిరౌ భవో నాగః - పర్వతమునందు పుట్టినది. నాగశబ్ద వ్యుత్పత్తి వలన కలగిన పరిజ్ఞానము కొండలలో ఏనుగులుండునను ఊహాకు బలము చేకూర్చి యుండును. ప్రాయికముగా ఏనుగుల శరీరవర్ణము నల్లనిది. కొండలుకూడ నల్లనివే. కొండలెత్తైనవి. ఏనుగులుకూడ ఎత్తైనవి. జంతువులలోకెల్ల శ్రేష్ఠమన బరగిన ఏనుగులు పర్వతగౌరవము నతిశయింపజేసి పర్వతమునకు ఒక నిండు దనమును చేకూర్చును. పర్వత సౌందర్య గాంభీర్యము

---

1. వప్రక్రీడా వృక్షవత స్తపేషు - రఘువంశము 5-44.
వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ - మేఘదూతము.

లను ఇనుమడింపజేయును. పర్వతములందు ఏనుగులు లేకపోవుట కవులకు ఒక లోపముగా కనిపించినది. కనుక ప్రతిపర్వతమునందును గజములు లేకున్నను ఉన్నట్లు వర్ణించుట సంప్రదాయమైనది.

శాస్త్రసమ్మతము కాకపోయినను లోకసామాన్యము కాకపోయినను కొండలలో ఏనుగులున్నట్లు వర్ణించుట ఆచారమైనది. కవిసమయమైనది. ఒక్క పర్వత సౌందర్యమునేకాదు సృష్టిలోని ప్రతివస్తువును నిండుగా, రమణీయతా బంధురముగా ఊహించుటలోనే కవితాపారమ్యమున్నది. కవితా లక్ష్యమున్నది. కవితా జీవితమున్నది.

## 6. తమస్సును ముష్టిగ్రాహ్యముగను, సూచీభేద్యముగను వర్ణించుట :

'అంధతమస్సు', 'అవతమస్సు', 'సంతమస్సు' అను మూడు పదములు చీకటికి పర్యాయవాచకములే అయినను, అంధతమస్సు అనగా గాఢాంధకారము, అవతమస్సు అనగా క్షీణాంధకారము, సంతమస్సు అనగా సర్వత్ర వ్యాపించిన అంధకారమును ప్రత్యేకార్థములను సూచించుచున్నవి. అంధకారమును వర్ణించు సందర్భములలో దాని కాఠిన్యమును ఘనత్వమును ఊహించుట కవి సంప్రదాయము.[1] ఘనరూపముననున్న పదార్థము కఠినముగా, సాంద్రముగా, దళసరిగా, దట్టముగా ఉండును. దానిని పిడికిట పట్టవచ్చును. చీకటి దానిఅవతలనున్న పదార్థమును కనిపింపనివ్వదు. చీకటికి ఈ ఘనత్వమును ఆరోపించుటవలన అది ముష్టిగ్రాహ్యమగుచున్నది. అది కఠినముగా ఉండునట్లు ఊహించుటవలన సూచీభేద్యమగుచున్నది. చీకటియందు కాఠిన్యమును ఆరోపించుట అనగా అది సాంద్రముగా గాఢముగా ఉన్నదని చెప్పుటయే, అంధకారకాఠిన్యమును లేక అంధకారఘనత్వమును వ్యంజించుటకు దానిని ముష్టిగ్రాహ్యమని సూచీభేద్యమని భావించి వర్ణించుటకు అవకాశమేర్పడి యుండవచ్చును.

తమస్సు ముష్టిగ్రాహ్యమనుటకు - రాజశేఖరుడు తన విద్ధసాలభంజికా నాటికలో—

---

1. "అంధకారేఽతి కాఠిన్యం విశ్వలోప సమర్థతా
   ఆకస్మిక సమారంభో నిశ్శంక మభిసారికాః" - అలంకార శేఖరము 16.

"తనులగాన్నె ఇవకకుభః భూవలయం చరణచార మాత్రమిస
దివమవ చాలగర్ష్మనీం ముష్టిగ్రాహ్యా తమః కురుతే"

అను శ్లోకమును ఉదాహృతిగా చూపినాడు. తమస్సు సూచీ భేద్య మనుటకు—

"గచ్ఛంతీనాం రమణవసతీం యోషితాం తత్రనక్తం
రుద్ధాలోకే నరపతి పథే సూచిభేద్యైస్తమోభిః"

అను శ్లోకమును కాళిదాసు మేఘదూతమునుండి ఉదాహరణముగా చూపవచ్చును

నిత్యజీవితములో "కన్ను పొడుచుకొన్నను కనిపింపదు" అను పదబంధము వ్యాప్తిలో ఉన్నది. ఇచట పొడుచుకొనుట అనగా ద్రష్ట తన కన్నులను తాను పొడుచుకొనుట కాదు. కనులనుండి వెలువడు కిరణములు చీకట్లను పొడుచుకొని పోవుట అని భావము. అనగా సూక్ష్మముగా పరిశీలించుట - సూచివలె చొచ్చుకొని పోవుట అనియు తాత్పర్యము. ఈ పదబంధమునకును కవిసమయమైన సూచీభేద్యత్వమునకును సామీప్యమో సామ్యమో ఉండి తీరవలయును.

ముష్టిగ్రాహ్యమనునది మఱియొక పదబంధము. ముష్టిగ్రాహ్యమనగా సులభముగా అందుబాటులో ఉన్నదని భావము. వెలుగులవలె ఇరులుకూడ సర్వవ్యాప్తములైనట్టివి. వానిని పట్టుకొనుటకుగాని పొందుటకుగాని విశేష ప్రయత్నము చేయవలసిన పనిలేదు. కనుకనే చీకటి ముష్టిగ్రాహ్యమని కవి సమయమేర్పడి యుండును. ఎంత వెలుతురున్నను కన్ను మూసినచో చీకటియే కదా! పిడికిలి బిగించినప్పుడు అరచేతిలో మిగులునది చీకటిగాని వెలుగు కాదుకదా!

## 7. వెన్నెలను అంజలి గ్రాహ్యముగను కుంభోపవాహ్యముగను వర్ణించుట :

చంద్రుడు అమృతాంశుడు. ఓషధీశుడు. సుధాంశు ప్రభావమున ఓషధులు అమృతగుణోపేతములగుచున్నవి. చంద్రుడు హిమాంశుడు కనుకనే అతని కిరణములు చల్లనివి. వెన్నెల ఘనపదార్థముకాదు. ద్రవము అంత

కంటెను కాదు. వాయువుకాదు. కేవలము ప్రకాశవిశేషము. కాని వెన్నెలను ద్రవరూపనుగా పానయోగ్యముగా దోసిళ్లలో ఎత్తుకొనుటకును కుండలలో నింపుకొనుటకును వీలైనదిగా కవులు పరంపరాయాతముగా వర్ణించుచున్నారు. లోకములో వెన్నెల అంజలి గ్రాహ్యముగా కుంభోపవాహ్యముగా ఉండుట లేదు. శాస్త్రముకూడ దీనిని సమ్మతింపదు. కాని కవులు చేసికొన్న సమయముగా ఇది నిలిచిపోయినది. చంద్రికాపానము, చంద్రికాస్నానము, జ్యోత్స్నావర్షము, జ్యోత్స్నాప్రవాహము వంటి పదబంధములెన్నియో సాహిత్యమునందు ప్రయుక్తములగుచున్నవి. వెన్నెలను ద్రవపదార్థముగా ఊహించుటవలన ఏర్పడిన పరిస్థితి ఇది.

చంద్రశబ్దమునకున్న పర్యాయవాచకములో 'ఇందు' 'విధు' శబ్దములు వెన్నెల ద్రవమను ఊహకు ఆధారములని చెప్పవచ్చును. ఇందుః - ఉందీ క్లేదనే- మంచుకిరణములచేత తడిపెడువాడు. విధుః - దేవా ఏనం విశేషణ దయంతి పిబంతతి విధుః ధేట్ పానే. దేవతలు ఇతనిని మిక్కిలి పానము చేయుదురు. మంచుకిరణములచే తడుపుటచేత చంద్రుడు చల్లనివాడనియును అతని కాంతిలో ద్రవపదార్థమున్నదనియును ఊహ కలిగినది. హిమాంశువు అన్నప్పుడు మంచుకిరణములు కలవాడని అర్థము. మంచు జలమునకు ఘనరూపమేగాని మరియొకటిగాదు. కనుకనే వెన్నెలసోనలుగా జాలువారినది. అమృతమును దేవతలు పానము చేయుచుందురను పౌరాణిక విశ్వాసమొకటి ఉన్నది. ద్రవ పదార్థమైనప్పుడుకదా పానముచేయుట. పానయోగ్యమైన ఏ పదార్థమునుగాని దోసిళ్లకెత్త వచ్చును. పాత్రలలో నింపవచ్చును. ఈ అవకాశమే వెన్నెలకును కల్పించి కవిలోకము దానిని మిక్కిలి ఆస్వాదనీయముగా చేసినది. చకోరపక్షులు వెన్నెలను పానము చేయునను కవిసమయమొకటి ఉన్నది. వెన్నెల ద్రవపదార్థమని ఊహించుటకు ఇదికూడ ఒక ఆధారము కావచ్చును.

రాజశేఖరుడు విద్ధసాలభంజికా నాటికలో—'పింజన కేతకీరస ప్రవాహ శోభతో ప్రకాశించుచు ముత్యాలసరములు కూర్చుటకు అనువుగా ఉన్న చంద్రికలు నేడు కుండలలో నింపుటకును దోసిళ్లతో ఎత్తుకొనుటకును

మృణాళ నాళములతో పీల్చి త్రాగుటకును అనుకూలముగా ఉన్నదని'[1] వర్ణించెను.

అమృతమునకు 'నీరు' అనికూడ అర్థము. కనుక నీటికున్న గుణములన్నిటిని అమృతమునకును అమృతాంశుని అంశమైన వెన్నెలకును ఆరోపించి చంద్రికావర్ణనమును హ్లాదైకమయమొనర్చినారు కవిచంద్రులు. కావ్య ప్రపంచమునందు జ్యోత్స్నాభివర్ణనమును రసప్లావిత మొనర్చినది ఈ కవి సమయమే.

## 8. చక్రవాక మిథునములు రాత్రివేళలలో భిన్నతటాశ్రయములై వియోగము ననుభవించు చున్నట్లు వర్ణించుట :

భారతీయ సాహిత్యములో చక్రవాక పక్షులు ప్రణయమునకు ప్రతీకలుగా ప్రసిద్ధములు. రాత్రివేళలో ఇవి కరుణా విలములైన ధ్వనులు చేయుచు కనుపట్టును. ఈ ధ్వనులు ఎడబాటువలన కలగిన ధ్వనులని కవులు ఊహించినారు. రాత్రికాలములో చక్రవాక మిథునము భిన్నతటములందు వియోగబాధ ననుభవించుననుట కవిసమయము.

నిజమునకు ఈ చక్రవాక పక్షులు రాత్రికాలమునందు ఆహార సంపాదనము కొరకు దూర దూర ప్రదేశములకు పోవును. ఈ సందర్భమున చక్రవాకముల జంటలో ఒక దానిని విడిచి మమరొకటి దూరముగా పోయినచో - ముఖ్యముగా ఆడుపక్షి నుండి మగపక్షి దూరముగా పోయినచో - సకరుణముగా ఆర్తనాదములు చేయును. ఈ వ్యాపారమునే విరహబాధగా వ్యంజించి చెప్పుట కవుల సంప్రదాయముగా నిలచిపోయినది.

సీతా విరహముచే రాముడు పరితపించుచున్నప్పుడు చక్రవాక పక్షులతనిని పరిహసించిన కారణమున శప్తములై ఇట్లు వియోగబాధను అనుభవించు

---

1. యంత్రద్రావిత కేతకోదర దల స్రోతః శ్రియం బిభ్రతే
యేయం మౌక్తిక దామగుంఫన విధేర్యోగచ్ఛవిః ప్రాగభూత్
ఉత్సేచ్యాకలశోభిరంజలి గ్లాహ్యా మృణాలాంకురైః
పాతవ్యాచ శశిన్యముగ్ధ విభవే సావర్తతే చంద్రికా

—రాజశేఖరుని 'విద్ధసాలభంజిక' 3-14.

చున్నవని బాణుడు కాదంబరిలో వ్రాసినాడు.[1] నైషధీయచరిత్రకర్త చక్రవాకముల వియోగము బ్రహ్మేచ్ఛానుసారమని వాక్రుచ్చినాడు.[2] పితృదేవతల అనుగ్రహామునకు పాత్రులుకానివారు చక్రవాకములై జన్మింతురని పెద్దల వలన వినియున్నాను.

నదీసరోవరాదిజలాశయముల భిన్నతటములయందు ఈ చక్రవాకముల వియోగబాధను అనుభవించుచున్నట్లు వర్ణించుట కేవలము కావ్యకల్పనము. విరహామును సూచించుటకు భిన్నతీరములును, ఆ తీరములను వేరు చేయు నదియును, సరస్సును కావ్యలోకమున సృష్టింపబడి యుండవచ్చును. కావ్యజగత్తులో అన్యోన్య ప్రణయమునకు చక్రవాక మిథునము ఆదర్శము. ఈ అన్యోన్యత్వము ఎంతవరకు పోయినదనగా ఒక్క చక్రవాకమును ఊహించుటయే అసంభవముగా పరిణమించినది. అందుకే చక్రవాకముల ఎడబాయని జంటను రమణుల స్తనయుగ్మముతో ఉపమించుట పరిపాటియైనది. పగళ్లు చక్రవాక మిథునముల సంయోగశృంగారమునకును, రాత్రులు వియోగశృంగారమునకును వ్యంగ్యార్థ ప్రతిపాదకములుగా కావ్యలోకమున నిలిచిపోయినవి.

చక్రవాక మిథునములు భిన్నతటములందు వియోగబాధ ననుభవించునను కవిసమయమునకు ఉదాహృతులనేకములున్నవి. పార్వతి తన మ్రోల నొండొంటిని ఎడబాసి పిలుచుకొనుచున్న జక్కవల జంటను చూచి జాలిగొనుచున్నట్లు కాళిదాసు కుమార సంభవమున వర్ణించినాడు.[3]

పశుపక్ష్యాదుల వ్యాపారములను మానవుల సుఖదుఃఖాద్యవస్థలకు ఆరోపించి భంగ్యంతరముగా వ్యంగ్యముగా అభివర్ణించుటకు కవులుచేసిన ప్రయత్నములే ఇట్టి కవిసమయములకు ఆధారభూతములైనవి. ఇందులో

---

1. "మూర్తిమద్రామ శాపగ్రస్తానీవ మధ్యచారిణా మాలోక్యంతే చక్రవాచ నామ్నాం పక్షినాం మిథునాని" — కాదంబరి - పుట 71.

2. "కాలోఽయం విధినా రథాంగమిథునం విచ్ఛేత్తు మన్విచ్ఛతా"—నైషధమ్ 21-143.

3. "నినాయేసాఽత్యంత హిమోత్కిరానిలాః
సహస్య రాత్రీ రుదవాస తత్పరా
పరస్పరాక్రందిని చక్రవాకయోః
పురో వియుక్తే మిథునే కృపావతీ"

కొంత సత్యముండకపోదు. కాని ఆ సత్యబీజమునుండి వెలసి శాఖోప శాఖలుగా విస్తరిల్లిన ఊహాభూరుహస్వరూపము కనిపించునంతగా ఆ బీజము నుండియే అంతటి మహావృక్షము ఉద్భవించినదని ఎవ్వరేని చెప్పినచో అది అద్భుతావహముగా తోచకపోవునా ?

## చకోరములు చంద్రికాపానము చేయునట్లు వర్ణించుట :

వెన్నెలను ద్రవపదార్థముగా ఊహించుట కవిసంప్రదాయమెట్లైనదో నేనింతకు పూర్వమే నిరూపించుటకు ప్రయత్నించితిని. ఇక పానయోగ్యమైన ఈ చంద్రికను చకోరపక్షులు పానము చేయునను కవిసమయమును గూర్చి పరిశీలింతును.

రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో ఈ కవిసమయమునకు ఉదాహరణముగా పేర్కొన్న శ్లోకములో చకోరాంగనలు తమ చుంచు పుటములను పైకెత్తుచు మెడలను సాగదీయుచు చంద్రికలను పానముచేసెనని ఉన్నది.[1]

చకోరములు వెన్నెలను త్రాగునను విషయము శాస్త్రసమ్మతము కానిది. సంధ్యాసమయమున చకోరము మహోత్సాహముతో కూయునని పక్షిశాస్త్రజ్ఞులందురు. వెన్నెల రాత్రులలో చకోర పక్షులు ఉన్ముక్తకూజితములు చేయుచు విహరించును. కనుకనే ఇది వెన్నెలపులుగైనది. అమరకోశమున చకోరమునకు—చకతి తృప్యతి జ్యోత్స్నయా చకోరకః చకతృప్తౌ— వెన్నెలను చూచి తృప్తిపొందునది అను అర్థమున్నది. ఈ వ్యుత్పత్త్యర్థము చకోర స్వభావమును తెలుపుచున్నది. "చంద్ర చకోర న్యాయము" ఏర్పడుటకు ఈ ఉపపత్తి కారణము కావచ్చును. వెన్నెలలో ఆనందోత్సాహములలో ఓలలాడు చకోరములనుచూచి, ఆకసమువైపు ఆ పక్షులు సారెసారెకు మెడలు సాచుట చూచి చంద్రికాపానము చేయుచున్నవని వ్యంగ్య గర్భితముగా ఉత్ప్రేక్షించి యుందురు.

---

1. ఏతాస్తామలయోపకంఠ సరితామేణాక్షి రోధో భువ
శ్చాపాభ్యాస నికేతనం భగవతః ప్రేయో మనోజన్మనః
యాసుశ్యామ నిశాసు పీత తమసో ముక్తామయా శ్చంద్రికాః
పీయంతే వివృతోర్ధ్వచంచు విచలత్కంఠం చకోరాంగనాః
—రాజశేఖరుడు - కావ్యమీమాంస - అధ్యాయము 14.

ఆకాశము నందున్న గ్రహ నక్షత్రములకును భూమికిని సన్నికర్షమైన సంబంధమున్నది. చంద్రోదయముతో సముద్రముప్పొంగును. కొన్ని లతా గుల్మాదులు నవనవలాడును. పుష్పించును. పరిమళించును. అదేవిధముగా చకోర పక్షులు వెన్నెలరేలలో ముఖరితములగుటకు విశేషముగా తృప్తి పొందుటకు ఏదో ఒక ప్రభావము ఉండి యుండవచ్చును. ఇంతవరకు జరిగిన శాస్త్ర పరిశోధన దీనిని నిరూపించక పోయినను మునుముందు ఏదేని యాథార్థ్యము వెలువడునో ఏమో. ఇప్పటికిది కవిసమయము మాత్రమే. కమనీయకల్పనము మాత్రమే. సృష్టిలో లేని అందమును సృజియించి కవిత్వ మును కల్పనాయత్తము చేయుట మాత్రమే !

## చాతకము మేఘజలమునే త్రాగునట్లు వర్ణించుట :

చాతకము పావురమును బోలిన ఒక పక్షి. దట్టమైన పచ్చ పచ్చని అరణ్యములు దీనికి నివాసములు. ఇది జనపదముల పరిసర ప్రాంతములలోను, మామిడి తోటలలోను అప్పుడప్పుడు కనిపించును. దీనిని 'వానకోయిల' అని కూడ అందురు. బంగాళము నుండి రాజస్థాన ప్రాంతమువరకు ఈ పక్షులు కనిపించును. పంజాబునందును ఇవి కనిపించును. చలికాలమున ఇవి దక్షిణము వైపు ప్రయాణముచేయును. ఈ పక్షులు గూళ్లు కట్టుకొనవు. ఇతర పక్షుల గూళ్లలోనే గుడ్లు పెట్టును.

చాతకపక్షి వసంతాగమముతో కోకిలవలెనే కూయుటకు మొదలిడినను వర్షారంభమున మాత్రము మిక్కిలి మనోహరముగా ఉచ్చైస్స్వరముతో కూయును. స్వాతివర్షమువరకు ఇట్లు ఉత్సాహముతో కూయుచునే యుండును. ఆ తరువాత మూగవోవును.

చాతకము మేఘోదకము భూపతితము కాకుండగనే త్రాగునని కవి సమయము. కేవలము మేఘోదకమునే త్రాగుననుట లౌకిక దృష్టికిని శాస్త్రీయ దృక్పథమునకును విపరీతముగా కనిపించును. అయినను ఈ కవిసమయమేర్పడు టకు కారణమును ఇట్లు ఊహింప వచ్చును.

చాతకమునకు 'సారంగము', 'స్తోకకము' అను మరి రెండు పేర్లున్నవని అమరకోశము చెప్పుచున్నది. చాతకమునకు—వర్షోదకమ్ చతతీతి చాతకః చతే—యాచనే—వర్షోదకమును యాచించునది. ఏడాది పొడుగున ఈ పక్షి

అరుదుగా కూయుచు వర్షారంభము కాగానే మిక్కిలి మధురముగా కూయుటను బట్టి మేఘజలమును అపేక్షించియే అట్లు కూయుచున్నదో ఏమో అను ఊహ కలిగియిట్లు చెప్పియుందురు. స్వాతినక్షత్ర (కార్తీకమాసము) మున వర్షము కురియువరకును చాతకముల మధురధ్వనులు వినిపించుచుండుటచేత స్వాతి వర్షాజలమును అపేక్షించియే కూయుచున్నట్లు ఊహించి యుందురు.

మన ప్రాచీనులు ప్రకృతికి మిక్కిలి సన్నిహితులు. పశుపక్ష్యాదులను గూర్చియు తరులతాదులను గూర్చియు వారు అనేకానుభవములను సంపాదించి యుండిరి. కాలక్రమమున ఆధునిక నాగరికతా ప్రభావమున మనము ప్రకృతికి కడుదూరమగుచున్నాము. స్వాతినక్షత్ర వర్షాజల ప్రభావము వినుటకు చిత్రముగా నుండును. స్వాతినక్షత్రమున కురిసిన వర్షాజలము మిక్కిలి శ్రేష్ఠ మందురు. స్వాతివర్షాజల కణము ఆలిచిప్ప (ముత్యపు చిప్ప శుక్తి) లో పడి మౌక్తికమగును. అరటిలో పడి కర్పూరమగును. వెదురుబొంగులో పడి వంశలోచన రూపముధరించును. సర్పముఖమునపడి విషమగును. శాస్త్ర సంగతము కాకపోయినను సాహిత్యమున ఈ విశ్వాసముల ప్రాచుర్యము అనన్య సామాన్యము, నిరాక్షేపణీయము. ఇట్టి విశిష్టమైన, విచిత్రమైన స్వాతివర్షా జలము కొరకు చాతకపక్షి ఎదురుచూచి వానిని గ్రోలి తిరిగి వర్షాకాలమువరకు ఎదురుమిన్నులు చూచుచు నీటిని త్రాగకనుండుననుట కేవలము దాని ధ్వనులను బట్టి యేయని చెప్పవచ్చును.

చాతకను మేఘజలమును పానముసేయునను కవిసమయమును యథా తథముగా గ్రహించుటచే కవితా సౌందర్యము భాసింపదు. చాతకము మేఘ జలమునే త్రాగునని చెప్పుట కవుల ఉద్దేశము కాదు. దానికిని మేఘమునకు గల ఏదో ఒక ఊహాతీత సంబంధమును, మహోదాత్తవస్తు నిరీక్షణమును ఆదర్శ ప్రణయమును వ్యంజించు ఉద్దేశమే కవుల లక్ష్యమని భావింపవలెను.

ఈ కవిసమయ ప్రభావము అతివిస్తృతమై న్యాయశాస్త్రమున ప్రవేశించి మేఘచాతకన్యాయమైనది. కావ్యజగత్తులో చాతక మేఘముల ప్రణయము అతి మాత్రముగా అభివర్ణితము. కాళిదాసు ఋతుసంహారమున మేఘములను యాచించు తృషిత చాతకములను వర్ణించినాడు.[1]

1. తృషాకులైశ్చాతక పక్షిణాంకులైః ప్రయాచితాస్తోయ భరావలంబినః
ప్రయాన్తిమందం బహుధార వర్షిణో బలాహకాః శ్రోత్రమనోహరస్వనాః

## ఆకాశగంగలో దిగ్గజములు స్నానమాడునట్లు వర్ణించుట :

ఐరావత, అంజన, సుప్రతీక పుష్పదంతాద్యష్ట దిగ్గజములు ఎనిమిది దిక్కులందుండి భూవలయమును మోయుచున్నవని పౌరాణిక విశ్వాసము. ఈ కవిసమయము ప్రాయికముగా పురాణేతిహాసములనుండి గ్రహింపబడిన ఇతి వృత్తములలో విశేషముగా ప్రయుక్తమైనట్టిది. ఈ దిగ్గజములు సామాన్యము లైన ఏనుగులు కాక దేవతాత్వము కలిగియున్నట్టివని పురాణములు ఉద్ఘోషించు చున్నవి. వీనిలో ఐరావతమనునది ప్రాచీదిశాధిపతియైన ఇంద్రునకు వాహనము. క్షీరసాగరమథనము జరిగినప్పుడు ఉచ్చైశ్శ్రవముతో పాటు ఇదియును ఉద్భ వించెను. దేవతాత్వము కలిగి దేవలోకమునకు సంబంధించినదియైన ఐరావతము దివిజగంగలో స్నానమాడుట సహజము. మిగిలిన దిగ్గజములు ఐరావతము వంటివే కనుక అవియును ఆకాశగంగలో స్నానమాడుట సాధారణము, గంగ త్రిభువన పావని, స్వర్గమర్త్య పాతాళములందిది ప్రవహించుట పురాణ ప్రసిద్ధము. గంగ స్వర్లోకమున ప్రవహించునపుడు ఆ లోకవాసులందరును అందు స్నానమాడునట్లు ఊహించుటలో అనౌచిత్యములేదు. అదియునుగాక దేవలోకమున ఉన్నది గంగ ఒక్కటియే, స్వర్ణపద్మములు రాజహంసలు సప్తర్షులు కిన్నరకింపురుషగంధర్వ విద్యాధరాది దేవగణములు ఏవైనను ఎవరైనను సలిలావగాహనము చేయవలెనన్నచో ఆకాశగంగ ఒక్కటేగదా శరణ్యము! అమరవాహిని భూలోకమున ప్రవహించినను దిగ్గజములు అందు స్నానమాడుట ఊహ్యామే, ఇదికేవలము పురాణసంబంధమైన కవిసమయము. కాళిదాసు కుమారసంభవమున—

"మందాకిన్యాః పయఃశేషం దిగ్వారణమదావిలమ్
హేమాంభోరుహ సస్యానాం తద్వాప్యోర్ధామ సాంప్రతమ్" (2-44).

(ఇప్పుడు ఆకాశగంగలో దిగ్గజముల దానధారలచే మురికియైన నీరు మాత్రమే మిగిలియున్నది. బంగారు తామరలను తారకుడు కొనిపోయి తన దిగుడు బావులలో నాటుకొన్నాడు.

## యశోహాస పుణ్యములు ధవళములని వర్ణించుట :

యశస్సు, హాసము, పుణ్యము మూర్తములు కావు. అనగా లోకములో వానికి ఒక నిర్ణీతమైన రూపములేదు. కాని కవులు వీనికి ఒక వర్ణమును

సృజియించి, ఆ వర్ణముతో ఉన్న మనోహర పదార్థములను తీసికొని, వానితో పోల్చి కన్నులకు కట్టినట్లు చేసినారు. ఈ కల్పనము అనూచానముగా పరంపరా యాతముగా జరుగుచు వచ్చుచుండుటచేత వానికి ఒక రూపమేర్పడినది. నిజమునకు ఈ రూపము కల్పన మాత్రమే అయినను ఆ పదార్థములను తెలిసి కొనుటకు ఇది స్వతస్సిద్ధమైన సాధనముగా స్థిరపడి పోయినది. సాహిత్య జగత్తులో, భాషానిర్మాణములో కవిసమయములు ఈ విధముగా ప్రధానపాత్ర నిర్వహించుచున్నవి.

అమూర్తములైన పదార్థములను మూర్తములుగా చేయుటలోనే కవితా సృష్టికి బీజమేర్పడుచున్నది. కవులు మాటలతో బొమ్మలు సృజించినట్లే చిత్ర కారులు బొమ్మలతో మాటలను సృజింతురు. నిజమునకు కళాప్రపంచము ప్రతీకాత్మకము. ఆయా ప్రతీకల పరిజ్ఞానము ఎవరికి స్పష్టముగా నుండునో వారే కళానుభవమునకు అర్హులౌదురు. ఈ ప్రతీకలు ఒక్కొక్కసారి పదముల వ్యుత్పత్త్యర్థమును బట్టియు ఆ అర్థములు సృజించు మనో వ్యాపారమును బట్టియు వానివలన ఏర్పడిన సంప్రదాయములను బట్టియు అవగతములగు చుండును. మనస్సునకును కనులకును అన్ని రూపములందవు. ఆనందముకాని విషాదమునుకాని కలిగించు అనేకాంశములకు రూపములు లేవు. సుఖమునకు ఏది రూపము? దుఃఖమునకు ఏది రూపము? కీర్తికి ఏది రూపము? అపకీర్తి కన్నులకు కనిపించునా? పుణ్యము చర్మ చక్షువులకు గోచరమగునా? పాప రూప మిట్టిదని చూడగలమా? వీనికి రూపకల్పము ఎట్లు చేయువలయును? శాస్త్రము కొంత సాయపడునేమోకాని అనుక్షణము పరివర్తన శీలమైన ఇదమిత్థమని చెప్పుటకు వీలులేనట్టిదైన మనోలక్షణమునకు శాస్త్రము రూపును కల్పింపలేదు. శాస్త్రము నియతిని ఏర్పరచునది కదా! ఈ సందర్భమున కవులు తమ తలపులకు ఉడుపులు తొడిగి, రంగులువూసి, సహృదయుల మనస్సులకు హత్తుకొనునట్లు చేయుటకు అమూర్తములైన పదార్థములకు రూప కల్పనము చేయుదురు. బొమ్మ కట్టింతురు. వినుకలి కంటెను కనుకలి వలన ఏర్పడు స్ఫురణము మిక్కిలి ప్రభావోపేతమై శాశ్వతమై ఆనందానుభూతికి కారణమగును.

ఇక యశోహాస పుణ్యములకు ధావళ్యము నారోపించుటలోని ఔచిత్యము పరిశీలింపవలసి యున్నది. లోకములో ఒక వ్యక్తికిగాని ఒక సంఘమునకు గాని

యశస్సు లభించుటకు పొగడదగిన గుణ విశేషములుండవలయును. పొగడుట ఎప్పుడు సంభవించును ? నిష్కళంక ప్రవృత్తి భాసించినప్పుడు ఆచార వ్యవహారములు పరిశుద్ధములైనప్పుడు, నిష్కళంకత అనగా కలంకము లేకుండుట - మాలిన్యము లేకుండుట - స్వచ్ఛముగా నుండుట. స్వచ్ఛమనగా శుభ్రము - తెల్లని అని అర్థము. శ్వేత - సిత - గౌర - పాండుర శబ్దములు ధవళ శబ్దమునకు పర్యాయ వాచకములు. శ్వేతమనగా - శ్యాయతి గచ్ఛతి జనమనాంసీతి శ్వేతః శ్యైఙ్ గతౌ జనుల మనస్సును పొందునది. సిత మనగా - సినోతి మన ఇతి సితః షిఞ్ బంధనే మనస్సును బంధించునది. గౌర మనగా - గూయతే కర్త్యతే గౌరః గుశబ్దే కీర్తన చేయబడునది. గురుతే మనోఽస్మిన్నితి గౌరః - గురీ - ఉద్యమనే - మనస్సు దీనియందు ఉద్యమించును. పాండరమనగా పండతే యాతి మనోఽస్మిన్నితి పాండరః పడిగతౌ, దీనియందు మనస్సు పొందును. పుణ్యతే స్తూయ తఇతివా పాండరః పణవ్యవహారేస్తుతౌచ, స్తోత్రము చేయబడునది. ఈ వ్యుత్పత్త్యర్థములనుబట్టి చూచినచో జనుల మనస్సులో ప్రవేశించునదియును, కీర్తన చేయబడునదియును, మనస్సును ఉద్యమింపజేయునదియును అగు ధవళ వర్ణము యశస్సునకు ఆరోపించుటలో ఔచిత్యమున్నది. యశస్సునకు పర్యాయపదము కీర్తి. కీర్తి యనగా కీర్త్యత ఇతి కీర్తిః కీర్తింపబడునది. యశస్సు వలెనే ధావళ్యము కూడ కీర్తింపబడునదియే. కనుక వస్తువులను వాని సదృశ వస్తువులతో పోల్చుటలో సామంజస్య మున్నది.

ఇక హాసము, దరహాసమైనను వికటాట్టహాసమైనను ధవళముగనే వర్ణింపవలెనను పరిపాటి కవులది. మనము నవ్వినప్పుడు ఎదుటి వారికి కనుపించునది దంతకాంతి. దంతములను కుందమల్లికా కుట్మలములతోడను మౌక్తికములతోడను దంతకాంతులను చంద్రకళలతోడను విద్యుత్కాంతులతోడను తారకాకాంతులతోడను ఉపమించుటను బట్టిచూడగా దంతముల తెల్లదనమే హాసములకారోపించినట్లు ఊహింప వచ్చును. ఈ ఉపమానములన్నియును తెల్లనివే. తెల్లదనమునకున్న చిత్తాకర్షక గుణము హాసమునకు కూడ ఉన్నది. కనుక హాసమును శుభ్రముగా అవదాతముగా వర్ణించుట కవి సంప్రదాయమైనది. సాహిత్య శాస్త్రములకు ఆద్య గ్రంథమనదగిన భరతుని నాట్య శాస్త్రమున హాస్య రసమునకు సిత వర్ణమే నిర్దేశింపబడినది.[1] బీభత్స భయానకరసములకు

1. భరతుని నాట్యశాస్త్రము - అనువాదము డా. పి. ఎస్. ఆర్. అప్పారావు పుట 201.

నాట్య శాస్త్రమున నీలకృష్ణ వర్ణములు సూచితములు. చీకటెప్పుడును భయావహమే. భయము ఆనందమునకు విరోధి. కనుక సంతోష సూచకమైన హాసమునకు సితత్వమును సూచించిరి. భయాది మానసికావస్థల నిరూపణమునకు ఈ నీల శ్వేత వర్ణములు ప్రతీకలు. భయమును గొల్పు రాక్షసులను నల్లనివారుగా వర్ణించుట పురాణ ప్రసిద్ధమే కదా!

పుణ్యమును కూడ ధవళముగనే వర్ణించుట పరిపాటి. మోనియర్ విలియమ్స్ పుణ్య శబ్దమునకు అర్థమును వివరించుచు - **Fair, Pleasant, pure, holy**[1] అను పర్యాయ వాచకములను చూపెను. శుభము, మనోజ్ఞము, స్వచ్ఛము, పవిత్రము అను అర్థములు పుణ్యమునకు ధవళ వర్ణమే సమంజసమను భావమును కలిగించుచున్నవి. అదే సందర్భమున 'పుణ్యతృణము' అను పదబంధమునకు కుశగ్రాసము పవిత్రమైన తెల్లని ఘాసము అని వివరించెను.[2]

కాంతి తెల్లనిది. వెన్నెలలు తెల్లనివి. యశోహాసపుణ్యములను తెల్లని కాంతులలో వర్ణించునపుడు వెన్నెలలనె ఉపమానములుగా తీసికొనుటలోనున్న మనోజ్ఞత సూర్యకాంతిని తీసికొనుటలో లేదు. సూర్యకాంతి ప్రచండమైనది. దుర్నిరీక్ష్యమైనది. దుస్సహమైనది. కనుక అది తెల్లనిదే అయినను ఇట ఉపమాద్రవ్యము కాలేకపోయినది.

చంద్రికలు తెల్లనివి. చల్లనివి. అహ్లాదకరములైనవి. సూర్యరశ్మి ఉపయోగకరమైనది. చంద్రకాంతి ఆనందదాయకమైనది. సౌందర్యానుభూతిని, సౌఖ్యానుభూతిని మూర్తిమంతము చేయవలసివచ్చినపుడు చంద్రకాంతినే ఆలంబనముగా చేసికొను సంప్రదాయ మేర్పడి యుండవచ్చును. తలవని తలంపుగా ఈ కవిసమయము కవితా వ్యాపారమునే భంగ్యంతరముగా ఉద్బోధించుచున్నది. మనస్సునకు ఆనందమును ప్రసాదించుటయే కవిత్వ పరమ లక్ష్యము కదా!

త్రిలోకములలోని యువతులు రాజు యశోధావళ్యమునకు ఆశ్చర్యచకితలైరను భావమును దెలుపు ఒక శ్లోకమును రాజశేఖరుడు ఉదాహరించినాడు.[1]

1. Sasnkrit - English Dictonary.

1. "స్త్రైమః స్తోకోఽపినాంగే శ్వసిత వికలం చక్షసాం నైవ వృత్తి
ర్మద్మే క్షీరాబ్ధి మగ్నాః స్ఫుట మధచ వయం కోఽయమీదృక్ప్రకారః
ఇత్థం దిగ్భిత్తి రోధః క్షతవిసరతయా మాంసలైస్త్వద్యశోభిః
స్తోకావస్థానాదుః స్థైత్రిజగతి ధవళే విస్మయస్తే మృగాక్ష్యః

హాసము స్వచ్ఛమనుటకు ఉదాహృతి నిచ్చుచు—"శివుని ప్రళయ కాలాట్ట హాసములు క్షీరసాగర ఫేనముతో మరింత తెల్లగా భాసించెన"ను భావమును రాజశేఖరుడు పేర్కొనెను.[2]

**అయశమును, పాపమును నల్లగా వర్ణించుట :**

యశస్సును పుణ్యమును తెల్లనివిగా వర్ణించుటలో గల సామంజస్యమును నేను ఇదివరకే నిరూపించి యున్నాను. శ్వేత వర్ణమునకు విరుద్ధమైనది కృష్ణ వర్ణము. యశస్సు ధవళమైనప్పుడు అయశము కృష్ణ మనుట సహజ సిద్ధము.

అయశ పాపములు అమూర్తములు. వీనికి రూప కల్పనము చేయు ప్రయత్నములు లోకానుభవమునకు సన్నిహితములుగా ఉండవలయును. అతి కృష్ణములైన రాత్రులు భయదములు. కనుక అవాంఛనీయములు లోకములో ఏదేని మహత్తర కార్యమును సాధించినప్పుడు మనుష్యుని ముఖము అపూర్వ శోభతో ప్రకాశించును. కాని దుష్ప్రవర్తనము వలన అపయశస్సు కలిగి నప్పుడు ముఖము మ్లానమై నల్లబడుట కనుచుందుము. అయశము నెవ్వరును కీర్తింపని కారణమున అది మరుగున పడిపోవును. మరుగున పడిపోవుట అనగా వెలుతురునకు నోచుకొనక పడియుండుట. అయశమునకు కళంకము పర్యాయ వాచి. కళంకము నల్లనిది. కనుక అయశమునకు నైల్యమారోపింపబడనది. అట్లే పుణ్యమునకు శ్వేత వర్ణారోపణము జరిగినప్పుడు పాపము అసితమనుటకు సందేహింప వలసిన అక్కర లేదు

పాపము కృష్ణ మనుటకు ఉదాహృతి నిచ్చుచు రాజశేఖరుడు పాపము యొక్క నైల్యమును ఖడ్గధార యొక్క నైల్యముతో పోల్చినాడు.[1] అయశము నకు కృష్ణత్వమును ఆరోపించుచు - నీలోత్పలములను కూర్చి అల్లిన మాలతీ కుసుమమాలవలె శత్రువుల అపకీర్తియును రాజుకీర్తియును కలిసి

2. "అట్టహాసచ్ఛలే నాస్యాద్యస్య ఫేనో ఘపాండురాః
జగత్ క్షయ ఇవాపీతాః క్షరంతి క్షీరసాగరాః"

1. "ఉత్పాత నిర్మల మయూఖ కృపాణరేఖా
శ్యామాయితా తనుర భూద్దయ కంధరస్య
సద్య ప్రకోప కృతకేశవ వంశనాశ
సంకల్ప సంజనిత పాపమతీ మనేవ"

ప్రతిదినము లోకములో వ్యాపించుచున్నవని రాజశేఖరుడు ఉదాహరించినాడు.[1]

పాపపురుషుని వర్ణము కృష్ణమని సంప్రదాయము.[2] ఈ కవి సమయ ప్రభావమువలన ప్రత్యక్షముగా లేని పదార్థమును, అతీగోచరముచే ఎన్నియో పదబంధములకును లక్ష్య వ్యంగ్యార్థ ప్రతిపాదనమునకు అవకాశము కలిగినది. దీని ప్రాబల్యము ఎంతవరకు పోయినదనగా అయశపాపములకు నల్లదనము కాక మరేదేని వర్ణమును ఆరోపించినచో భాషా వ్యాపారమే తలక్రిందులగును.

## 14. క్రోధానురాగ ప్రతాపములు రక్తవర్ణములుగా చెప్పట:

క్రోధానురాగ ప్రతాపములు మూర్తములు కాని మనోగుణములు. నేత్రాద్యవయవముల సంచలనమువలన ఇవి అవగతములై అనుమేయమానము లగుచుండునే కాని వీని మూర్త రూపములు ప్రత్యక్షము కావు. ఈ అవయవ సంచలనములు కూడ సాపేక్షములు. అందరును ఈ మనః పరిస్థితులలో ఒకే తీరుగ వ్యవహరించుట అసంభవము.

రౌద్ర రసమునకు స్థాయీ భావము క్రోధము క్రోధమునకు రక్త వర్ణమును భరతుడు నాట్యశాస్త్రమున నిర్దేశించినాడు.

క్రోధాది మనఃస్థితులు అత్యుత్కటములై తీవ్రత నందినప్పుడు శరీరములో అనేక విధములైన వికారములు కలుగును. క్రోధము పూనిన వ్యక్తి గుప్పిలి బిగించును. అతని రక్తనాళములో రక్తము అతివేగముగా ప్రవహించును. కన్ను లెఱ్ఱపడును. అరుణకాంతి ముఖమునందంతటను వ్యాపించును. కోపము భయము వంటి ఉద్వేగకరములైన మానసికావస్థలలో "ఎండ్రీన్" అను గ్రంధి నుండి కొన్ని ద్రవములు రక్తములో ప్రవేశించును. దీనివలన మనిషికి ఎంతేని ఉత్తేజము కలుగును. సామాన్యముగా అతని వలన కాని

---

1. ప్రసరంతి కర్త్యస్తే తవచ రిపూణాను కీర్తయోయుగపత్
   కువలయదల సంవలితాః ప్రతిదినమివ మాలతీమాలాః
   ——రాజశేఖరుని కావ్యమీమాంస - అధ్యాయము 15.

2. ... ... ... ...
   ... ... అధోముఖం కృష్ణ వర్ణమంగుష్ఠ పరిమాణకః
   (పాప పురుష లక్షణములు) - ఆర్షవిజ్ఞాన సర్వస్వము
   ప్రథమ భాగము - పుట 400 శీలప్ప రామకృష్ణశాస్త్రి - ప్రచురణ 1965.

పనులు ఈ ఉద్వేగమును అనుభవించు సమయమున సులభముగా చేయగలడని మన స్తత్వ శాస్త్రము చెప్పుచున్నది. ఈ వికృతులలో కన్నెఱ్ఱబడుటతో మన ఈ కవిసమయమునకు సంబంధమున్నది.

'కన్నెఱ్ఱచేయు', 'కన్నులు జేవురించు' వంటి పద బంధములు క్రోధము నకు రక్తత్వమునే సూచించుచున్నవి. రౌద్ర రసాధి దేవత శివుడు. ఆతడు అగ్రహోదగ్రుడైనప్పుడు అతని ఫాల నేత్రమునుండి పావక జ్వాలలుద్భవించుట పురాణ ప్రసిద్ధము. పావక జ్వాలలు ఎఱ్ఱనివే కదా ! అనంత శక్తి సంపన్నుడైన శివుని కోపము మంటలుమిసినది. మానవుల కోపము మంటలను క్రక్కక పోయినను మంటల వర్ణము పులుముకొన్నది. 'కన్నుల నిప్పులు రాల్చు' అను పద బంధము (జాతీయము) ఈ సందర్భముగనే రూపు దాల్చి కోపము ఎఱ్ఱనిదను కవిసమయా విర్భావమునకు దారి తీసి యుండవచ్చును.

క్రోధానురాగలజ్జాదులు రజోగుణ ప్రధానములైన భావములు. రజః అనగా రంజ్యతే అనే తీతి రజః రంజరాగే -దీనిచేత ఎఱ్ఱగా చేయబడును అని అమరకోశము. రజోగుణమునకు రక్తత్వము ఆరోపణము చేయబడినది కావున క్రోధాది రజోగుణ వికారములకు రక్తత్వము కవి సమయముగా రూపొంది యుండవచ్చును.

శివోపాలంభనముచేసిన వటువును కోపించు పార్వతి నేత్రాంచలములు కెంపెక్కినవని కాళిదాసు కుమార సంభవమున వర్ణించినాడు.[1] అనురాగము నకు కూడ రక్తత్వము నారోపించుట కవులపరిపాటి. సిగ్గుముంచికొని వచ్చి నప్పుడు కపోలములపై ఎఱ్ఱనెఱ్ఱని కాంతులు భాసించుట అనుభవ సిద్ధమైన విషయము. రాగమునకు ప్రేమయనియును ఎఱ్ఱదనమనియు అర్థములున్నవి. ఈ అర్థసామ్యము కూడ ఈ కవిసమయమునకు మరొక ఉపపత్తిని కల్పించు చున్నది. ఎఱ్ఱదనము సౌందర్య హేతువు. ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉండు అను పద బంధ మేర్పడుటకు ఇదియే కారణము. అనురాగ మెఱ్ఱనిదనుటకు ఉదాహృతుల నెన్నెని చూపవచ్చును. అనురాగములవలె ఎఱ్ఱనైన మాలికను ఇందుమతి అజుని

1. "ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదినీ ప్రవేపమానాధరలక్ష్యకోపయా
వికుంచిత భ్రూలత మాహితే తయా విలోచనేతిర్యగుపాంతలోహితే"
—కుమార సంభవము – సర్గ 5. శ్లో. 74.

కంఠమునందు వేసెనని కాళిదాసు రఘు వంశమునందు వర్ణించెను.[2] ప్రతాపమును అగ్నితో పోల్చుట సర్వ సామాన్యమైన విషయము. అగ్నివి అరుణ కాంతులుకదా! కనుక ప్రతాపమునకు రక్తత్వము నారోపించుట కవి సమయమైనది.

**ప్రతాపమునకు ఉష్ణత్వముండునట్లు వర్ణించుట:**

ఉష్ణత్వము జీవ లక్షణము. చల్లదనము చచ్చుదనమునకు చిహ్నము. ఉష్ణము శక్తి. శక్తి మనుష్యుని కార్యోన్ముఖుని జేయును. మరి ఆ శక్తి అధికమైనప్పుడు ఇతరు లెవ్వరును దరిచేరరానంతటి దుర్నిరీక్ష్యమై పోవును. తాపమనగా తేజము. ప్రతాపమనగా "ప్రతపన్త్యనేన శత్రానితి ప్రతాపః - తప సంతాపే -" శత్రువులను తపింపజేయునది. అనలము కాక మరేమగును? అన్ని అన్నప్పుడు ఉష్ణ మనియే కదా చెప్పవలసినది. ఈ దృష్టితోడనే ప్రతాపాగ్ని వంటి రూపకము లేర్పడుటకు అవకాశము కలిగినది. ప్రతాపమును ఉష్ణముగా వర్ణించు సందర్భములు కావ్యములందు అనేకములు.

నైషధమునందు—

"అనల్ప దగ్ధారి పురానలోజ్జ్వలైః
నిజప్రతాపైర్వలయం జ్వలద్భువః
ప్రదక్షిణీకృత్య జయాయ సృష్టయా
ర రాజు నీరాజనయ......" —సర్గ - 1.

(నలుని ప్రతాపాగ్ని భూవలయము చుట్టును నీరాజనమువలె పరిభ్రమించుచున్నదని భావము).

**స్త్రీకి రోమావళి, త్రివళులు లేకున్నను వర్ణించుట:**

స్త్రీ సౌందర్యమునకు సంబంధించినది ఈ కవిసమయము. కామశాస్త్రము చతుర్విధ స్త్రీ జాతులను పేర్కొన్నది. పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని, ఈ నాలుగు జాతులలో పద్మినీ జాతిస్త్రీ ఉత్తమమైనది. పద్మినీజాతిస్త్రీ సౌందర్యమునకు ఆదర్శము. కనుకనే సకల దేవాంగనలను, అత్యంత సుందరులైన మానవ కాంతలను పద్మినీజాతిస్త్రీలతో పోల్చుచుందురు. ప్రాయికముగా

2. సా చూర్ణగౌరం రఘునందనస్య ధాత్రీకరాభ్యాం కరభోపమోరూః
ఆసంజయామాస యథా ప్రదేశం కంఠేగుణం మూర్తమివానురాగమ్
—రఘువంశము - సర్గ 6. శ్లో. 83.

భారతీయ సాహిత్యములలో స్త్రీరూప సంబంధములైన లక్షణములనేకములకు సాముద్రిక శాస్త్ర సూత్రములును దేవతా కాంతల రూప విలాసములును కామ శాస్త్రీయములైన అంశములును ప్రమాణములుగా ఉన్నవి. స్త్రీకి రోమావళి (నూగారు) నాభినుండి రొమ్మువరకు నల్లని చీమలబారువలె నున్నచో ఆ స్త్రీ సుఖవతియును భాగ్యవంతురాలగుననియును వళులు (కడుపుపై ముడతలు) జలతరంగమువలె మూడు కనబడుచున్నచో ఆ స్త్రీ ఉత్తమురాలగు ననియును, స్త్రీ సాముద్రిక శాస్త్రము చెప్పుచున్నది. స్త్రీ శరీరమును బంగారు వన్నెతోను, చంపక కేతకీత్యాది కుసుమ వర్ణములతోను, చంద్రికా శాతటిల్లతాది ధవళ వర్ణములతోడను పోల్చుట సంప్రదాయము. పచ్చని తెల్లని శరీరము పైన నల్లని నూగారు కాంతులు, ఆ ముడుతల నల్లని రేఖలవంటి ఛాయ లుండుట సౌందర్య సమగ్రతా హేతువులు.

రోమావళి త్రివళులు పద్మినీ జాతిస్త్రీలకు ఉండుననియును స్త్రీ సౌందర్య వర్ణనము వీని ప్రసక్తి లేనిదే అసుందరము అసమగ్రము అను అభిప్రాయమే ఈ కవి సమయమునకు ఆధారమైనది. అంతియే కాని స్త్రీలందరి యందును నూగారు త్రివళులును ఉండుట అసంభవము. కనుక ఇది అసత్తును నిబంధించు టయే అగును. జలాశయమాత్రమునందు హంస సారసాది పక్షులుండునని చెప్పు కవి సమయమునకున్న సామంజస్యమే దీనికిని వర్తించును.

"పార్వతి నూగారు పోకముడిని దాటి లోతైన పొక్కిటిని చొచ్చినదై ఆమె యొడ్డాణము నడిమి ఇంద్రనీలమణి రేఖయోయన ఒప్పారుచుండెనని కాళిదాసు వర్ణించెను.[1] పద్మినీ జాతి స్త్రీలకు వళిత్రయము ఉండుననుటకు కుమార సంభవమునందే మరొక ఉదాహృతి ఉన్నది.[2]

నన్నయభట్టు మేనకా సౌందర్యమును అభివర్ణించుచు చెప్పిన పద్యమును కూడ తార్కాణముగా పేర్కొనవచ్చును.

"అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు ముందు నున్న స
మ్మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁదూలి బాలపై

---

1. "తస్యాః ప్రవిష్టానతనాభి రంధ్రం రరాజ తన్వీనవరోమరాజిః
నీవీ మతిక్రమ్యసితేతరస్య తన్మేఖలా మధ్యమణే రివార్చిః"
—కుమార సంభవము - సర్గ 1. శ్లో. 38.

2. మధ్యేన సావేది విలగ్న మధ్యా వళిత్రయం చారు బభారబాలా
ఆరోహణార్థం నవయావనేన కామస్య సోపానమివ ప్రయుక్తమ్
—కుమార సంభవము - సర్గ 1. శ్లో. 39.

వలు వెడలన్ బయల్పడియె వల్గుకుచంబులుఁగతుయుగ్మముల్
లలిత కృశోదరంబుఁ దరళత్రివళీయుత రోమరాజియున్"[3]

**పక భ్రమరములకు విరోధమున్నట్లు వర్ణించుట :**

పువ్వులను ఆశ్రయించుకొని తుమ్మెదలుండుట సాధారణమైన విషయము. ణయ భావ వ్యంజకము, షట్పదసహితములైన కుసుమములు సుందరములు. తుమ్మెదలు తేనెలను అనుటకు పూలపై వ్రాలటవలన పూలలో బీజోత్పత్తి రుగును. ఇది వృక్షశాస్త్రమునకు సంబంధించిన యాథార్థ్యము. దీనినే పరపరాగ సంపర్కము' (**Polinisation**) అందురు. ఈ సంపర్కమునకు తోడ్పడునవి ఒక్క భ్రమరములే కావు. వాయువు, జలము, పక్షులు మరి ఇతర కీటకములు, ఈ ప్రక్రియకు దోహదము కల్పించుచుండును. అన్ని రకము లైన పూలపై అన్ని విధములైన భ్రమరాది కీటకములు వ్రాలవు. పూవుల వర్ణమును బట్టియు వాసనములను బట్టియు అవి యుండు స్థలములను బట్టియు ఈ భ్రమరాదులలో వైవిధ్యము ఉండవచ్చును.

చంపకము పసుపు పచ్చని వన్నెతో అతితీక్ష్ణమైన మాదక పరిమళముతో ఒప్పారు కుసుమము. ఈ వాసనను తుమ్మెద భరించలేదట. ఒకవేళ తుమ్మెద దానిపై వ్రాలినను అది చచ్చునట నిజమే కావచ్చును. ఆకులను అలములను మేయు పశువులు పొగాకును మాత్రము ముట్టవు మనుష్యులలో కూడ అందరికి అన్ని పదార్థములు గిట్టవు కొందరికి కొన్ని వాసనలు గిట్టవు. కొందరికి కొన్ని రుచులు సరిపడవు. ఈ గిట్టక పోవుటను **Allergy** అందురు. ఈ **Allergy** భ్రమరాది కీటకములకు ఉండకూడదనుటకు ఆధారమేదియు కనిపింపదు.

కావ్య ప్రపంచమున పువ్వులు స్త్రీలు, తుమ్మెదలు పురుషులు. సంపెగ లపై తుమ్మెదలు వ్రాలవను కవిసమయము ప్రణయ వ్యాపారమునకును స్త్రీ పరాఙ్ముఖత్వమునకును ప్రతీకగా నిలిచిపోయినది. సుందరాంగన ముక్కును సంపెగ కుసుమముగా వర్ణించుట ప్రసిద్ధము. అన్ని పువ్వులపై వ్రాలు తుమ్మెద తనపై ఏల వ్రాలదని సంపెగ తపస్సుచేసి ఒక సుందరకాంత నాసికగా అవత రించెనని, తుమ్మెదల బారువలెనున్న ఆమె చూపులెల్లప్పుడును తనపై

3. శ్రీమదాంధ్ర మహాభారతము - ఆదిపర్వము - చతుర్థాశ్వాసము - పద్యము, 44.

ప్రాలునట్లు చేసికొనెనను భావమును ఈ కవిసమయ స్ఫూర్తితో అందించిన రామరాజ భూషణుని—

"నానాసూన వితాన వాసనల నానందించు సారంగమే
లానన్నొల్లదటంచు గంధఫలి బల్కాకందంపంబంది యో
షానాసాకృతిఁబూని సర్వసుమన స్సౌరభ్య సంవాసమై
పూనెంబ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబునిర్వంకలన్"[1]

అను పద్యము తెలుగు సాహిత్యమున్నంతవరకు కావ్య రస పరిమళమును గుబాళించుచునే ఉండును.

మిళిందములు చంపకములపై ప్రాలవనుటకు ఉదాహరణముగా 'సుభాషిత రత్న భాండాగారము' నందలి ఈ శ్లోకమును పేర్కొనవచ్చును.

"రూపసౌరభ సమృద్ధి సమేతం, చంపకం ప్రతియయుర్నమిలిందర్గ
కామినస్తు జగృహస్త దశేషాగ్రాహకాహిగుణినాంకతినస్యుః"[2]

అల్లసాని పెద్దన మనుచరిత్రములోని—

"వాని చక్కఁదనము వైరాగ్యమునఁజేసి
కాంతుసేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యె పూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁబోలె"[3]

అను పద్యము కూడ ఇందుకు చక్కని ఉదాహరణము.

చంపకభ్రమరములకు విరోధముండుటకు కారణమునుతర్కబుద్ధితోఎంతగా ఆలోచించినను అమరకోశము చంపకమునకు చూపిన వ్యుత్పత్తి పరమాశ్చర్య కరముగా ఉన్నది. చంపకమనగా చమ్యతే, అలిభిరితి చంపకః. చము-అదనే-తుమ్మెదలచే నాస్వాదింపబడినది అని అర్థము. ఈ వ్యుత్పత్త్యర్థము దృష్టితో చూడగా చంపక భ్రమరములకు సఖ్యమే కాని వైరుధ్యము లేదని మనము నమ్మవలసి వచ్చుచున్నది. ఈ విధముగా వైరుధ్యము లేకున్నను ఉన్నదని చెప్పుట అనగా - అసత్తును నిబంధించుటయే కదా ! కవిసమయమే కదా !

1. వసుచరిత్రము - ద్వితీయాశ్వాసము - పద్యము, 47.
2. 239 - 66.
3. మనుచరిత్రము - ప్రథమాశ్వాసము - పద్యము, 52.

## వృక్ష దోహదములు

రాజశేఖరుడు తన కావ్య మీమాంసలో వృక్ష దోహదములను కవిసమయములలో చేర్చలేదు. అతని తరువాత విశ్వనాథుడు (14వ శతాబ్ది) తన సాహిత్య దర్పణములో వృక్ష దోహదములను కవి సమయములుగా పేర్కొనుచు అశోక వకుళ దోహదములను రెండింటిని మాత్రము చెప్పినాడు. పిమ్మట కేశవమిశ్రుడు (16వ శతాబ్ది) ఈ రెండింటినే కవి సమయములుగా – అసత్తు నిబంధనమునకు ఉదాహరణములుగా వ్రాకుచ్చినాడు వీరిరువురి తరువాత ఏ ఆలంకారికుడును వీనిని స్పృశించినట్లు కానరాదు.

కాళిదాసు కావ్యములకు సంజీవని వ్యాఖ్యను రచించిన మల్లినాథుడు మేఘదూతమున అశోక వకుళ దోహదములను కవి ప్రసిద్ధులని[1] వ్యాఖ్యానించుచు ఇంకను ఎనిమిది వృక్షదోహదములను పేర్కొనుచు ఒక శ్లోకమును వ్రాసినాడు.[1] ఇవి అన్నియు కవి ప్రసిద్ధులే. కవిసమయములే ఆ పది వృక్ష దోహదములివి.

1. పద్మినీ జాతిస్త్రీల స్పర్శచేత ప్రియంగువులు
2. పద్మినీ జాతిస్త్రీల ముఖమదిరా సేచనముచేత వకుళములు.
3. పద్మినీ జాతిస్త్రీల పాదాఘాతముచేత అశోకములు.
4. పద్మినీ జాతిస్త్రీల చూపులచేత తిలకములు.
5. పద్మినీ జాతిస్త్రీల ఆలింగనముచేత కురవకములు.
6. పద్మినీ జాతిస్త్రీల నర్మ వాక్యములచేత మందారములు.

---

1. "రక్తాశోకశ్చలకిసలయః కేసరశ్చాత్రకాంతః
ప్రత్యాసన్నే కురవకవృతే ర్మాధవీ మండనస్య
ఏకః సఖ్యాస్తవ సహమయా వామపాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదన మదిరాం దోహదచ్ఛద్మనాస్యాః —మేఘదూతం 2-18.

1. "స్త్రీణాం స్పర్శాత్ ప్రియంగు వికసతి వకులం సీధుగండూషసేకాత్
పాదాఘాతాదశోక స్తిలక కురవకౌ వీక్షణాలింగనాభ్యాం
మందారో నర్మ వాక్యాత్ పటుమృదుహసనాచ్చంపకో వక్త్రవాతాత్
చూతోగీతాన్న మేరుర్వికసతిచ పురోనర్తనాత్ కర్ణికారః"
—మేఘదూతము - 2-18వ శ్లోకమునకు వ్యాఖ్యానము.

7. పద్మినీ జాతిస్త్రీల మృదుహాసముచేత చంపకములు.
8. పద్మినీ జాతిస్త్రీల ముఖానిలముచేత మాకందములు.
9. పద్మినీ జాతిస్త్రీల గానముచేత నమేరువులు.
10. పద్మినీ జాతిస్త్రీల నృత్యముచేత కర్ణికారములు కుసుమించును.

కుమార సంభవమునందు వ్యంజితమైన అశోక దోహదవృత్తిని సమర్థించుచు వ్యాఖ్యాత మల్లినాథుడు మరియొక శ్లోకము నుదాహరించినాడు. అందు కేవలము అశోక వకుళ కురవక తిలకముల దోహద వృత్తులను మాత్రము ఉల్లేఖించినాడు.[1]

రాజశేఖరుని కావ్యమీమాంస యందలి 13వ అధ్యాయమున విధానాపహారమునకు దృష్టాంతములుగా రెండు శ్లోకములున్నవి. అందు అశోక, వకుళ, తిలక, మరవకముల దోహద క్రియలను గూర్చి ప్రస్తావింపబడినది.[2] ఇదే గ్రంథములందలి పదునెనిమిదవ అధ్యాయమునందు వసంతర్తువునకు సంబంధించిన శ్లోకములో "స్త్రీలుచేయు ఆయా దోహదక్రియలు లేకయే అశోక వకుళ కురవక తిలకములు పుష్పించెర"ని వర్ణించెను.[3]

ఈ వృక్ష దోహదములతో రాజశేఖరునికి పరిచయముండెననియును ఆయా ఋతువులలోనే ఆయా వృక్షములు పుష్పించుననియును అతనికి తెలిసియుండెననుటయు స్పష్టము. అశా స్త్రీయములును అలౌకికములును

1. "పాదహతః ప్రమదయా వికసత్యశోకః
శోకం జహాతి వకులో ముఖసీ ధుసిక్తః
ఆలోకితః కురవకః కురుతే వికాస
మాలోహిత స్తిలక ఉత్కలికో విభాతి" —కుమారసంభవము-3-26వ శ్లోకవ్యాఖ్యము.

2. "ముఖ మదిరయా పాదాఘాతై ర్విలాస విలోకితై
ర్వకుల విటపే రక్తాశోక స్తయా తిలక ద్రుమః
జలనిధితటీ కాంతారాణాం క్రమాత్ కకుభోంజయే
ఝగితి గమితా యద్వర్గ్యభి వికాస మహోత్సవమ్"
—రాజశేఖరుని కావ్యమీమాంస - 13వ అధ్యాయము.

3. నాలింగితః కురుబక స్తిలకో నాదృష్టో నోతాడితశ్చ సదృశాం చరణైరశోకః
సిక్తోన వక్త్రమధునా వకులశ్చ చైత్రే చిత్రం తథాపి భవతి ప్రసవావవర్ణః
—రాజశేఖరుని కావ్యమీమాంస అధ్యాయము-18.

అయిన ఈ వృక్ష దోహదములను అతడు కవిసమయములుగా ఏల గుర్తింప లేదో తెలియరాకున్నది. రాజశేఖరుని కాలమునాటికి అవి ప్రకృతి సత్యములని అతనికి తోచి తన కవిసమయ నిర్వచనమునకు లోబడక పోవుటచేతనో లేక ఈదోహదములకు మూలము సాహిత్యేతర విషయమని తాను భావించినందు చేతనో వానిని పేర్కొనక విడిచినట్లు ఊహింపవచ్చును. రాజశేఖరుని దృష్టికి రాకపోయినను విశ్వనాథ కేశవ మిశ్రులును మల్లినాథుడును కావ్యజాలమున వీనికున్న ప్రాచుర్యమును గుర్తించి కవిసమయ సకేంత మొసంగినారు. నిజము నకు రాజశేఖరుని కవిసమయమునకున్న లక్షణములు వీనికిని వర్తించుచున్నవి. కావున అవి కవిసమయములే. పైన పేర్కొన్న పది వృక్ష దోహదములన్నింటికి కావ్య ప్రపంచమున లక్ష్యములు చూపుట కొంచెము కష్టసాధ్యమే అయినను అశోక, వకుళ, కురవక, తిలక దోహదములకు మాత్రము లక్ష్యములు బహుళ ముగా కనిపించుచున్నవి. వ్యంగ్యార్థ ప్రతిపాదనమునకు ఈ వృక్షదోహదములు ఉపస్కారములుగా నేటికిని ప్రవర్తిల్లుచున్నది.

పదునాల్గవ శతాబ్దమున రచింపబడిన పార్శ్వనాథ చరిత్రము అను జైన గ్రంథమున ఈ వృక్షదోహదముల ప్రసక్తి ఉన్నది.[1] ఈ పది వృక్షదోహదము లను తొలిసారిగా పేర్కొన్నవాడు మల్లినాథుడే. దీనినిబట్టి వీని సంఖ్యతో పాటు వీనికి ప్రాచుర్యము కూడ పెరుగుచు వచ్చినదని చెప్పవచ్చును.

దోహద శబ్దమునకు అమరకోశములో "ఇచ్ఛ - కాంక్ష - స్పృహా - వాంఛ - లాలస" మున్నగు అర్థములున్నవి. శబ్ద కల్ప ద్రుమమునందు "గర్భిణ్యభిలాష - పుష్పోద్గమౌషధమమ"నియు అర్థములున్నవి. కథా సరిత్సా గరమునకు టిప్పణులు వెలయించిన పెంజరు మహాశయుడు దోహదమును హృదయ సమ్మేళనమనెను. ఇంకను వివరించుచు గర్భవతికి రెండు హృదయ ములుండుననియును ఆమె ఏదేని వాంఛించినపుడు గర్భస్థ శిశు వాంఛ సమ్మిళితమై యుండుననియును తెలిపెను. వృక్ష దోహదమునకును ఇది వర్తించు నని పెంజరు అభిప్రాయపడెను.[1]

---

1. భావదేనూరి పార్శ్వనాథ సూరి చరితము 6-796 నుండి 799 వరకు.

1. The Ocean of Story Vol. 1 to 10 : Towny and Pezer.

అకాలమందు వృక్షములను పుష్పింపజేయు కుశలోపాయములతో ప్రాచీన వృక్షతత్త్వ వేత్తలకు పరిచయముండెనని ఈ వృక్షదోహద ప్రక్రియ వలన తెలియుచున్నది. "తరుగుల్మలతాదినా మకాలే కుశలైః కృతమ్, పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదంస్యాత్తు తత్క్రియా" అని మల్లినాథుడు మేఘదూతమున ఉత్తర మేఘమున పదునేడవ శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు తెలిపియుండెను.

అకాల పుష్పోద్గమము ఆనంద సంధాయకము. విస్మయావహము. దైవానుగ్రహ సూచకము. వనమునందున్న రాముని కి అచట తరులు, గిరులు, అకాలమునందు సైతము ఫల పుష్పములను కానుకలుగా సమర్పించుకొనగలవని అయోధ్యావాసులు ఆకాంక్షించినారట.[2] మన్మథుని సృజన ప్రభావమును సూచించుటకు ఆతని సహచరుడైన వసంతుని అకాలాగమమువలన వృక్షములలో పుష్పోద్గమమైనట్లు వర్ణించుట కావ్య ప్రపంచములో సర్వసాధారణమైన విషయము. కాళిదాసు కుమార సంభవమున శివతపోభంగమునకు ఏతెంచిన మన్మథుని మహిమతో అకాలవసంతోదయమైనట్లు వర్ణనమున్నది.[3]

సుందరీ మణుల రూప, గుణ, వర్ణ, గంధ, గతుల సామ్యమును ధ్వనింప జేయుటకే ఈ వృక్షదోహదము, లేక అకాలపుష్పోద్గమము కావ్య జాలమున ప్రవేశించి యుండవచ్చని ఊహింపవచ్చును.

ప్రాచీన శిల్పములలో యక్షిణుల వృక్షదోహదముల దృశ్యములు కనిపించుచున్నవి. స్త్రీసౌందర్యమునకు యక్షిణి ఆదర్శము. యక్షిణిల వృక్ష దోహదమే సాధారణీకరణము చెంది స్త్రీపరముగా ప్రాచుర్యమును వహించి యుండును. వృక్షదోహదములను గూర్చి తడివినపుడు మరొక్క అంశము తలపున మెరయును. పద్మినిజాతిస్త్రీలు శృంగారమునకు ఆదర్శమూర్తులు. శృంగారమునకు అలంక్రియలు ప్రధాన సాధనములు. ఈ అలంక్రియాసాధనము లలో పూలకున్న ప్రాముఖ్యము ఇంతింతనరానిది. పువ్వులు ఉద్దీపనవిభావము నకు ఆధారములు. శృంగార రస పరిణతికి హేతుభూతములు. అవి సద్యః

---

2. ఆకాలే చాపిముఖ్యాని పుష్పానిచ ఫలానిచ
దర్శ యిష్యన్త్యనలక్రోశాన్ గిరయో రామమాగతమ్ —రామాయణమ్_2_4 8_13.

3. కుమార సంభవమ - సర్గ 3, శ్లో_24 నుండి 32 వరకు.

కాలమున లభింపవలెనను లాలస వారిలో ఉండుట సహజము. తమ శృంగార చేష్టా విశేషములనే దోహదములుగా చేసికొని, తాము కోరిన పూలను సంపాదించుకొని యుందురు. కుసుమములకును కుసుమాంగులకును అవినాభావ సంబంధము కదా!

కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యాతలు శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు కవిసమయముల పట్టికను ఉట్టంకించుచు అందు ఈ వృక్షదోహదములను ఉదాహరించిరి.

వృక్షదోహద క్రియలన్నియును పద్మినీ జాతిస్త్రీల పాదాఘాతాది చేష్టల వలన ప్రవృత్తములగుచుండుట కవి సంప్రదాయగతమై ఉన్నది. ఆయా వృక్షదోహదములను ఒక్కొక్కటిగా తీసికొని వాని సామంజస్యమును పరిశీలింతును.

**యువతుల పాదాఘాతముచేత అశోకము కుసుమించుట:**

అశోక కుసుమములు అరుణములు. పద్మినీ జాతిస్త్రీల చరణములును అరుణములు. వారి పాదతాడనముచేతనే అవి కుసుమించునని చెప్పుట ఉత్ప్రేక్షా గర్భితమైన అతిశయోక్తి మాత్రమే. దోహదమను శబ్దమునకు అకాలమునందు పుష్పింపజేయుట అని అర్థము కదా!

పూలులేని తరులతాదులు అసుందరములు. అసుందరములైన పదార్థములు ఆనంద హేతువులు కావు. అకాలమున ఆయా తరులతాదులను పూచునట్లుచేసి ఆనందముననుభవించు మనస్తత్వము భంగ్యంతరముగా ఈ కవిసమయ రూపముగా బహిర్గత మగుచున్నది.

ఇందుమతీ పాదతాడన దోహదముచేత పుష్పింపచేయబడిన అశోకముపై ఆమె లేనందున అజుని దృష్టి మాటిమాటికి ప్రసరించునని కాళిదాసు వర్ణించినాడు.[1]

1. "కుసుమంకృత దోహదస్త్వయా యదశోకోఽయముదీరయిష్యతి
అలకాభరణం కథం నుతత్తవనేష్యామిని వాపమాల్యతామ్
స్మరతేవస శబ్దనూపురం చరణానుగ్రహమన్య దుర్లభమ్
అమునా కుసుమాశ్రు వర్షిణా త్వమశోకేన సుగాత్రి శోచ్యసే"
—రఘువంశము - 8-62, 63.

**పుక్కిటి మద్యము ఉమియుటచేత పొగడచెట్టు పుష్పించుట :**

పొగడపువ్వులలో మదిరాగంధమును పోలిన సుగంధముండును. కనుకనే వీనిని సీధు గంధములనియును మద్యగంధములనియును అందురు. యువతులు మదిరను పుక్కిలించి వకుళ వృక్షముపై ఉమియుటవలన అది కుసుమించుననుట వ్యంగ్యగర్భితముగా చెప్పిన మాటయే. మదిరామధురిమలతో రమణుల ముఖములు ఆకర్షణీయములును, ఆస్వాదనీయములుగను ఉండునను నర్మభావమును రమణీయముగా భంగ్యంతరముగా చెప్పుటయే. కాంతాశ్వాసలో వకుళ పుష్ప సౌగంధ్యమున్నట్లు కాళిదాసు వర్ణనము.[2]

**కురవకము (ఎఱ్ఱగోరంట) లు స్త్రీల ఆలింగనముచే పుష్పించుట :**

కురవక మంజరుల శోభ సుందరుల ముఖద్యుతులతో సమానముగా ఉన్నదని, వాని రాగోద్దీపకశక్తి మదన బాణ సన్నిభమని కాళిదాసు వర్ణించినాడు.[3] రామాయణమునందు కురవకముల ప్రసక్తి వసంత ఋతువర్ణన సందర్భమున ఉన్నది.[4]

కురవకములు స్త్రీల ఆలింగనముచే పుష్పించుననుటకు తార్కాణముగా రాజశేఖరుని కావ్య మీమాంసలోని కాలవిభాగ ప్రకరణమునందలి ఈ శ్లోకమును చూపవచ్చును

"నాలింగితః కురబస్తిలకోన దృష్టో
నో తాగితశ్చ చరణైః సదృశామశోకః
సిక్తోన వక్త్రమధునా వకుళశ్చ చైత్రే
చిత్రంత దాపి భవతి ప్రసవావ కీర్ణః"

(ఏమి ఆశ్చర్యము ! రమణి ఆలింగనము లేకయే కురవకము, ఆమె చూపులు పడకయే తిలకము, ఆమె పాదాఘాతము లేకయే అశోకము, ఆమె ముఖపద్మ గండూషము లేకయే పొగడలు పూచుచున్నవి కదా !)

2. "జనని శ్వసితానుకారిభిర్వకులై రర్ధచితాం సమంమయా
అన సమాప్య విలాసమేఖలాం కిమిదం కిన్నరి కంఠిసుప్యతే".
—రఘువంశము - 8-64.

3. ఋతు సంహారము 6_20.

4. రామాయణము 4_1_21.

రమణుల ఆలింగనము చేత కురవకము పుష్పించుననుటకు కేవలము కావ్య రసాత్మకముగా వ్యంగ్యగర్భితముగా చెప్పుటకు ప్రయత్నించుటయే కారణమని ఊహించుటకు వీలున్నది. ఆలింగనము అత్యనురాగ సూచకము. అనురాగమునకు అరుణవర్ణము కవి సంప్రదాయ సిద్ధము కనుక సానురాగముగా కురవకమును కౌగిలించుకొన్నప్పుడు అది రాగస్పర్శచేత కుసుమించునేమో. కురవక కుసుమ జాతిలో తెల్లనివే కాక పలుపన్నెలవి ఉన్నను కేవలము ఎఱ్ఱగోరింటలు మాత్రమే రమణుల ఆలింగనముచేత కుసుమించునను కవిసమయము పైన చెప్పిన ఉపపత్తికి ఉపస్కారకముగా ఉన్నది. ఆలింగనమువలన కురవకములు పుష్పించుననుట - ప్రమదలకు కలిగిన పులకలే కురవకములను పులకాంకితములను చేసినవి - అనగా పుష్పింపజేసినవని ఊహింపవచ్చును.

**తిలకము (బొట్టుగుచెట్టు) రమణుల చూపులచేత పుష్పించుట:**

తిలకములు నువ్వు పువ్వులవంటి తెల్లని చిన్న పువ్వులు తిలక తరువులు రమణుల చూపులచేత పుష్పించు ననుటకు కారణము వ్యంగ్య కథనమే కాని అన్యము కాదు. ఈ వ్యంగ్య కథనమునకును కొంచెము ఆధారములేకపోలేదు. తిలకకుసుమములు తుమ్మెదలకు అత్యంత ప్రీతి పాత్రములైనవి. వాల్మీకి తిలక మంజరులపట్ల తుమ్మెదల ప్రగాఢానురాగమును అభివర్ణించి యున్నాడు.[1] భ్రమరోపేతమైన తిలకస్తబకమును కాళిదాసు నీలిముంగురులకు వ్రేలాడు ముత్యాల మాలగా పోల్చెను.[1] సుందరీమణుల చూపులను ధవళములుగను నీలములుగను వర్ణించుట కవుల పరిపాటి. ధవళములైన చూపులచే తెల్లనిపూలు కుసుమించునని వ్యంగ్యముగా చెప్పుటలో ఔచిత్యము కనిపించుచున్నది. స్త్రీల చూపులు తుమ్మెదలవలె నల్లనివనియు చెప్పుట ప్రసిద్ధము. తుమ్మెదలవంటి చూపులు తిలకములపై వ్రాలుననుటలో కూడ ఔచిత్యమున్నది.

ఈ కవిసమయమును ఆధారముగా చేసికొనియే రాజనిఘంటు కర్త "తరుణీ కటాక్ష కామీ" అను పర్యాయ పదమును తిలకమునకు సూచించి యుండవచ్చును.[2] ఇతః పూర్వమే పేర్కొన్న రాజశేఖరుని శ్లోకము "నాలింగితః......ప్రసవావకీర్ణమ్" దీనికిని ఉదాహృతి.

1. రామాయణము 1-4-48.
1. రఘువంశము 9-41.
2. రాజ నిఘంటువు - కరవీరాది వర్గము - 48

**మందారము స్త్రీల నర్మవాక్యములచేత పుష్పించుట :**

అమరకోశము మందార శబ్దమునకు - మదంతి - మోదంతే - అనేనేతి మందారః - దీనిచేత సంతోషింతురు. మదిస్తుతి మోదమద స్వప్న కాంతిగతిషు మంద్యతేస్తూ యత ఇతివా - స్తోత్రము చేయబడినది, అనువ్యుత్పత్తులు చూపు చున్నది. రమణుల నర్మవాక్యములు సంతోషింపజేయునవి కదా ! మందార వృక్ష శబ్దము పుంలింగము. కనుక పురుషత్వారోపణము, స్త్రీ నర్మవాక్యము లకు పురుషుని మేను పులకించుట అనుభవసిద్ధము ఈ పులకింతయే పుష్పించుట అని సరిపెట్టుకొన్నచో వ్యంగ్యముగా స్త్రీ పురుష ప్రణయపరముగా ఈ కవి సమయముద్భవించి యుండుననుటకు కించిత్ హేతువును కల్పించుకొన వచ్చును.

"స్త్రీణాం స్పర్శాత్ప్రియంగుర్వికసం...... నర్తనాత్ కర్ణికారః" అని మల్లినాథుడు ఉత్తర మేఘమునందు 'రక్తాశోకః'అను శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు పేర్కొన్న శ్లోకము దీనికి ఉదాహరణము.

**చంపకము రమణుల మృదుహాసముచేత కుసుమించుట :**

విరబూచిన సంపెంగ సౌరభములను గుబాళించు రమణీమణి ప్రఫుల్ల హాసమును స్ఫురింపజేయునను వ్యంగ్యార్థమును ప్రతిపాదించుటకు ఈ కవి సమయమేర్పడి యుండవచ్చును. ఉత్తమజాతి వనితల నిశ్వాసము పరిమళవంత మనుటకు కామశాస్త్రమాధారము. ఇక చంపకగంధులు హసించునపుడు ఎదుటనున్న సంపెంగ తరువులు నవ్వక ఊరకుండునా ? అదియును కవితా ప్రపంచమున. ఇనంతయు కవితాకేళి. మల్లినాథుని మేఘసందేశ వ్యాఖ్యానము నందు "స్త్రీణాంస్పర్శాతి" అను శ్లోకము తార్కాణము.

**రమణుల ముఖానిలముచే మామిడి పుష్పించుట :**

ఈ కవిసమయమునకు లక్ష్యములు కావ్యజాలమున చాల తక్కువగా ఉన్నవి. అయినను దీని మూలమునరయుట అంత కష్టముకాదు. సుందరీమణుల ముఖానిలవాసన మామిడి పూలగుత్తుల సువాసనతో పోలియుండునను లేక పోలియుండవలెనను ఆదర్శ వాంఛయే ఇందు గమ్యమానమగుచున్నది. మనస్వినుల హృదయములను కూడ విచలితము చేయజాలు ఆమ్ర వృక్షవాయు వులను కాళిదాసు వర్ణించినాడు.[1]

---

1. "అకంపితాని హృదయాని మనస్వినీనాం
వాతైః ప్రఫుల్ల సహకార కృతాధివాసైః" —ఋతు సంహారము - 6-34.

## రమణుల సంగీతముచే నమేరువు కుసుమించుట :

నమేరువులనగా సురపొన్నలు. వీనికి దేవవల్లభములని మరొక పేరున్నది. దేవతలకు ప్రియమ్మునైనవి కనుక దేవవల్లభములని అమరము చెప్పుచున్నది. దేవగణములలో కిన్నరులు కింపురుషులు గంధర్వులు విద్యాధరులు మున్నగువారు గానకళాకోవిదులనియును గానప్రియులనియును ప్రతీతి. గంధర్వాంగనల గానమునకు ఈ నమేరువు పులకించి, పుష్పించి యుండవచ్చునను ఊహాకు అవకాశమున్నది. గంధర్వాంగనలను పోలు పద్మినీ జాతిస్త్రీలపట్ల కూడ వీనిని వర్తింపజేసి యుండవచ్చును ఇటీవల సస్యరక్షణకును సస్యాభివృద్ధికిని సంబంధించిన వైజ్ఞానిక పరిశోధనములనేకములు జరుగుచున్నవి. అనేకాద్భుతములును అశ్రుత పూర్వములయిన విశేషములు బయలుపడుచున్నవి. నాటికిని నేటికిని లతాగుల్మాదుల పోషణను గూర్చి అనేక విశ్వాసములు ప్రచారమునందున్నవి. కొందరు రజస్వలయిన స్త్రీలు కొన్ని రకములైన మొక్కలను తాకినచో అవి వాడి నశించునను నమ్మకము ప్రబలముగా ఉన్నది. ప్రత్యక్షముగా చూచినవారును లేకపోలేదు కొన్ని పైరులు సంగీతామృతమున ఓలలాడి అధిక ఫలితములను ఇచ్చిన ఉదంతములను ఇటీవల శాస్త్రపరిశోధకులు ప్రకటించియున్నారు. తమిళనాడు రాష్ట్రములో నాలుగేండ్ల క్రితము ఇట్టి ప్రయోగము సఫలమైనట్లు వార్తా పత్రికలలో ప్రచురితమై యుండెను. ఈ విధమైన ప్రభావము సంగీతమునకున్నదని తెలిసినప్పుడు నమేరువు మున్నగు వృక్షములు మధురగాయనులైన మగువల గానముచే పుష్పించుననుట సంభవమే కదా! కావ్యములలో దీనికి లక్ష్యములు అంతగా లేవు పూర్వోక్తములైన మల్లినాథుని "స్త్రీణాం...కర్ణకారః" అను శ్లోకము ఉదాహృతి.

## ప్రియంగు వృక్షములు రమణుల స్పర్శచేత పుష్పించుట :

ప్రియంగునకు - ప్రీణాతిరోగహరణేన ప్రియంగుః - ప్రీఞ్, తర్పణే - రోగహరణముచేత సంతోష పెట్టునది అని వ్యుత్పత్తి. ప్రియంగు - చందన చర్చితలైన రమణుల కోమల స్పర్శ దాహమునకు ఔషధమని చరకుడు చెప్పియున్నాడు.[1] ప్రియంగుగంధమలదికొన్న రమణులు ప్రియంగు వృక్షములను స్పృశించునపుడు గంధ సామ్యముచేత అవి పుష్పించి యుండవచ్చునని ఊహించు

1. ప్రియంగుకాచందన దూషితానాం స్పర్శాః ప్రియాణాంచ వరాంగనానామ్
— చరక సంహిత - దాహచికిత్స.

టకు ఈ కవిసమయము అవకాశము కల్పించుచున్నది. మల్లినాథుని "స్త్రీణాం...కర్ణికారః" అను శ్లోకమే దీనికి ఉదాహృతి. ఈ శ్లోకమునందలి ప్రథమ పాదమునందే "స్పర్శాత్ ప్రియంగుణ్యకసతి" అని దీని ప్రసక్తి ఉన్నది.

**రమణులవర్తనముచే కర్ణికారములు కుసుమించుట :**

కర్ణికారములనగా కొండగోగులు. ఇవి యువతులకు కర్ణభూషణములుగా ఉపయుక్తములు కనుక కర్ణికారములు. ఈ కర్ణికారమునకు 'పరివ్యాధము' అని నామాంతరము. పరివ్యాధమనగా - వాయునా పరివిధ్యతే పరివ్యాధః - వ్యధ తాడనే - వాయువుచే కొట్టబడునది. ఈ అర్థమునుబట్టి వాయు తాడితమగుట ప్రత్యేక గుణముగా గ్రహింపవచ్చును. అంతమాత్రమున ఇతర వృక్షములు వాయు తాడితములు కావని అభిప్రాయముకాదు. దీని పుష్ప గుచ్ఛములు ఈ పద్వాయుతరంగమునకు కూడ కదలుచు ఎప్పుడును లాస్యము చేయుచున్నట్లు చూపరకు అగుపడుచుండును సహజముగా నృత్య (చలన) శీలములైన కర్ణికారములు పద్మినీ జాతిస్త్రీల నర్తనమునకు పులకించి పుష్పించియుండునను ఊహ ఈ కవిసమయమునకు ఆధారము. పద్మినీ జాతిస్త్రీల నృత్యమువలన కర్ణికార కుసుమగుళుచ్ఛముల చాంచల్యము మాత్రము ఈ కవిసమయము వ్యంజించు చున్నది. కుసుమ గాత్రల నృత్యము కుసుమముల సంచలనమువలె ఉన్నదని ఉపమాలంకారము ధ్వనించుచున్నది. "పురోన ర్తనాత్ కర్ణికారః" అను వ్యాఖ్యాగతశ్లోక పాదమునందు మల్లినాథుడు ఈ కవిసమయమును నిదర్శనముగా చూపినాడు.

సంస్కృతములో వెలువడిన సాహిత్య శాస్త్ర గ్రంథములపట్ల అత్యాదరమును ప్రదర్శించి చక్కని అభినివేశమును సంపాదించిన తెలుగు కవులు సంస్కృత కవుల అడుగుజాడలలోనే వర్ణనములు కావించిరి. తెలుగు ప్రబంధములలో కనిపించు వృక్షదోహద వర్ణనములు గీర్వాణ సాహితీ మర్యాదలను దృష్టి యందుంచుకొని చేసినట్టివే. రామరాజభూషణుడు వసుచరిత్రలో ఈ వృక్ష దోహదములకు తార్కాణముగా చెప్పదగిన ఒక పద్యము రచించియున్నాడు.

చిగురు కెంగేలు సాఁచె రసాలవల్లరి
తేఁటిచూపులఁజూచె తిలక లతిక

పికగీతిఁబాడి చూపెఁ బ్రియాళులత పల్కె
గరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తినింపె నింపుగల సంపఁగి కొమ్మ
వన్నెగా నగియె లేఁబొన్న తీఁగె
సురభిళశ్వాసనంబు వెరపె సింధుకవల్లి
గ్రుచ్చెుదావులు సోఁకఁ గ్రోవి రెమ్మ
యాత్మ రుచిరోపచారంబులధిక కల్ప
కంబునకుఁ దత్తదామోదగరిమ బెనుఁప
నంగనా నిత్యకలిత దోహద విశేష
సన్నుతాచారముల సడిసన్న కతన

—వసుచరిత్రము - ప్రథమాశ్వాసము - పద్యము 1-158

రామరాజభూషణుని వసుచరిత్రకు అనేక వ్యాఖ్యానములు వెలసినవి. వానిలో సోమనాథ కవి వ్యాఖ్యానము ప్రసిద్ధము. ఆతని వ్యాఖ్యానమునకు మఱికొన్ని అంశములు చేర్చి శ్రీ శేషాద్రి రమణ కవులు విపుల వ్యాఖ్యానమును వ్రాసి ప్రకటించినారు. ప్రథమాశ్వాసమున వృక్ష దోహదముల ప్రసక్తి వచ్చినప్పుడు వారు ఉదాహరించిన శ్లోకమునందు ఈ వృక్షదోహదములు ఈ షడ్భేదములతో కనిపించుచున్నవి.

"అశోకశ్చరణా హత్యా వకుళో ముఖసీధునా,
ఆలిఙ్గనాత్కురువక స్తిలకో వీక్షణేనచ,
కరస్పర్శేన మాకన్దో ముఖరాగేణ చమ్పకః
సల్లాపతః కర్ణికార స్సిన్దు వారోముఖానిలాత్
గీత్యా ప్రియాళుర్నితరాం నమేరు ర్హాసితే నచ"

("అనగా నశోక వృక్షము పాదతాడనము చేతను, బొగడచెట్టు మియుటచేతను నెట్టి పువ్వుల పెద్ద గోరింట యాలింగనముచేతను, దిలకవృక్షము చూచుట చేతను మామిడిచెట్టు హస్తస్పర్శముచేతను, సంపెంగ చెట్టు ముఖరాగముచేతను గొండ గోఁగుచెట్టు సల్లాపముచేతను, వావిలిచెట్టు ముఖవాయువుచేతను

ప్రేంకణపు చెట్టు గానముచేతను సురపొన్న నవ్వుటచేతను బుష్పించుచున్నవి. అనఁగా నాయావృక్షము లాయా దోహదములచేత నకాలమందును బుష్పించు చున్నవని శాస్త్ర ప్రసిద్ధము".)[1]

వృక్ష దోహదములలో ఈ భేదము కనిపించినను నేను ఇంతవరకు ప్రతి పాదించిన ఉపపత్తుఃనే వీనిని పరిశీలించుటకు చూపవలసివచ్చును.

ఈ వృక్ష దోహదములను గూర్చి నేనింతవరకు చేసిన పరిశీలనము పరిష్కారమును సూచించుటకుగాని, నిష్కర్షగా సిద్ధాంతీకరించుటకుగాని కాదు. కేవలము నా ఊహకు బలము చేకూర్చు అంశములను యథాసాధ్యముగా గ్రహించి సమాలోచించితిని.

ఈ వృక్ష దోహద కవిసమయములు అద్భుతముగా కనిపించుచు కావ్య కళా నిర్మాణమునకు దోహదమొనర్చు చున్నవే కాని శాస్త్ర మర్యాదాలంకృత ములు కాలేకపోవుచున్నవి. లోకమునందును ఇవి విదూరముగనే ఉన్నవి. అటు శాస్త్రమునకును ఇటు లోకానుభవమునకును దూరముగా ఉన్న ఈ కవి సమయము వృక్షదోహదములు కవిసమయ నిర్వచన పరిధిలోనికి వచ్చుటయే కాదు ఆనిర్వచనమునకు పెట్టని కోటగోడవలెనుండి కవిత్వము కల్పనాధీనమను యాథార్థ్యమును, వ్యంగ్యార్థము నాశ్రయించినపుడే కవిత్వము హృదయాహ్లాద మును పల్లవింపజేయునను రమణీయాభిప్రాయమును ఉద్ఘోషించుచున్నవి.

సత్యాసత్యములః నడుమనున్న యవనికను చీల్చుకొని పోగలుగునది రసచక్షువు మాత్రమే. కేవల సత్యము కవిత్వముకాదు. కేవలము అసత్యము కవిత్వము కాదు. రసదృష్టికి గోచరమగునది సత్యాసత్యములకు అతీతమైన హృదయైక వేద్యమైన ఆనందము. వృక్షదోహదములు కావ్య ప్రపంచమున ఇట్టి ఆనందమునే ప్రసరింప జేయుచున్నవనుట అత్యుక్తి కాదు. సాహసమంత కంటెను కాదు.

**యువతీయువకుల అంగములందు ముక్తాహారములుండునట్లు వర్ణించుట :**

ప్రాచీన కావ్యములలో ప్రాయికముగా నాయకులు ఉత్తమ కులజులు. వారు రాజామాత్య సైన్యాధిపత్యాదులై ఉండెడివారు. నాయికలు రాజ్ఞులు

1. వసుచరిత్రము - సవ్యాఖ్యానము - వావిళ్ల ప్రచురణ 1962 : పుట - 142.

గనో ఉత్తమ కుల సంజాతలుగనో ఉండెడివారు. వారందరును ఐశ్వర్యసంపన్నులే. మౌక్తికాదిమణులను స్వర్ణరజత నిర్మితములైన భూషణములను ధరించు చుండెడివారే.

ముక్తాహారాది భూషణములు ధరించుట కేవలము సౌందర్యమునకే కాదు సౌభాగ్య వర్ధనమునకు కూడ మీదు మిక్కిలి ముక్తాహారములు ధరించిన వారికి చల్లదనము కలుగును. మౌక్తికములు ధరించుటవలన దేహమునకు కాంతియు బుద్ధికి బలమును చేకూరును. ఆరోగ్యము కలుగును. సంతోషము కలుగును. గ్రహదోషములు శాంతించును. ఆయుర్వేదమునందు మౌక్తికము లకు విశేష ప్రాముఖ్యమున్నది.

భారతీయుల దేవతామూర్తులందరును మౌక్తిక స్వర్ణరత్న విభూషితులే. ఆభరణములు ధరించుట రసికత. అందులోను స్త్రీలు ఆభరణములు ధరించవలెనని శాస్త్రమే విధించుచున్నది. ఆభరణ రాహిత్యము అరసికతయేకాదు అమంగళ సూచకము కూడ. ఆభరణములు లేకున్నచో ఉల్లాసములేదు. ప్రోషిత భర్తృక లైననాయిక ఆభరణములు ధరించరట స్వర్ణరత్నాభరణముల మాట ఎట్లున్నను మౌక్తికాహారములు లేని నాయికా నాయకులు ప్రాచీన కావ్యము లలో శిల్పములలో అరుదు. ఆభరణములు శృంగార రసోద్దీపకములు. స్వర్ణ రత్నాదులకంటెను మౌక్తికములు వలువునకు సులభసాధ్యములుగా ఉండెడివి. శృంగార రసమునకు ఆలంబన విభావములైన యువతీ యువకులు వానిని ధరించుట సహజము. కావ్యములలోని నాయికా నాయకుల సాధారణీకరణము వలన సాధారణ యువతీ యువకులకు ముత్యాలసరాలు స్వతస్సిద్ధములై పోయినవి. యువతీ యువకుల సౌందర్య సమగ్రతకు ముత్యాలహారములు అనివార్యములైనవి. కనుకనే వారికి అవి ఉన్నను లేకున్నను ఉన్నట్లుగనే వర్ణించుట కవి సంప్రదాయమై పోయినది. ఆధునికకాలమున కావ్యములలోని పాత్ర వస్తు వైవిధ్యమువలన ఈ కవిసమయమున కంతగా ప్రాచుర్యము లేదు.

**వియోగతాపముచే గుండెలు వ్రయ్యలగువట్లు వర్ణించుట :**

అమూర్తములైన పదార్థములను కన్నులకు కట్టినట్లుగా రూపకల్పనచేసి చెప్పుట కవితా వ్యాపారము. హృదయము అమూర్తము. శరీరమునందలి గుండెకాయకును ఈ మన హృదయమునకును సంబంధములేదు. ఇది మనస్సు.

గుండె వ్రయ్యలగుట అనగా గుండె అనుభాండము పగిలిపోవుట అని తాత్పర్యము. నిజమునకు హృదయము పగిలిపోదు. గుండెకాయ పగిలిపోయినచో మరణమే సంప్రాప్తమగును. ఆ గుండెకాయనే హృదయమనుకొనుట కవుల పరిపాటి వలననే గుండె పగిలి పోవునని వర్ణించుటలో ఆంతర్యమేమి? గుండె చాల సున్నితమైనది. తాపమునుగాని భారమునుగాని అది సహింపజాలదు. వియోగా వస్థలో ఉన్నప్పుడు నాయికా నాయకుల హృదయములు విరహబాధను భరింప లేవు. ఈ స్థితిలో ఒకటిగా ఉన్న భాండము తీవ్రాఘాతముచేతగాని తాపము చేతగాని పగిలి పది ముక్కలగునట్లు ఒకటిగా నున్నగుండె దుర్భర విరహ తాపమువలన పరిపరివిధములుగా చెదరిపోవును. ఈ విధముగా 'గుండెవ్రయ్య లగు' నను పదబంధము గుండె ఒక భాండమని సూచించుచున్నది. గుండెలు వ్రయ్యలగునను భావమును తెలుపు పదబంధములన్ని భాషలయందును చోటు చేసికొన్నవి. ఇది విశ్వవ్యాప్తమైన కవిసమయము. నిజమునకిది కవులే సృష్టించినట్టిది. కవిసమయ నిర్వచనమునకిది గంగోత్రి వంటిది. గుండె చెదరి పోవుట, గుండె పగులుట, గుండె చెక్కలగుట వంటి పదబంధముల రూపములో ఈ కవిసమయము బహుధా ప్రాచుర్యమునందుకొన్నది.

లోకములో పగిలి ముక్కలైన గుండెను ఎవ్వడును చూడలేదు. ముక్కలైన గుండె ఉన్న మనిషి సజీవుడని ఏ వైద్యశాస్త్రమును ఒప్పుకొనక లేదు. లోకమునందులేనిది శాస్త్రాధారములేనిదియైన ఈ అంశము కవి సంప్రదాయవశమున సాహిత్యములోనికి ప్రవేశించి కవిసమయ సంకేతమును సంపాదించుకొన్నది. ఇది కేవలము కవిసమయమే అయినను ప్రజల దైనందిన వాగ్వ్యాపారమున ప్రముఖ స్థానమును ఆక్రమించి కవిసమయములు భాషా నిర్మాణమునకు ఎట్లు తోడ్పడుచున్నవో నిరూపించుచున్నది. ఈ కవిసమయము నకు లక్ష్యప్రాయముకాని విరహవర్ణనముకాని హృదయ వర్ణనముగాని ఏ సాహిత్యమునందును లేదనుట సాహసోక్తికాదని నా ప్రత్యయము.

**మన్మథుని ధనుర్గుణములను భ్రమర పంక్తిగా వర్ణించుట :**

మన్మథుని బాణములు పూవులైనప్పుడు ఆ పువ్వులను ఆశ్రయించుకొని పరిభ్రమించెడు భ్రమరముల పంక్తి అతని చాపమునకు అల్లెత్రాడని ఈ కవి సమయ తాత్పర్యము. తుమ్మెదల ఝుంకారములు మన్మథుని ధనుష్టంకార ధ్వనులుగా వ్యంజింపబడినవి. ఈ వ్యంగ్య కథనకారణమును ధనుర్గుణము

భ్రమర పంక్తి అయినది. వ్యంగ్యార్థ బోధనము ఒకే మూసలో పోసినట్లుగా సాగిపోయినచో కవిసమయముగా పరిణమించును. శృంగారమునకు ఆలంబన విభావమైన కాంతా వేణీబంధమును, కనుబొమలను, కటాక్షములను భృంగావళితో ఉపమింతురు. దీనివలన శృంగారాధిదేవతయైన మన్మథునికిని వీనికినిగల సంబంధము స్పష్టమగుచున్నది.

కాళిదాసు మన్మథుని యోధునిగా చిత్రించుచు ఆతని భ్రమరశ్రేణి రూపమైన అల్లెత్రాడును ఉల్లేఖించినాడు.[1] రాజశేఖరుడు కూడ భ్రమర పంక్తిని ఉల్లేఖించినాడు.[2]

ఆలంకారికులలో ఒక్క విశ్వనాథుడే ఈ కవిసమయమును పేర్కొనినాడు.

**మన్మథుని చాపబాణములను పుష్పములుగా వర్ణించుట :**

మన్మథునకు పుష్పధన్వి, పుష్పబాణుడు అను పేర్లు కూడ ఉన్నవి. ఆతని ధనుర్బాణములను కుసుమములుగా వర్ణించుటకు ఇదే కారణము. శివుడు మన్మథుని భస్మమొనర్చినపుడు మన్మథుని మణిఖచితమైన ధనువు ఐదు ఖండములై భూమండలముపై పడెను. రుక్మవిభూషితపృష్ఠములుగల ఆతని చాపము యొక్క ముష్టిబంధము చంపకమై జన్మించినది. వజ్రనిర్మితమైన నాహస్థానము వకుళ పుష్పముగాను ఇంద్రనీల శోభితమైన ఆ చాపము యొక్క కోటిభాగము పాటల పుష్పముగాను, చంద్రకాంతమణి ప్రభావిలసితమైన నాహాముష్టి బంధముల నడుమనున్న భాగము జాతికుసుమముగాను, ముష్టిబంధమునకు మీదుగాను కోటికి క్రిందుగాను ఉన్నభాగము మల్లీకుసుమముగా జన్మించెను. అప్పటినుండి కామునిధనువు పుష్పధనువైనదని పురాణగాథ.[3] మన్మథుని పంచ బాణములను గూర్చి వివిధాభిప్రాయములు ఉన్నవి. ఆతని ఐదు పూలబాణములు - అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము. ఈ అయిదు బాణములను కొందరు మానసిక ప్రభావములుగా ఊహించిరి. అవి ఇవి—

---

1. "ప్రఫుల్ల చూతాంకుర తీక్ష్ణసాయకో ద్విరేఫమాలా విలసద్ధనుర్గుణః
మనాంసి భేత్తుం సురత ప్రసంగినాం వసంత యోద్ధా సము పగతః ప్రియే"
—ఋతుసంహారము.

2. "ధనుర్మాలా మార్వీక్వణ మలికులం" —కావ్యమీమాంస - 11వ అధ్యాయము.

3. పండిత హజారీప్రసాద్ ద్వివేది - విద్యాపీఠ పత్రిక - ఆషాఢ విక్రమశకము 1993. (క్రీ.శ. 1936)

1. ద్రావణ, శోషణ, తాపన, మోహన, ఉన్మాదములు.[1]
2. సమ్మోహన, ఉన్మాదన, శోషణ, తాపన, స్తంభనములు.[2]
3. సమ్మోహన, సముద్వేగ, బీజస్తంభన, ఉన్మాద, జ్వలనములు.[3]

మూడు విభాగములలో విడివిడిగా సూచించిన మానసిక ప్రభావములకు విశేష భేదమేమియును లేదు.

మరొక మతము ననుసరించి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచజ్ఞానేంద్రియ విషయములే మన్మథుని ఐదు బాణములు.

మన్మథునికిని వసంతునికిని విడదీయరాని స్నేహబంధమున్నది. వసంత వాతావరణము కామభావమునకు సహజోద్దీపకము. వసంతకాలమందు వనోపవనములలో ప్రకృతి సౌందర్యము వెల్లివిరియును. బహువిధకుసుమములు ప్రవృత్తి శోభా సూచకములు పువ్వుల వన్నెల చిన్నెల కంటె వాని వాసనలే మత్తెక్కించును ఈ మత్తెక్కించు స్వభావమును దృష్టి యందుంచుకొనియే పువ్వులు కాముని ధనుర్బాణములుగా నుత్ప్రేక్షింపబడినవి. కావ్యమీమాంసలో వసంతవర్ణన సందర్భమున మన్మథుడు నవప్రసూనములతో తన ధనుర్యష్టిని నిర్మించుకొనెనని ఉన్నది.[4]

జయదేవుడు రాధ కంఠమాలలోని కుసుమములను బాణములనెను.[5] చేమకూర వెంకటకవి విజయవిలాసమునందు పుష్పలావికలు "కాయజుతూపులమ్ముదురు" అని అభివర్ణించినాడు.[6]

మన్మథుని ధనుర్బాణములను పువ్వులనుటలోని ఔచిత్యమును పరిశీలించవలసి యున్నది. ప్రసూనము పుష్పమునకు పర్యాయవాచకము. ప్రసూయత ఇతి ప్రసూనమ్ షూఙ్ ప్రాణి ప్రసవే - పుట్టునది. శృంగారము ప్రజనన

---

1, 2, 3 : అమరకోశము.

4. "స్మరోవసంతేఽత్ర నవప్రసూనైః స్వచాప యష్టేర్ఘటనాం కరోతి"

—కావ్యమీమాంస అధ్యాయము - 18.

5. "కుసుమ సుకుమారతనమతను శర లీలయా
స్రగపి హృది హంతి మమాపి విషయశీలయా" —గీత గోవిందము - 7.

6. ప్రథమాశ్వాసము - పద్యము - 79.

హేతువు. ప్రసూనము ప్రజననమును సూచించుచున్నది. కనుక, శృంగార రసోద్భవమునకు పువ్వులు సాధనములగుట ఈ యంశమును బలపరచుచున్నది.

శృంగార రసవ్యాపారమునకు స్త్రీలు పట్టుగొమ్మలు. ఆలంబనవిభావములు. మరి ఆ స్త్రీలు కుసుమకోమలులు. కుసుమగంధులు. కుసుమగాత్రలు, కుసుమాంతరంగలు, కుసుమ సంబంధములైన గుణములుండుటవలననే మన్మథుని ధనుర్గుణములు పువ్వులైనవి. అతడు కుసుమాయుధుడైనాడు. ఈ కుసుమాయుధత్వము ఎంతవరకు పోయినదనగా స్త్రీయే మన్మథుని ఆరవబాణమైనది.

**కామబాణములచేతను నారీకటాక్షములచేతను యువప్రేమికుల హృదయములు విదీర్ణములగునట్లు వర్ణించుట :**

బాణమునకు అజిహ్మగమనియు విశిఖ యనియు పర్యాయ పదములున్నవి. అజిహ్మగము అనగా - అటహ్మాం గచ్ఛతీతి అజిహ్మాః చక్కగా పోవునది. విశిఖ అనగా విశన్ ఖనతీతివా విశిఖః - ప్రవేశించుచు ప్రక్కలించునది. నారీ కటాక్షములను బాణములతో పోల్చుట సాధారణము. సూటిగాపోయి గ్రుచ్చి కొనుట, గ్రుచ్చికొని చీల్చుట బాణగుణము. ఈ గుణములు ఉపమానములై కటాక్షములకు సంక్రమించునని వేరుగా చెప్పనక్కరలేదు. సాధర్మ్యము ఇందు గర్భితమై ఉన్నది. ఇది ప్రణయ వ్యాపారమునకు సంబంధించిన కవిసమయము. ప్రేమికుల హృదయములు చీలిపోవుట అనగా గాయపడుట. ఈ గాయముల వలన కలిగినబాధలు అత్యంత మధురములు, ప్రణయ సంవర్ధకములు, చీల్చిన బాణము కనిపింపదు. గాయపడిన ఎదలు కనిపించవు. వీని ప్రయోక్త పుష్ప బాణుడును కనిపింపడు. నారీకటాక్షము ప్రేమికుని హృదయమును విదీర్ణము చేయునన్నచో శారీరకతత్త్వము జీర్ణించుకొన్న శాస్త్రజ్ఞుడు దీనిని పూర్వపక్షము చేసియే వదులును. కవిసమయ మర్యాద అట్టిది. అది లోక శాస్త్రములకు అతీతమైనట్టిది. అవిచారరమణీయమైనది.

**మాసాంతరములందు కూడ పుష్పములుండునట్లు వర్ణించుట :**

తరులతా గుల్మాదులన్నియును ఎల్ల ఋతువులలో కుసుమింపవు. కొన్ని ఋతువులలో కొన్ని కొన్ని కుసుమములు పూచినను వసంతర్తువు మాత్రము పూలకారుగా ప్రసిద్ధినందినది. వసంతమునందు పుష్పవికాసమును వర్ణించుట కవిసంప్రదాయసిద్ధము. కాని పుష్పములు సౌందర్యమునకును మన్మథ

ప్రభావమునకును పరిమళమునకును సుభిక్షమునకు మనోవికాసమునకును చిహ్నములు. అవి మంగళ ద్రవ్యములు కూడ. పద్మ పారిజాతములు దేవతాత్వ మును సంతరించుకొన్న పవిత్ర ప్రసూన రాజములు. అలంకార విశేషములుగా ప్రజల దైనందిన జీవితమునందు అతిమాత్రముగా ప్రాచుర్యమును పొందినవి. సౌకుమార్యమునకు కుసుమము ప్రతీక. సౌందర్య సృష్టికి అత్యంతావశ్యకము లైన సాధనములుగా కవులకే కాదు లోకమునకే పరిచితములు. ఆయా కాలములలో తమకు ప్రియమైన పూవులు లేకున్నను వర్ణించినచో అది కావ్య శోభాహేతువుగా ఉండునే కాని దోషము కాదు. రూపకముల ప్రస్తావనలలో నటీసూత్రధారుల సరససల్లాపములలో రూపకమునందలి రసము శృంగారమైనచో వసంతర్తువును వర్ణింపవలయునని నియమమున్నది పుష్పోద్గమము శృంగార రససూచకమని దీని సారాంశము.

కవి హృదయమునకు వాస్తవజగత్తుతో సంబంధముండియు ఉండునట్లుం డును. శ్రీ గుడిపాటి వెంకటచలంగారు "కవి హృదయమంటేనే విషయాన్ని Out of Proportion గా చూడడమనుకుంటాను" అని అభిప్రాయ పడినారు.[1]

ఈ కవిసమయము సౌందర్య సమగ్రతకు తద్వారా కావ్య రసానందాను భూతికి పోషక మగుననుటలో విప్రతిపత్తి ఉండకూడదు. కేశవమిశ్రుడు దీనిని కవిసమయముగా తన అలంకార శేఖరమున పేర్కొనెను [2] ఉద్యాన వర్ణనము వికస్వరకుసుమ శోభలేనిదే రాణింపదు. కనుక ఆయా పూవులు పూచెడి కాలముల ప్రసక్తి లేకుండగనే కవులు ఎల్లవేళలందు కుసుమోద్గమ వర్ణనము చేయుట కావ్యములందు సర్వసాధారణమైన అంశము. దీనికి లక్ష్యములు అనేకములు. అనివార్యమైన పుష్పవికాస వర్ణనమునకు ఉదాహృతులను చూపనవసరము లేదనుకొందును.

## వర్షాకాలమున హంసలు మానస సరస్సునకు పోవునట్లు వర్ణించుట

భారతీయ సంస్కృతిసాహిత్యములలో హంసకున్న స్థానము అతి ప్రధానమైనది. ఉత్కృష్ట సౌందర్యమునకును శుచిత్వమునకును ఇది చిహ్నమై ఆధ్యాత్మికాంశములకెన్నింటినో సూచకమై ఉన్నది. దర్శనములలో హంస

1. మ్యూజింగ్సు - సంపుటము - 3. పుట - 293. దేశి కవితా మండలి విజయవాడ 1957.
2. అనుబంధము-1

ఆత్మకు ప్రతీక. ఆధ్యాత్మిక తత్త్వవేత్తను 'హంస' అనుట కలదు. జీవన్ముక్తుడు పరమ హంస అనబడును. వాణీ బ్రహ్మలకు హంసయే వాహనము. ప్రాచీన గాథలలో ప్రణయ సందేశ వాహకముగా దీనికి ప్రసిద్ధి ఉన్నది. కథలలోనేగాక వేద పురాణేతిహాసములలో హంస ప్రసక్తి ఉన్నది. ప్రాచీన సాహిత్యములో ఉన్న హంస కేవలము కల్పనాజనితమైన పక్షి అనియును భూమిపై కనిపించలేదనియును కొందరివాదము కాని సత్యదేవ పరివ్రాజక స్వాములవారు[1], ప్రణవానంద స్వాములవారు[2] హిమాలయము నందలి కైలాస శిఖరమును, మానస సరోవరమును దర్శించి తాము మానస సరోవరమును దర్శించి తాము మానస సరోవరమునందు మధురనాదములు సేయుచున్న ధవళములైన హంసముల గుంపుల నెన్నింటినో చూచినట్లు పేర్కొనియున్నారు.

అమరకోశ - రాజ - నిఘంటువులు రాజ హంసలకు తెల్లని శరీరము, ఎఱ్ఱని చంచువు ఎఱ్ఱని కాళ్లుండునని తెలుపుచున్నవి. స్వచ్ఛ జలములు హంసలకు ప్రీతిపాత్రములు. కమలతంతువులు వానికి ఆహారము. హంసలు చేపలనుగాని జలగలనుగాని మరి ఇతర కీటకములనుగాని తినవని టిబెట్టు దేశస్థులు చెప్పుచుందురు. అందుకే వానిని వారు పవిత్రమైనవిగా భావించి తినరట. మానస సరోవరములో ఎఱ్ఱని చంచువులు ఎఱ్ఱని పాదములు తెల్లని ఈకలతో తిరుగాడే పక్షులే హంసలని శ్రీప్రణవానందుల కథనము.

హిమాలయ శిఖరమునకు అవతల మానస సరోవరమున్నది. దాని పరిధి డెబ్బది మైళ్లు. సత్యదేవ పరివ్రాజకులవారు ఆ సరస్సు పర్వత పంక్తులతో ఆవరింపబడి హిమశిఖరాలు ప్రతిబింబించుచున్న స్వచ్ఛ నీల జలములతో అత్యంత రమణీయముగా ఉండునని తెలిపినారు. వైశాల్యమువలనను స్వచ్ఛతా సౌందర్యములవలనను ఇది ప్రపంచ సరస్సులలో అద్వితీయమైనది. దీనికి బ్రహ్మ సరస్సనియు పేరు. భారతీయుల ధార్మిక జీవనమునందు ఈ సరస్సునకు అత్యధిక ప్రాధాన్యమున్నది. కైలాసము దీనికి ఉత్తరమున ఉన్నది. అందువలన కైలాస శిఖరమానస సరోవరములు ఒకదానివెంట నొకటి పేర్కొనబడును.

---

1. మేరీ కైలాస్ యాత్ర - హిందీమూలము, సత్యదేవ పరివ్రాజకులు - పుటలు-106-107
2. కైలాస్ మానస సరోవర్— ,, ,, ప్రణవానందస్వాములు - పుటలు - 78 - 79.

బ్రహ్మ మనఃపూర్వకముగా దీనిని సృజియించుటచేత ఇది బ్రహ్మ సరోవర మయ్యెను. గంగకు ఇదే ఉదయస్థానమని పలువురు నమ్ముచుందురు.

మానస సరోవరమే హంసల నివాసస్థానమని పురాణ ప్రసిద్ధి. శీత కాలమున మధ్య ఆసియా, టిబెట్టు, హిమాలయము, కాశ్మీరు, హిందూకుష్ పర్వత ప్రాంతములలో విజృంభించు చలికి తట్టుకొనలేక ఈ హంసలు దక్షిణ దిశకు పయనించి, గంగా యమునా సింధునదీ తీరములలోను, ఉత్తరభారతము నందలి సరస్తీరములందును కాలముగడిపి వర్షాకాలారంభముతో ఈ జలాశయ ముల నీరు మలినముకాగా ఇవి తిరిగి ఉత్తర పశ్చిమ దిశలకు ఎగిరిపోవును. మానస సరోవరమునకు దారి అదే కనుక అక్కడికే ఇవి వెడలుచున్నవను కవిసమయము ఏర్పడి యుండవచ్చును. నిజమునకు మానస సరోవరము వానికి నివాసము కాదు. ఆయా ఋతువుల ప్రభావమునకును ఉన్న పురాణ ప్రసిద్ధ మైన సంబంధమును పురస్కరించుకొని అవి మానస సరోవరమునకు పోవు చున్నట్లే ఊహించి పరంపరాయాతముగా వర్ణింపబడుటచేత ఈ హంసల పయనము కవిసమయమైనది. ఆయా ఋతువుల ప్రభావమువలన పశు పక్ష్యాదుల గతులలో కలుగు మార్పు అనుభవసిద్ధము. శాస్త్ర సంబద్ధము. కనుక ఈ హంసల పయనమునకు సంబంధించిన ఊహ పైకి సత్యముగా కనిపించి నను యథార్థముగా కవిసమయ నిర్వచనమునకు మిక్కిలి సమీపముగా ఉన్నది.

# కవి సమయములు

## తృతీయ ప్రకరణము

### ద్వితీయ భాగము

**సత్తమ విబంధింపకుండుట.**

కల్పనాధీనమైన కవితా ప్రపంచమునందు సౌందర్య సృష్టికొరకు పదార్థములందులేని గుణములను ఆపాదించుటకు కవి ప్రయత్నించును. అదే విధముగా తన సౌందర్య సృష్టికి సంబాధకములుగా తోచు వాస్తవాంశములు ఏవేని ఉన్నచో వానిని నిరాకరించుటకు ఆతడు సందేహింపడు. ఈ ప్రయత్నములో ఎన్నియో సత్యాంశములు మరుగున పడిపోయి అప్రధానము లగుచుండును. కొన్ని యథార్థాంశములు రస విహీనములుగా ఉండవచ్చును ఆదర్శాత్మకముగా ఉండకపోవచ్చును. జుగుప్సాహేతువులుగా ఉండవచ్చును. కనుక వానిని గ్రహించుటలో వర్ణించుటలో కవులు నిగ్రహమును ప్రదర్శించిరి. ఈ నిగ్రహ ప్రదర్శనమే సతోఽప్య నిబంధనమునకు అనగా ఉన్నను లేదని వర్ణించుటకు దారి తీసినది. రాజశేఖరుని కవిసమయ నిర్వచనములో 'అశాస్త్రీయమ్' అను సంకేతమునకు ఈ సతోఽప్య నిబంధనము ప్రబలోపస్కారక మగుచున్నది.

నిజమునకు కవి ప్రకృతి సౌందర్యమునకు తన్మయుడగుచునే ఆ ప్రకృతికి అతీతమైన, ఆ ప్రకృతికంటె భిన్నమైన సృష్టి చేయుటకు ప్రయత్నించును అట్టి సృష్టియే కళ అనిపించుకొనును. కళ అను మాటకు **Art** అను ఇంగ్లీషు పదము సమానార్థకము. **Ars** అను గ్రీకు పదమునకు **Art** అను పదము తద్భవము. **Ars** అనగా కృత్రిమము. ప్రకృతి కానిది. ప్రకృతి అనగా నిసర్గము, సహజము, కళా ప్రకృతులు పరస్పర విరుద్ధములని చెప్పవచ్చును. ఆర్థర్ డెవింగ్ అను ఆంగ్ల విమర్శకుడు—

"Art begins where the artirt departs from thc strict imitation of nature He imposes upon her a rhythen of his own creation according to his own sense of fitness-"[1] అని అభిప్రాయ పడినాడు. ప్రకృతిని ఉన్నది ఉన్నట్లుగా అనుకరించుటను నిరాకరించుటతో కళా సృష్టి ప్రారంభమగుననియును డేవింగ్ హృదయము. ఇట్టి స్థితిలో అశాస్త్రీయత, అలౌకికత తమ ప్రభావమును చూపియే తీరును. కవి దృష్టి వేరు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు - "కావ్యమునగాని, చిత్రపటమున గాని మనము చూచు జగత్తు శిల్పియొక్క దివ్యదృష్టికి గోచరించినదేకాని మన కంటికి కానవచ్చు జగత్తు కాదు-"[2] అని కవి దృష్టి వైలక్షణ్యమును నిరూపించి యుండిరి. తనకును లోకమునకును కనిపించుచున్న యథార్థ్యమును త్రోసి రాజని. తనదైన ఒక వింత ప్రకృతిని సృష్టించుకొన్నను, లోకము ఆ వింతలోని మాధుర్యమును, ఔచిత్యమును సమాదరించి ఆ కళాస్రష్ట ఊహాలోకమును నమ్మి అతని ప్రతిభకు మ్రొక్కి తరతరములుగా ఆతని అభిప్రాయములకు, అతని వర్ణనములను ప్రాచుర్యము కలిగించినది. ఊహకు ప్రాచుర్యము కలుగుట అనగా కవిసమయముగా మారుట అనియే తాత్పర్యము. ఇట ఊహ అనగా లోకశాస్త్రమర్యాదలకు అతీతమైన భావము.

ఇక సత్తును నిబంధింపకుండుటను సూచించు కవిసమయములను ఒక్కొక్కటిగా వేర్కొని వాని సామంజస్యమును వివరింతును.

**వసంతమునందు మాలతీలత కుసుమించవట్లు వర్ణించుట :**

మాలతి అన్నను జాతి అన్నను జాజిపువ్వే. నిజమునకు ఈ పువ్వు వసంతమునందే పుష్పించును. వాల్మీకి రామాయణమున వసంతవర్ణన సందర్భమున మాలతి పూచినట్లు వర్ణనమున్నది.[1] శరద్వర్ష ఋతువులయందును, మాలతి పూచినట్లు వాల్మీకి కాళిదాసాదికవులు వర్ణించినారు.[2] యథార్థము నకు మాలతి వానకాలములో రెండుమార్లు, వసంతమునందును శరత్తునందును ఒకసారి పూచును. శరద్వర్షర్తువులలో వసంతమునందుకంటె ఇవి సంపూర్ణ

1. సాహిత్య శిల్ప సమీక్ష-పింగళి లక్ష్మీకాంతము-పుట 86.
2. ,, ,, ,, ,, పుట-38.

1. "వంపాశీరరుహాశ్చేయే సంసక్తా మధుగంధినః
మాలతీ మల్లికాషండాః కరవీరాశ్చపుష్పితాః"—రామాయణమ్ 4-1-78.
2. రామాయణము 4_28_52.
ఋతుసంహారము 2_44.

వికసనముతో పరిమళములను గుబాళించుచు సంపూర్ణ సౌందర్య నిధానములై అలరారుచుండును. వసంతమునందు సౌందర్య హీనములుగా ఉండుటచే అవి దర్శనీయములు కావను అభిప్రాయముతో వానిని వర్ణింప కూడదను భావమునకు ప్రాచుర్యము కలిగియుండవచ్చును.

మాలతి పుష్పింపకున్నను వసంత రామణీయతకు లోటులేదనుభావమునకు ఈ శ్లోకము ఉదాహరణము.

"అస్మిన్ కేలివనే సుగంధ పవనే క్రీడాత్పురంధ్రీజనే
గుంజద్భృంగ కులే విశాలబకులే కూజత్పికీ సంకులే
ఉన్మీలన్నవపాటలా పరిమలే మల్లీ ప్రసూనాకులే
యద్యేవాపి న మాలతీ వికసితా తత్కింన రమ్యోమధుః"
—సుభాషిత రత్న భాండాగారము 250-88

**చందన ద్రుమములకు ఫల పుష్పములుండువట్లు వర్ణింపకుండుట :**

చందనద్రుమముల కలప సువాసనా శోభితము. కలప తప్ప ఫల పుష్పాది భాగము లెవ్వియును పరిమళ వంతములు కావు. వసంత గ్రీష్మర్తువులలో ఇవి పుష్పించును. ఆ పూలు ముందుగా పలుచని వర్ణముకలిగి తర్వాత వంకాయ రంగుతో ఒప్పుచు చిన్న చిన్నవిగా ఉండును. వీని ఫలములు వట్రువులై నున్నగా ఉండును. పండినపిదప అవి నల్లబడును. కాని ఆ పూలలోగాని పండ్లలోగాని వాసనలు ఉండని కారణమున నిష్ప్రయోజకములనియే చెప్పవచ్చును. ఇట్లు నిష్ప్రయోజకములయిన ఫల పుష్పములకు విలువ ఉండదు. ఏదేని ఒక శ్రేష్ఠ వస్తువును వర్ణింపవలసి వచ్చినప్పుడు దానిలోని అశ్రేష్ఠ భాగమును లెక్కలోనికి తీసికొనకపోవుటలోనే సామంజస్యమున్నది. సౌందర్యమున్నది. ఈ దృష్టితోనే చందన ద్రుమములకు ఫల పుష్పములున్నను వర్ణింపకుండుట జరిగియుండవచ్చును. చందన ఫల పుష్పములకు ఔషధ సంబంధమైన ప్రాముఖ్యముండవచ్చును. ఇటు సౌందర్య దృష్టియే - రసిక దృష్టియే ప్రధానము కనుక ఆ చర్చ ఇట అనావశ్యకము, దీనికి ఉదాహరణముగా రాజశేఖరుడు—

"యద్యపి చందన విటపి విధినా ఫలకుసుమ వర్జితో విహితః
నిజవపుషైవ పరేషాం తథాం సంతాపమాహరతి"

అను శ్లోకమును కావ్యమీమాంసలో ఉదాహరించెను.

(బ్రహ్మ చందన వృక్షములను ఫల పుష్పములు లేనివానిగా చేసినను అవి తమ శరీరములతోనే పరుల దుఃఖమును పోగొట్ట జాలుచున్నవి.)

**కుందకుట్మములకు రక్తత్వము చెప్పకుండుట :**

కుందముల మొగ్గలు తెల్లగా ఉండవు. అవి మూలమునుండి రెక్కల వరకు ఎర్రగనే ఉండి పూర్తిగా విరియగనే తెల్లనగును. సుందర దంతములను కుందకుట్మలములతో పోల్చుట కవి సంప్రదాయము. ఈ సాదృశ్యమునందు మొగ్గల ఆకారమునే గ్రహింపవలెను కాని వర్ణమును కాదు. ఒకవేళ వర్ణమును కూడ తీసికొన్నచో దంతములు తెల్లగానుండునను యాథార్థ్యమునకు కవి వర్ణనా సంప్రదాయమునకు విఘాత మేర్పడును. ఇంతియకాదు దంతములు తెల్లగా నుండవలయునను ఆదర్శమునకు అన్యథాత్వమేర్పడును. ధవళ రదనములే సుందరములు. కమనీయములు. ఆకర్షణీయములు. అందువలన కుందకుట్మములకు రక్తత్వమున్నను దానిని వర్ణించుట కవిసమయమునకు విరుద్ధము. దీనికి ఉదాహరణముగా మాఘుని శిశుపాల వధ నుండి రాజశేఖరుడు ఒక శ్లోకమును ఎత్తి చూపెను.

"ద్యోతితాంతస్సభైః కుందకుట్మలాగ్రదంత స్మితైః
స్నపితేవాఽభవత్తస్య శుద్ధవర్ణా సరస్వతీ"

(కుంద కుట్మలములవలె ధవళ కాంతులు వెదజల్లుచు సభను దీప్తము చేయుచున్న శ్రీకృష్ణుని మందహాసమునందు స్నానమాడినందువలన సరస్వతి ధవళ వర్ణమును పొందినది.)

**అశోక వృక్షములకు ఫలములున్నట్లు వర్ణింపకుండుట :**

పచ్చ పచ్చని ఆకులతో, ఎర్రనెర్రని చివుళ్లతో ఎర్రని పూలతో దర్శనీయముగా నుండు అశోకమునకు ఫలములు కూడ ఉండును. కాని ఆ ఫలములు నల్లగా వెనరిగింజంత చిన్నవిగా ఉండును. వీనికి రుచిగాని వాసనగాని లేక పోవుట అటుంచి అందముకూడ అంతంత మాత్రమే ఉండును. అందుచే ఇవి మిక్కిలి నిరుపయోగములై హేయముగా కనిపించును. సుందరములైన పూల గుత్తులతో చివుళ్లతో అలలవలె వంకరలు తిరిగిన ఆకులతో కలకలలాడు అశోక వృక్ష సౌందర్యమునకు దాని ఫలములు కళంకములుగా కనబడునని కాబోలు

కవులు అశోక ద్రుమమునకు ఫలములున్నను వాని వర్ణనమును నిషేధించు కొన్నారు. అంతటితో ఊరుకొనక దాని అందమునకు తులదూగు ఫలములు లేకపోయెనే అని పరిపరివిధముల వాపోయినారు.

రుచ్యములును కోమలములును అయిన ఫలములను ప్రయాణ పీడితుడైన పాంథునకు అశోకమీయలేకపోయెనని భోజుడు దానిని వర్ణించినాడు.

"కింతే నమ్రతయా కిమున్న తతయా కింవాఘనచ్ఛాయయా
కింవా పల్లవ లీలయా కిమనయా వాశోక పుష్పశ్రియా
యత్వన్మూల నిషణ్ణ ఖిన్నపథిక స్తోమః స్తువన్నన్వహం
నస్వాదూని మృదూని ఖాదతి ఫలాన్యుత్కంఠ ముత్కంఠితః

**శుక్లపక్షమున చీకట్లున్నను చెప్పకుండుట:**

**కృష్ణపక్షమున వెన్నెలలున్నను చెప్పకుండుట:**

శుక్లపక్షములో చీకటియు కృష్ణ పక్షములో వెన్నెలయు ఉండుట మనకు తెలిసిన అంశమే. శుక్లపక్షములో షష్టి సప్తమివరకును రాత్రులలో ఆకసమున, చంద్రుడు ప్రకాశించినను వెన్నెలలు కాయునని చెప్పలేము కాని అష్టమి నుండి వెన్నెలలు కొంచెము చిక్కగా ఉండుటవలన వాని ఉనికిని గుర్తింతుము. కృష్ణ పక్షమున చాల దినములవరకు తెల్లవారుజామున వెన్నెలలుండును. శుక్లపక్షము లోని తొలి దినములలోను కృష్ణపక్షమునందలి చివరిదినములలోను చిక్కని చీకట్లే ఉండును.

శుక్లపక్షములో చంద్రుడు క్రమముగా అభివృద్ధి నొందుచు జనులకు విశేషానందము కల్గించును. దినదినాభ్యుదయమును సాధించుచున్న వ్యక్తివంటి వాడు చంద్రుడు. ఇక కృష్ణపక్షమునందు క్రమశః చంద్రుడు క్షీణించును. జీవితములో దినదినక్షయమును పొందుచున్న వ్యక్తి వంటివాడు ఈ పూర్ణ చంద్రుడు. లోకములో క్రమవికాసము అభినందనీయమును అభిలషణీయమును అయినట్లు. క్రమహ్రాసముకాదు, అది గర్హనీయము. అవాంఛనీయము. శుక్ల పక్షము క్రమాభ్యుదయమునకు సూచకము. ఈ సూచనము చేయు కవి చీకట్ల విషయమును ఎత్తడు చీకటి కవి సంకల్పమునకు అపకర్షాహేతువు. అదే విధముగా క్రమక్షీణతను సూచింపదలచుకున్న కవి కృష్ణపక్షమునందలి చీకట్లనే

చెప్పును కాని వెన్నెలలున్నను వాని జోలికిపోడు. ఊసైన నెత్తడు. అతని దృష్టిలో కృష్ణపక్షము పతనమునకు ప్రతీక.

శుక్లపక్ష రాత్రులలో పాడ్యమినుండి చంద్రుడు సాయంతనమునందే ఉదయించి కొంత రాత్రివరకు మాత్రమే వెన్నెలలు కురిసి అస్తమించును. కనుక జనులు ఈ వెన్నెలలను అనుభవింతురు. జనులు నిద్రించిన తరువాత చీకట్లు వ్యాపించును. అయినను ఈ విషయము వారికి తెలియదు వారి దృష్టిలో వెన్నెలలే ఉండును కాని చీకట్లు కాదు. ఈ తీరుననే కృష్ణపక్షమున చంద్రుడు దినదినము రెండేసి గడియలు ఆలస్యముగా ఉదయించును. దీనివలన సాయంకాలము నుండి ముందు చీకట్లే కనిపించును. నిజమునకు చంద్రుడు ఆ తరువాత వెన్నెలలు కురియును. కాని ఆ వేళకు ప్రజలు నిద్రాముద్రితులై ఉందురు. వారు చూచునవి వారికి దక్కునవి చీకట్లే తరువాత కాచిన వెన్నెల వారి అనుభవమునకు రాదు. వారికి ఆ విషయము తెలియదు. అప్పుడు ఆ వెన్నెల జనపదములలో కురిసినను అడవిగాచిన వెన్నెలయేకదా! జనుల అనుభవమునందున్న ఈ అంశమునే కవులును గ్రహించి తాము చెప్పదలచుకొన్న విషయము ప్రధానముగా శుక్లపక్షమైనప్పుడు చీకట్లను, కృష్ణపక్షమైనప్పుడు వెన్నెలను వర్ణింపసైరి. ఈ విధముగా ఇది కవిసమయమైనది. కవిసమయమైన దనగా రసాభివర్ణనమునకు, రసాభివ్యంజనమునకు అనుకూలమైనదన్నమాట! శుక్ల కృష్ణపక్షములను సంకేతములే జ్యోత్స్నాంధకారముల ప్రాధాన్యమును ఉగ్గడించుచున్నవి. శుక్లపక్షమునందు చీకట్లు ఉండవనుటకు ఉదాహరణముగా రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఈ శ్లోకమును పేర్కొన్నాడు.

"మాసి మాసి సమాజ్యోత్స్నా పక్షయోః శుక్లకృష్ణయోః
తత్రైకం శుక్లతాం యాతోయశః పుణ్యైరివా ప్యతే"

(ప్రతిదినమునందలి శుక్ల కృష్ణపక్షములలో వెన్నెల సమానముగనే ఉండును. కాని దానిలో ఒక దానినే శుక్లపక్షమందురు. నిజమే. యశస్సు బహు పుణ్య ఫలము కదా!)

కృష్ణ పక్షమునందు వెన్నెలలుండవనుటకు ఉదాహృతిని అతడే ఇట్లు సూచించినాడు.

"దదృశాతే జనై స్తత్ర యాత్రాయాం స కుతూహలైః
బలభద్ర ప్రలంబఘ్నో పక్షావివ సితాసితౌ"
—కావ్యమీమాంస - అధ్యా - 14.

(మధురానగర యాత్రలో సకుతూహలులైన జనులు బలరామకృష్ణులను శుక్ల కృష్ణ పక్షములనువలె చూచిరి.)

**కామి దంతములకు రక్తత్వము చెప్పకుండుట :**

అలంకారికులు కుందకుట్మలముల రక్తత్వముతో పాటు కామిదందముల రక్తత్వమును వర్ణించుటకూడ నిషేధించినారు. కుందకుట్మములు సుందర రదనములకు ప్రసిద్ధోపమానములు. ఆకార సామ్యమిందు నిహితము. కుట్మముల వర్ణము మాత్రము కాదు. కామి దంతముల రక్తత్వము కవి ఆదర్శ దృష్టికి సమగ్ర సౌందర్య సృష్టికి విఘాతము. ఈ ఉపమానోప మేయముల వర్ణసామ్యము సుప్రతిష్ఠితము చేయవలయుననియే కవులు ఈ రక్తిమను పేర్కొన లేదని భావింపవచ్చును.

కామి దంతముల మాటయేమి! ఎవరి దంతములైనను ధవళములుగా కుంద కుట్మలాకారములతో ఉన్నప్పుడే సుందరములుగా ఉండును. ఇది కవుల దృష్టి. జనులదృష్టి కూడ. ఇక కామిదంతములు ఎర్రగా ఉన్నను ఎర్రగా ఉన్నట్లు వర్ణింప కూడదను కవిసమయమును పరిశీలించినచో కామి దంతములు ఎర్రగా ఉండుటకు కారణమును ఊహించుట కష్టమే అని తోచును. తాంబూల చర్వణముచేత కామిదంతములు ఎర్రగా కనిపించవచ్చును కామి అనగా రసికుడని కూడ భావించుకొనవచ్చును. వాత్స్యాయన కామ సూత్రములలో రసికుడైనవాడు విధిగా తాంబూలచర్వణము చేయవలయునని ఉన్నది. తెల్లని దంతములు రక్తలిప్తములైనట్లు కనపడుట జుగుప్సావహము. దంతములు ధవళములుగనే ఉండుట ఆదర్శప్రాయము కనుక సరసుడైన కామి దంతములు తెల్లనివియై దరహాస జ్యోత్స్నలు వెదజల్లుచుండవలెనని కవులు కామిదంతము లను ఎర్రగా వర్ణింపకూడదను నియమమును ఏర్పరచుకొని ఉందురు. రాజ శేఖరుడు ఈ కవిసమతామును పేర్కొనెనే కాని లక్ష్యమును చూపలేదు. అతని కాలమునాటికే జుగుప్సావహమైన ఈ వర్ణనము మృగ్యమైపోయినట్లు ఊహింప వచ్చును. కావ్యజాలమునందును దీనికి లక్ష్యములు అంతగా లేవు.

## కమలకుట్మములకు హరితత్త్వము వర్ణింపకుండుట :

వికసించుటకు ముందు తామరమొగ్గలు ఆకుపచ్చనివిగా ఉండును. పచ్చని పుటదళముల (Sepals) తో కప్పబడి యుండుటచేత పచ్చనివిగా కనిపించును. ఈ ఆకు పచ్చదనమును వర్ణింపకూడదను నియమమును కవులు చేసికొనిరి అరవిచ్చిన కన్నులను తామర మొగ్గలతో పోల్చుట కవి సంప్రదాయము. స్వరూప సామ్యము ఇందుకు కారణము కాని వర్ణసామ్యము నకు ఇచట ప్రసక్తి లేదు. హరిత కృష్ణ వర్ణములొక్కటే అని కవుల నమ్మిక. కనుక మీలితములైన కన్నులలో నీలిమ అందముగా కనిపింపదు. సరికదా అనారోగ్యమును సూచించును. ఈ కారణముచేతనే వాని హరితత్త్వమును పరిహరించియుందురు. ఏ కుసుమమైనను అది వికసించినప్పుడే అందము లొల్కును. వాసనలు వెదజల్లును. ముకుళితములై ఉన్నప్పుడు దాని స్వరూప స్వభావములతో సమగ్ర పరిచయము సంప్రాప్తింపదు. అరుణములుగనో శ్వేతములుగనో చూపరుల హృదయములలో హత్తుకుని పోయినవి తామర పుష్పములే కాని వాని మిసిమిచాయల మొగ్గలు కావు. రాజశేఖరుడు కావ్య మీమాంసలో ఉదాహరించిన ఈ శ్లోకములోని తామర మొగ్గ తెల్లనిది.

"ఉద్దండోదర పుండరీకముకుల భ్రాంతి స్పృశాదంష్ట్రయా
మగ్నాం లావణ సైంధవేఽభసి మహీముద్యచ్ఛతో హేలయా
తత్కాలాకుల దేవదానవకులై రుత్తాలకోలాహలం
శారేరాదివరాహలీలమవతా దభ్రింలిహోగ్రింవపుః"

(కమల కళికలవలె తెల్లగానున్న తన దంష్ట్రాగ్రముతో భూమిని లవణసముద్రము నుండి ఆదివరాహస్వామి ఉద్ధరించెనని ఇందలి భావము.)

## ప్రియంగు పుష్పముల పీతత్త్వము చెప్పకుండుట

ప్రియంగు పుష్పములు పసుపుపచ్చగా ఉండును. కాని వాని పీతత్వ మును కవులు వర్ణించకూడదను కవిసమయములోని ఆంతర్యము దుర్గ్రాహ్య ముగా ఉన్నది. ఇది కవిసమయ సంకేతమును పొందుటకు సర్వవిధముల యోగ్యతను సంపాదించుకొన్నది. రాజశేఖరుడు—

"ప్రియంగు శ్యామ మంభోధి రాంధ్రీణాం స్తన మండలం
అలంకర్తుమివ స్వచ్ఛాః సూతే మౌక్తిక సంపదః"

(ప్రియంగు పుష్పశ్యామలములైన స్తనమండలములుగల ఆంధ్ర పురంధ్రులను అలంకరించుటకేమో అనునట్లు సముద్రుడు స్వచ్ఛమౌక్తికములను సృష్టించు చున్నాడు) అని ఉదాహరించినాడు.

**నీలోత్పలములు దివమున వికసించునట్లు చెప్పకుండుట :**

నీలోత్పలములు రాత్రివేళ పరిపూర్ణముగ వికసించును. నిజమునకు పగటివేళలో ఇవి పూర్తిగా ముకుళించియుండక కొంచెమే విరిసియుడును. ఈ కొంచెము విరిసియుండుటను చూచి పరిపూర్ణ వికాసమని భ్రమపడకూడదు. దాని సంపూర్ణ వికాసము రాత్రియందే దాని సమగ్ర సౌందర్య విజృంభణము రాత్రియందే ఈ సమగ్ర సౌందర్య దర్శనమే కవుల వర్ణనాదర్శము. అంతేకాని పగటిపూటయందలి ఈ పద్వికసనము కాదు. కలువల పరిపూర్ణ సౌందర్యముతో పరిచయమున్న వారికి ఈ పాటి వికసనము దృష్టికి ఆనదు. లెక్కలోనికేరాదు. రాత్రులలోనే కదా చంద్రోదయము. రాత్రులలోనే సంపూర్ణముగా వికసించు కలువలకును చంద్రునకును సంబంధమున్నట్లు ఊహించి ప్రణయ వ్యాపారము నకు ఒక ప్రతీకనే సిద్ధము చేసినారు కవులు. కనుకనే చంద్రుడు కలువలకు చెలికాడైనాడు. అతని వెన్నెల కౌముది అయినది. ఈ కారణముచేతనే పగటి వేళలలో వాని వికాసమును వర్ణించుటను కవులు మానివేయుట ఎంతవరకు పోయినదనగా అది కవిసమయమే అయిపోయినది. కవిసమయ సంకేతము ఔచిత్య విచారచర్చా పరిధులకు అతీతము. అంతేకాదు కవిసమయమును పాటింపక పోవుటయే అనౌచిత్యము. దీనికి లక్ష్యముగా రాజశేఖరుడు—

"అలిఖ్య పత్త్రమసితా గురుణాభిరామమ
రామాము ఖేక్షణ సభాజిత చంద్రబింబే
జాతః పునర్వికసనా వసరోఽయమస్యే
త్యుక్త్వా సఖీకువలయం శ్రవణే చకార"

—కావ్యమీమాంస - అధ్యా - 14.

(ఒక సఖి సాయంకాలమున చంద్రబింబ సదృశమైన రమణి ముఖమున కాలా గురు పత్రరచనచేసి "ఇకనివి వికసించు సమయమాసన్నమైనదనుచు ఆ రమణి చెవిని కువలయ కుసుమముతో నలంకరించెను.)

**శేఫాలికా కుసుమములు పగటివేళ రాలుపట్లు చెప్పకుండుట :**

శేఫాలికా కుసుమములు రాత్రికాలమున వికసించును. నాలవజాము పనే అనగా తెల్లవారుటకు పూర్వమే ఆ పూలు కుప్పలు కుప్పలుగా జలజల రాలును. అప్పుడా దృశ్యము మనోహరముగా ఉండును. సూర్యుడుదయించిన తరువాత కూడ అవి విరళముగా రాలుచునే యుండును. మిక్కిలి కోమలములను ధవళములును, పరిమళ భరితములైన ఈ చిన్నచిన్నపువ్వులు విశేషముగా రాలునప్పుడు పరిమళములే కురియుచున్నట్లుండును. ముత్యములే రాలు చున్నట్లుండును. సూర్యరశ్మి స్పర్శచేత వాడి వత్తలయిపోయి పరిమళరహిత ములై అప్పుడప్పుడు ఒక్కొక్కటిగా దినమంతయు రాలుటలో అందములేదు. ఆకర్షణ మంతకంటెనులేదు. కనుక పగటివేళలలో అసుందరమైన ఈ శేఫాలికా పుష్పపతనమును వర్ణించుటను నిరాకరించి నిషేధించి యుండవచ్చును.

కలువలకు వలెనే శేఫాలికలకును చంద్రునకును ప్రేయసీ ప్రియుల సంబంధమును కవులు వ్యంజించినారు. ఈ పూలు నిశాంతమున ప్రియుని ఎడబాయుచు దుఃఖించునని వర్ణనములున్నవి.

తుమ్మెదలు ఈ కుసుమములపై నిద్రించునట. కనుకనే ఇవి శేఫాలికలై (శేరత ఇతి శేషాః నిద్రాణాః అళయోఽత్రేతి శేఫాలిక - నిద్రించుచున్న తుమ్మెదలు కలది.) నవి.

ఈ కవిసమయమునకు ఉదాహృతి—

"త్వద్విప్రియోగే కిరణైస్తథోగ్రై ర్దగ్ధాఽస్మికృత్స్నం దివసం సవితా
ఇతీవ దుఃఖం శశినే గదన్తి శేఫాలికారోదతి పుష్పబాష్పైః"

("ఓ నాథా! నీ విరహమున నేను సూర్యుని ప్రచండ కిరణములవలన పరితపించితిని" ఈ విధముగా తన దుఃఖమును చంద్రునికి తెలుపుచు శేఫాలిక పుష్పబాష్పములను రాల్చుచునే యున్నది.)

**స్త్రీలకు వల్లదవముమ ష్టవపాతముమ వర్ణింపకుండుట :**

కేశవమిశ్రుడు అలంకార శేఖరమున ఈ కవిసమయమును పేర్కొని యున్నాడు.

స్త్రీ సౌందర్యాదర్శములకు సంబంధించిన దీ కవిసమయము. సుందర స్త్రీలను గౌరవర్ణలుగా వర్ణించుట పరిపాటి. శరీర వర్ణమునకు సంబంధించి నంతవరకు ధవళత, హేమవర్ణములు ఆదర్శములు. నైల్యము కురూపతకు చిహ్నము. కనుక స్త్రీలను నల్లగా వర్ణింపకూడదని యుందురు. వాత్స్యాయనుడు కామ సూత్రములలో శ్యామవర్ణ వరణీయకాదని చెప్పెను. స్త్రీలు గౌరవర్ణలుగా నుండి తీరవలయునన్నమాట. నల్లగా నున్నచో వర్ణింపకూడదనుట లోకశాస్త్ర బాధ్యమే.

ఇక స్తనపాతమును గూర్చి - స్త్రీ కుచములు వర్తులములుగా, ఉన్నతములుగా బిగువుగా నుండుట సౌందర్యాదర్శము. కావ్యములలో నాయికల అవయవ సౌందర్యము కుచములనిట్లు వర్ణించనిదే పూర్తికాదు.

స్తనపాతము వయోధర్మము. యౌవనదశదాటిన తరువాత ఇది తప్పదు. సహజముగా జరుగునదే. లోకానుభవ సిద్ధమే. కాని ఈ స్తనపాతము వర్ణనీయముకాదని కవులు ఒక పరిపాటిని ఏర్పరచుకొనుట లోకమునకును శాస్త్రమునకును విరుద్ధమైనదే. నైల్యమువలెనే స్తనపాతము కూడ జుగుప్సావహమను హేతువుచేత నిషేధించుకొని యుండవచ్చును.

అసుందరములైన పదార్థములను కవి సుందరముగా తీర్చిదిద్ది బ్రహ్మ సృష్టికంటె విభిన్నమైన విశిష్టమైన తన సృష్టిచేత చిత్తమునకు హత్తుకొనునట్లు చేయును. 'నవరసరుచిర' మైన సృష్టికి సంబాధకములగు అంశములను ఆతడు చూడనే చూడడు. ఒకవేళ చూచినను తన లోకోత్తర వర్ణనా నైపుణ్యము చేత సహృదయుల దృష్టికి గోచరము కానివ్వడు.

అందమును విలువ కట్టుటకు పడికట్టురాళ్లు లేవు. అది హృదయైక వేద్యము. కవిత్వమునకు వలెనే సౌందర్యమునకును సమగ్రమైన సమంజసమైన నిర్వచనము లేదు. నైల్యము కామశాస్త్రరీత్యా గర్హణీయమే అయినను కమనీయమైనది. నైల్యము వర్ణనీయము కాదనునది కవిసమయముగా మాత్రమే నిలిచిపోయినది.

# కవి సమయములు

## తృతీయ ప్రకరణము

### తృతీయ భాగము

**నియమములు :**

రాజశేఖరుడు వింగడించిన ముత్తెరగుల కవిసమయములలో 'నియమము' కూడ ఒకటి. ఇంతవరకు లేకున్నను ఉన్నట్లు చెప్పు కవిసమయములను, ఉన్నను లేకున్నట్లు చెప్పు కవిసమయములను విశ్లేషించితిని. ఇక 'నియమము' అను సంకేతమునందుకొన్న కవిసమయ స్వరూప స్వభావములను వివరింతును.

'నియమ్యతే' అనే నేతి నియమః యమ ఉపరమే. దీనిచేత నియమింప బడునని అమరకోశము తెలుపుచున్నది. నియమ శబ్దమునకు మోనియర్ విలియమ్స్ **Restraining, Cheking, holding back, Any Conven Tional expression, Any fixed rule or law** - అను అర్థములను ఇచ్చినాడు. (నిరోధించుట, ఆపుట, వెనుకకులాగుట, సంప్రదాయ సిద్ధమైన భావప్రకటనము, నిబద్ధమైన సూత్రము లేక శాసనము) ఈ అర్థములను పరిశీలించినచో నియమరూప కవిసమయములను గూర్చి మనకు స్పష్టముగా తెలిసిపోవును. నియమ శబ్దమునందే సంప్రదాయార్థము గర్భితమైయున్నది.

యథార్థస్థితి ఎట్లున్నను ఒక కట్టుబాటునకు లోగిచెప్పుట నియమము. నియమము దాటినచో అనర్థ మేర్పడును. అదొక లక్ష్మణరేఖవంటిది. నియమ మును అతిక్రమించినచో అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడును. కవులుచేసికొన్న నియ మములన్నియును ప్రాయికముగా పరిత్యలోకమునకు బాధ కలుగకుండునటుల చేసికొన్నవే కాని కేవలము అబద్ధములను ప్రాచుర్యములోనికి తెచ్చుటకుకాదు. కవిసమయములుగా నిలిచిపోయిన నియమముల సత్యాసత్యములమాట ఎట్లు న్నను వానిలో అనేకములు సామెతలుగా లోకోక్తులుగా భాషలో నిలిచి పోయినవి. సత్యానుల్లేఖనము, అసత్యోల్లేఖనము, అశాస్త్రీయములు. నియమము

లుగా పేర్కొనబడుచున్న కవిసమయములన్నియును శాస్త్ర మర్యాదలకు కట్టుబడినవి కావు లోకానుభవమునకును అవి సుదూరములు.

అలంకారికులు పేర్కొన్న నియమములన్నింటిని ఉదాహరించి వాని స్వరూప స్వభావములను వివరింతును.

## మకరములు సముద్రమునందే యుండువట్లు చెప్పుట:

మకరములు నదులయందును సముద్రములందున్నను కేవలము సముద్రములోనే యుండునట్లు వర్ణింపవలెనని కవిసమయము. లోతైన నీటిలో నుండుట మకరముల స్వభావము. విశాలమును అగాధమునైన సముద్రమునందు మకరములు స్వేచ్ఛగా నిర్భయముగా సంచరింపగలవు. ఇతర జలాశయములలో వానియునికిని చేపలవంటిదే యనుటకు సందేహములేదు. సముద్రమునందే వాని జీవితము శోభాన్వితముగ ఉండును. జలమునకు అధిదేవత వరుణుడు. అతని వాహనము మకరము. సముద్రమునకు మకరము ప్రతీకకూడ. సముద్రమునకు మకరాలయము అను పేరు కూడ ఉన్నది. మొసళ్ళెక్కడున్నను వాని నిలయము మాత్రము సముద్రమే. తక్కిన జలాశయములలో వానిఉనికిని కవులు వర్ణించినమాట వాస్తవమే కాని వాని నిండుదనమునకు సముద్రమే సరిపోవును. సరస్సులలోను, నదులలోను మకరములు నిర్భయముగా జీవింపలేవు. అడవులలోను జనులుందురు. అంతమాత్రమున అవి జనపదములు కావు. అదే విధముగా ఎక్కడనో ఒక నదిలో, ఏదో ఒక సరస్సులో ఎక్కడో ఒక మూలలో మొసళ్లున్నను వానిని మకరాలయములుగా గుర్తింపలేము కనుక మకరాలయముగా సముద్రమునే గుర్తింపవలయునేకాని ఇతర జలాశయములను కాదు. అను నియమరూపమున నున్నదీ కవిసమయము. మకరము జలజంతువు కనుక జలాశయములలో అవి ఉండుటకు వీలున్నదనుట శాస్త్ర సమ్మతము. ఇకలోకములో జనులకు అవి జలాశయములలో కనన్పట్లు చున్నవి. ఈ రెండిటిని అనగా లోకశాస్త్రములు కాదని అవి సముద్రమునందే యుండునట్లు వర్ణింపవలెననుటతో ఇది కవిసమయ పరిధిలోనికి వచ్చినది.

## మౌక్తికములు తామ్రవర్ణినదియందే లభించునట్లు చెప్పుట:

దక్షిణా పథమున పడమటి కనుమలలో అగస్త్యగిరినుండి ఉద్భవించి, తిరునల్వేలి (తమిళనాడు) జిల్లాలో ప్రవహించుచు, బంగాళఖాతమున కలియు

నది తామ్రపర్ణి. పురాణేతిహాసములలో పెక్కుచోట్ల ఈ నదీమహిమాభివర్ణన మున్నది. అత్యంత ప్రాచీనమైన వాయు పురాణములో ఈ నదీమతల్లిలో మౌక్తికములున్నట్లు చెప్పబడియున్నది.[1] పదునేడవ శతాబ్దికి చెందిన నీలకంఠ దీక్షితులు తన 'శివలీలార్ణవ' ద్వితీయాధ్యాయములో హాలాస్యమాహాత్మ్యమును అభివర్ణించుచు తామ్రపర్ణినదిలో అనర్ఘమౌక్తికములు అనేకములున్నవని వర్ణించినారు. తండ్రి కూతురునకు మణులు, మౌక్తికములను కానుకలుగా నిచ్చి భర్తయింటికి పంపినట్లుగా అగస్త్యమహర్షి తామ్రపర్ణిని అనర్ఘమౌక్తికాదుల నిచ్చి, ఆమెను భర్తయైన సముద్రుని సన్నిధికి పంపినాడని ఈ కవి తన గ్రంథమున వర్ణించినాడు.[2] రాజ నిఘంటువులో గజ సర్పమీన సూకర శంఖమేఘ వేణువులలో మౌక్తికములుండునట్లు చెప్పబడియున్నది.[3] గరుడ పురాణములో చెప్పబడిన మౌక్తికములకు ఆకరములైన ఎనిమిది స్థానములలో తామ్రపర్ణినది ఒకటి. ప్రాచీన దేశ విభాగమునననుసరించి భారతవర్ష ఖండములలో తామ్రపర్ణి ఒకటి. ఈ నదీ పరీవాహప్రదేశము పరిసరములైన సింహళ, పాండ్య, విరాట కావేర్యాది ప్రదేశములు ముత్యాలకు ఆకరములని గరుడ పురాణమే చెప్పుచున్నది. తామ్ర పర్ణినది సాగరముతో సంగమించుచున్న స్థలము నేటికిని మౌక్తికములకు ప్రసిద్ధి వడసియున్నది. ఈ సంగమ ప్రదేశమునందలి మౌక్తిక శంఖ సమేతములైన జలములను సేవించినచో నిరామయత్వమును పుణ్యమును లభించునని భారతీయుల విశ్వాసము.

నిజమునకు ముత్యాలకు సముద్రము పుట్టిల్లు. కాని తామ్రపర్ణినదియందే ఇవి పుట్టునని కవిసమయమేర్పడుటకు కారణమూహింప తగినదే. కవిసమయము ననుసరించి మేరువునందు రత్నములున్నవి కనుక పర్వత సామాన్యములందును రత్నములను ఊహించుట జరిగినట్లు తామ్రపర్ణిలో ముత్యములు లభించునని చెప్పుటచే నదీ సామాన్యములందు కూడ మౌక్తికములు లభించునను సామాన్యాభిప్రాయమునకు అవకాశము లేకుండ చేయుటకే తామ్రపర్ణియందే మౌక్తికములు లభించునను ఈ నియమరూప కవిసమయమేర్పడియుండును.

---

1. "తామ్రపర్ణీ సమేతస్య ముక్తాసారం మహోదధేః
తేనిపత్య దదుస్తస్మై యశః స్వమివ సంచితమ్"—రఘువంశము—4-50.

2 Immortal India-J. H. Daoe Vol. IV Page 140

3. రాజనిఘంటువు-సువర్ణాది-156.

ఈ కవిసమయమున కుదాహరణముగా రాజశేఖరుడొక శ్లోకమును పేర్కొనుచు తామ్రపర్ణినదిని అతడు మౌక్తికములకు కామధేనువనియును ఆ కారణముచేత అది ఇతర నదులకంటె శ్రేష్ఠమైనదనియును వర్ణించినాడు.[1] తామ్రపర్ణి పవిత్రమైనది. అందలి మౌక్తికములు శ్రేష్ఠములైనవి. ముత్యముల శ్రేష్ఠత్వమును పరిపూర్ణ సౌందర్యమును వ్యంజించు ఆదర్శముతోడనే ఈ నియమమేర్పడినట్లు ఊహింపవచ్చును.

## చందనవృక్షములు మలయపర్వతమునందే ఉన్నట్లు చెప్పుట :

మలయ పర్వతమునందే కాక చందన వృక్షములు గంగా సింధునదుల పరీవాహ ప్రదేశములందును, హిమాలయమునందును, ఉత్తరప్రదేశ్ సహారన్‌పూర్ జిల్లాలోని ఉద్యానములందును, కర్ణాటకారణ్య ప్రాంతములందును ఇంకను పెక్కు తావులలో ఉన్నవి. ఐనను దక్షిణాపథముననున్న మలయ పర్వతములందే చందన తరువులున్నట్లు వర్ణింపవలెనని నియమము. ఉత్తమ జాతికి చెందిన చందన వృక్షములకు సర్పములు చుట్టుకొని యుండుననియును,[1] ఆ వృక్షముల ప్రభావముచేత పరిసరతరువులు కూడ గంధ వంతములగుచుండు ననియును,[2] ప్రాచీన కావ్య జాలములో వర్ణనములున్నవి. కాని ఈ వర్ణనము లకు శాస్త్రీయాధారము కనిపింపదు. ఆధారము మాట ఎట్లున్నను శ్రేష్ఠమైన చందన తరువుల పరిమళ గుణ సంపదయే ఈ కల్పనలలో వ్యంజింపబడు చున్నది. ఉత్కృష్ట చందన భూరుహములను ఉల్లేఖించు సౌందర్యాదర్శమే ఈ నియమమునందు గర్భితమై యున్నది. కమ్మ తెమ్మెరలు ఎటనుండి వీచినను వానిని ఉద్దీపన విభావములైన మలయ పవనములుగనే కవులు అభివర్ణించుట లోని ఆంతర్యము ఈ నియమమునకు సంపోషకముగా ఉన్నది.

## భూర్జములు హిమాలయమునందే ఉండునని చెప్పుట :

భూర్జ వృక్షములు అరువది యడుగుల ఎత్తుండును. వృక్షములపై

1. "కామం భవంతు సంతో భువి సంప్రతిష్ఠాః
స్వాదూనిసంతు సలిలానిచ శుక్తయశ్చ
ఏతాం విహాయ వరవర్ణిని తామ్రపర్ణీః
నాన్యత్ర సంభవతి మౌక్తిక కామధేనుః" — కావ్యమీమాంస-అధ్యాయము. 14.

1. కావ్యమీమాంస-అధ్యా. 17. రఘువంశము-4-48; 4-41.
2. సుభాషిత రత్నభాండాగారము-పుట 339.

భాగము పొదవలె కనిపించుచు మిక్కిలి అందముగా ఉండును. దీని బెరడు కోమలముగా ఉండును. ఈ బెరడు పొరలు పొరలుగా ఉండి లేఖనమునకు అనుకూలముగా ఉండును. ఉత్తర భారతమునందలి ప్రాచీన గ్రంథములన్నియు ఈ బెరడు పొరలపై వ్రాయబడి ఉన్నవి.

హిమాలయములో పది, పదునాలుగువేల అడుగుల ఎత్తుగల ప్రదేశము లందును. పంజాబులో ఏడువేల అడుగుల ఎత్తైన ప్రదేశములందును, కొన్ని మైదాన ప్రాంతములందును, చైనా, జపాను దేశములలోను ఈ వృక్షములు కనిపించును ఏమైనను ఉన్నత పర్వత ప్రాంతములలోనే ఇవి ఉండుటకు సాధారణముగా వీలుండును.

ఉన్నతములైన ఈ వృక్షములు, మహోన్నతములైన హిమాలయ శిఖరములందే శోభాన్వితముగా ఉండునను సౌందర్య కల్పనములోని ఆంతర్యమే ఈ చెట్లు హిమాలయమునందే ఉండునట్లు చెప్పవలయునను నియమమేర్పడుటకు కారణభూతమైనదని ఊహింపవచ్చును.

రఘుమహారాజు విజయయాత్రను వర్ణించుచు హిమాలయమునందలి భూర్జములనే కాళిదాసు ఉల్లేఖించినాడు.[1]

## కోకిలలు వసంతమునందే కూయునట్లు వర్ణించుట : —

కావ్య ప్రపంచమున కోకిలారవము ఒక మనోహరమైన విషయముగా భావింపబడుచున్నది. శృంగార రసమునకు ఉద్దీపనలిభావము దానిసుస్వరము. హేమంతశిశిరములలో తప్ప అన్ని ఋతువులందును దాని కుహూకుహూ స్వరము వినిపించుచునే ఉండును. కాని వసంతమున అది కూయునపుడు దాని స్వరమాధుర్యము సహజమై మనోహరమై ఒప్పారును. ఆమ్ర పల్లవములను తినుటచేత కోకిల కూజితములు అంత హృదయంగమములై ఉండునని కాళిదాసు వర్ణించినాడు.[1] వాసంతకోకిలకూజితమే సంగీతమునందు పంచమ స్వరమునకు ఆలంబనమైనదని విజ్ఞుల అభిమతము. వసంతకాలమునందలి కోకిలల

---

1. "భూర్జేషు మర్మరీభూతా కీచకధ్వనిహేతవః
గంగా శీకరిణో మార్గే మరుతస్తంగిరేరివ"— రఘువంశము-4-43.

1. కుమారసంభవము, 3-32.

మధురాతి మధుర కూజితములనే కవులు ఆదర్శముగా గ్రహించి, హీనస్వరములు వినవచ్చు అన్య ఋతువుల కోకిలల ధ్వనులను నిరాకరించినారు. వసంతకాలమందే కోకిలారావములనువర్ణింపవలెనను నియమరూప కవిసమయమునకు కిదియే కారణముగాభావింపవచ్చును.

"వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః"

అను ఆర్యోక్తి వాసంతకూజితము కోకిల ఉనికిని తెలియజేయునని సూచించుచున్నది.

## కమలములు దివమువందే వికసించునట్లు వర్ణించుట :

పద్మములు సాయం సంధ్యావేళలో కొంచెము ముకుళించుకొనిపోయి రేయెల్ల అదే స్థితియందుండి ప్రొద్దు పొడవగనే మరల సంపూర్ణముగా వికసించును. ఇంచుకేనియును ముడుచుకొని పోయినచో అది పద్మమువలెనే కనిపింపదు; విశాలమైన ఆ పూరేకులుండవు; బంగారు రంగారు కేసరములుండవు. సూర్య బింబమును పోలు ఆ శోభకూడ ఉండదు. ఈ విధమైన కించిన్ముకుళితావస్థను సంపూర్ణముకుళితావస్థగా, తుమ్మెదలకు చెరసాలగా కవులు తమ సహజాతిశయోక్తులతో వర్ణించుట పరిపాటిగా ఉన్నది. పూచిన పద్మము మరల మొగ్గవలె పూర్తిగా ముకుళించుకొని పోవుననుట అసంగతము; అలౌకికము; అశాస్త్రీయము. ముకుళించుకొనిపోవుట అనగా పరిపూర్ణ వికాసము పొందకుండుట అని తాత్పర్యము. ప్రాతఃకాలమున దివాకర కర స్పర్శచే పద్మములు సంపూర్ణముగా వికసించి మనోజ్ఞములైన కాంతులను వెదజల్లును. కనుకనే కవుల చేతులలో పడి సూర్యుడు పద్మ బాంధవుడైనాడు. సంపూర్ణ వికసనమునకు తోడ్పడని శీతకిరణుడు పద్మద్వేషి అయినాడు. సంపూర్ణ వికాసమే సమగ్ర సౌందర్యమునకు ఆదర్శము. ఈ సమగ్ర సౌందర్య సందర్శనమే కావ్యజీవనము కదా ! కోకిల కూజితములు ఇతర ఋతువులలో వినిపించినను వానిలో వాసంతమాధురీ మనోజ్ఞతలు స్ఫురింపనట్లే రాత్రివేళలలో దృగ్గోచరములగు పద్మములు ఉదయకాల సుషమాసుందరతా స్ఫూర్తులను ప్రసరింపలేవు కదా ! కనుకనే కమలములు దినమునందే వికసించునట్లు వర్ణించు సంప్రదాయము నియమరూప కవిసమయముగా నిలిచిపోయినదని ఊహింపవచ్చును.

ఉదాహృతి :

“ప్రముదిత వరపక్ష మేకత స్తత్
క్షితిపతి మండల మన్యతో వితానమ్
ఉషసిసర ఇవప్రఫుల్ల పద్మమ్
కుముదవన ప్రతిపన్న నిద్రమాసీత్

—రఘువంశమ్ సర్గ 6. శ్లో-86

(ఇందుమతీ దేవిని వరించిన అజమహారాజు బంధువుల ముఖములు ప్రాతఃకాలమున వికసించిన కమలములుగల సరస్సులవలె ఉల్లసితములయ్యేను. పరరాజుల ముఖములు ముకుళించిన కలువలున్న సరస్సులవలె ఖిన్నభావమును పొందెను.)

## వర్షాకాలమునందే మయూర నృత్య క్రేంకారములను వర్ణింపవలెనను :

నెమళ్లు పురులువిప్పి క్రేంకారములు చేయుచు నాట్యమాడు సందర్భములు అన్ని ఋతువులందును ఉండును. కావ్యములలో నిదర్శనము లనేకములున్నవి.[1] కాని వర్షాకాలముననే అవి మత్తిల్లి సంతోషముతో నృత్యము సేయును. కేకలు పెట్టును. జూన్ మొదలుకొని సెప్టెంబరువరకు గల నాలుగు మాసముల కాలము నెమళ్లకు సహవాసమునకును గర్భాధానమునకును అనుకూలమైన కాలము. ఈ కాలమున మయూరములు పురులు విప్పి నర్తించుచు ధ్వనులు సేయుచు మయూరులను ఆకర్షించును. వానిని మోహింపజేయును. వర్షాకాలము తర్వాత నెమళ్ల ఈకలు ఊడిపోవును. వాని కేకలు చప్పబడును. ఈ స్థితిలో వర్షర్తువునందువలె వాని నాట్యములో అత్యంత సౌందర్యముగాని, క్రేంకారములలో ఉత్కృష్ట మాధుర్యముకాని ఉండదు. ఈ వ్యాపారమును దృష్టియందుంచుకొనియే నెమళ్లు వర్షాకాలమునందే నృత్యములు సేయుననియును, కేకలు వేయుననియును కవిసమయ మేర్పడినది.

నింగిలోని మబ్బుల గర్జనలకును, నెమళ్ల ఆటకును ఇందుమూలముగా సంబంధమున్నట్లు కవులు ఉత్ప్రేక్షించి యుందురు. మృదంగములేని నృత్యమును ఊహింపలేముగదా! కనుక మేఘగర్జనలు లేక వానిని బోలిన సెలయేళ్ల సవ్వడులు నెమళ్లకు ఉత్సాహము కలిగించుననియును ఆ ధ్వనులకు అనుగుణముగా అవి నాట్యమాడుననియును కావ్యములందు కల్పనలు అనేకరీతులుగా చోటుచేసికొన్నవి. ఆమనికోకిల కూజితమునందువలెనే ఈ కవిసమయమునం

1. భారవి - కిరాతార్జునీయము 4-25.

దును కవితా జగత్తులో సమగ్ర సౌందర్యమే ఆదర్శముగా గ్రహింపవలెనను ఉద్దేశము అంతర్నిహితమై ఉన్నట్లుగా భావింపవచ్చును.

మయూర క్రేంకార రూపమున పృథ్వి మేఘమును ఆహ్వానించుచున్నదని కాళిదాసు రఘువంశమున వర్ణించినాడు.[1]

## కన్నులు శ్వేత శ్యామ కృష్ణమిశ్రాద్యనేక వర్ణములనుట :

"సర్వేంద్రియాణాంనయనం ప్రధానమ్" అను ఆర్యోక్తి కన్నుల ప్రాశస్త్యమునుగ్గడించుచున్నది. కన్నులు హృదయములందలి భావములను పట్టిచూపు దర్పణముల వంటివి. ఆయా పరిస్థితులలో హృదయగతములైన భిన్నభిన్నభావములను భిన్నభిన్నవర్ణములతో కన్నులు ప్రకటించుచుండును. కన్నులన్నప్పుడు చూపులకును ఇదే ధర్మము వర్తించును కదా! రసభావాది సందర్భములనుబట్టి కన్నులు ఆయా వర్ణములలో ఉండునని చెప్పు కవిసమయము నకు ఇదియే ఆధారము

రాజశేఖరుడు నాయకుని చూచి సిగ్గుపడిన ఒక నాయిక ప్రణయార్ద్రము లైన దృక్కులను చంద్రఖండములనుచు కటాక్షశుక్లత్వమును తెలిపినాడు.[2] కాళిదాసు కటాక్షములను భ్రమర పంక్తులతో ఉపమించి, వానికి కృష్ణత్వమును ఆపాదించినాడు.[3] రఘువంశమున నేత్రములను కువలయములతో (నీలోత్పల ములతో) పోల్చినాడు.[1] కాటుకవలన స్త్రీల సహజనీలనేత్రములు మరింత అందగించును. జయదేవుడు కుపితయైన రాధానేత్రములను కోకనదము (ఎఱ్ఱని కమలము) లతో ఉపమించినాడు.[2] ప్రాయికముగా కన్నుల కుపమానములైన కమలకుముదములకు ఎన్ని వర్ణములున్నవో అన్ని వర్ణములు కన్నులకు వర్తించు ననుకొనవచ్చును.

## స్థల చరములన్నియు జలములలో నున్నట్లు వర్ణింపవచ్చును :

స్థలచరముల జీవలక్షణములు వేరు జలచరము జీవస్వభావములు వేరు.

---

1. "స్థలీనవాంభః పృషతాభివృష్టా
   మయూర కేకాభిరివాభ్ర బృందం" —రఘువంశమ్ - 7-69.
2. కావ్యామీమాంస - 15వ అధ్యాయము.
3. మేఘదూతమ్ - 1-39.

1. రఘువంశము - 11-93.
2. గీతా గోవిందము - 10.

జలచరములు చాలవరకు నేలపై జీవింపలేవు. తాబేలు, కప్ప, పాముపంటి ఉభయచర జీవములుకూడ ఉన్నవి. కాని సంఖ్యా దృష్టితో చూచినప్పుడు అవి తక్కువే అని చెప్పవచ్చును. కొన్ని జలచరములకు స్థలచరములవంటి రూపములుండుటచేత వానికి ఆ పేర్లు వచ్చినట్లు ఊహింపనగును. ఉదాహరణమునకు నీటి గుఱ్ఱము (**Hippo-potomos**), నీటిసింహము (**Seation**), నీటికుక్క (**Sea-dog**) మున్నగునవి. ఎన్ని ఉదాహరణములను పేర్కొన్నను స్థలచరములన్నియు వాని వాని రూప స్వభావాదులతో జలములనుండుటకు వీలు కానరాదు. ఇది లోకానుభవమునకును శాస్త్ర మర్యాదలకును భిన్నమైన అంశము. అయినను ఇది కావ్యప్రపంచమున సమ్మతమైన విషయముగా నిలిచిపోయి కవిసమయ సంకేతమును పొందినది.

ఈ కవిసమయమునకు గల ఆధారమును గూర్చి ఇట్లు తలపోయవచ్చును. భూమండలమంతయు మొట్టమొదట జలమయముగనే ఉండెను. తరువాత క్రమేణ కొంతభాగము ఉబికియు, ఘనీభవించియు భూభాగములు ఏర్పడినవి. అప్పుడు జలముననున్న జంతుజాలము భూమియందుకూడ వ్యాపించుటకు అవకాశము ఏర్పడియుండవచ్చును. కనుకనే జలగత జీవరాశులన్నియును స్థలచరములైనవని చెప్పుటకు వీలేర్పడియుండవచ్చును.

ఆలంకారికులలో కేశవమిశ్రుడు మాత్రము దీనిని నియమరూప కవి సమయముగా పేర్కొన్నాడు. నిజమునకు ఇది అసత్తును నిబంధించుటయే కవిసమయమే.

## హేమంత శిశిరములను విడిచి అన్ని ఋతువులయందును పద్మస్థితిని వర్ణింపవలెనమట :

శరత్కాలము పద్మ వికాసమునకు అనుకూలము. పద్మ సౌందర్యము సమగ్రతను ఈ కాలముననే పొందును. హేమంత శిశిరములలో హిమపాతము వలనను ఈదరగాడ్పులవలనను పద్మపత్రములు రాలిపోవును. నాళములు మాత్రమే మిగులును. కాశ్మీరప్రాంతమునందును హిమాలయ పర్వతోపాంతమునందును ఉత్తరభారతమునందును చలి అధికము. ముఖ్యముగా కాశ్మీరమునందు నదులు, సరస్సులు గడ్డకట్టుకొని పోవును. పద్మములు మచ్చుకైనను కనిపింపవు. ఈ స్థితిలో వాసిబాసిన పద్మములను వర్ణించుట సౌందర్యోత్కర్షకు

అఘూతము కలగించుటయే. పద్మమును గూర్చియు దాని సౌందర్యమును గూర్చియు అనేకాదర్శాభిప్రాయములున్నవి. పద్మము సౌందర్యమునకును సౌభాగ్యమునకును పావిత్ర్యమునకును ప్రతీక. అట్టి పద్మము దీనస్థితిని వర్ణించుట అనగా ఈ ఆదర్శములను అధఃకరించుటయే. ఇది శతధా ప్రజలకును కవులకును అభిలషణీయము కాదు. కనుక హేమంత శిశిరములను విడిచి, అన్ని ఋతువులయందును పద్మముల స్థితిని వర్ణింప వలెనని నియమరూప కవిసమయ మేర్పడినది. సౌందర్య సమగ్రతా దృష్టియే ఇందు ధ్వనించుచున్నది.

## ఆకాశము శతధనువుల ఎత్తున నున్నట్లు వర్ణింపవలెననుట :

ధనువు నాలుగుహస్తము (మూర)ల కొలతకు పేరని మోనియర్ విలియమ్స్ తన నిఘంటువునందు వ్రాసెను.[1] శతశబ్దము కవితాప్రపంచమున అపరిమిత సంఖ్యాసూచకము. ఆకాశము శతధనువులపై, ఉన్నట్లు చెప్పుట దాని అనంతత్వమును సూచించుటయే. యథార్థమునకు ఆకాశము నూరు మూరల ఎత్తునలేదు. అందుకే ఆకాశమునకు అనంతమను పర్యాయ పదమేర్పడినది. అయినను ఇట్లు చెప్పుట కవిసమయ లక్షణము దానికి ఉండుటచేతనే కావ్యభాషలో శతసహస్రాది సంఖ్యలు కేవల సంఖ్యాత్వమును కోల్పోయి అపరిమితత్వమును పొందును. కవిత్వము గణితముకాదు కదా! ఆకాశమునకు రూపములేదు. శూన్యమని కదా నామాంతరము. దానిని కొలుచుటెట్లు? "ఖం" అనగా ఆకాశము. ఖరతి జ్ఞానమితి ఖం నీరూపత్వాత్ దుర్జ్ఞేయ మిత్యర్థః, ఖను అవదారణే - రూపము లేనిది కనుక బుద్ధిచేత తెలియగూడనిది అని అమరము. రూపమే లేనిదానికి కొలతలు చెప్పుట లోకమున లేనిది శాస్త్రము ఒప్పనిది. కనుక కవిసమయమే.

## నాగసర్పములకు ఐక్యము చెప్పుట :

కావ్యములలో నాగసర్పములను ఒకే అర్థములో ప్రయోగించు సంప్రదాయమున్నది. నిజమునకు ఈ రెండును వేర్వేరు జాతులకు సంబంధించిన సర్ప విశేషములు. నాగమనగా "నాగకాద్రవేయ శబ్దౌ మానుషాకారేషు ఫణాలాంగూలాది యుక్తేషు దేవయోనిషు భోగిషు వర్తేతే - నాగకాద్రవేయ శబ్దములు పడగలు, తోకలుకలిగి మనుష్య రూపులును దేవయోనులులయిన

1. మోనియర్ విలియమ్స్ సంస్కృతాంగ్ల నిఘంటువు పుట - 509.

పాముల పేర్లు అవి అమరమునందు వివరణమున్నది. ఇక సర్పమునకు అమరము నందున్న అర్థమిది - "సర్పతీతి సర్పః సృప్ గతౌ - చరించునది." ఉరగ, పన్నగ, భుజంగ, ఫణ్యాది శబ్దములు సర్ప శబ్దమునకు పర్యాయ పదములు.

సర్పములకు లేని దేవతాత్త్వము నాగములకున్నది. నేటికిని నాగజాతి పూజాభాజనము కదా! కాని కావ్యప్రపంచమున నాగసర్పములు సమాన ప్రతిపత్తిని అందుకొనుచున్నవి. ఈ రెంటికిని ఉన్న సామాన్య భేదమును పాటించినచో భారతీయ వాఙ్మయి పరమార్థమును ఆకళించుకొనలేము సరికదా- కవి ఆలోచనలకును పఠితల ఆస్వాదనమునకును నడుమ తీవ్రమైన అఖాత మేర్పరచుకొనువారవగుదుము. అందువలన ఈ కవిసమయమును పాటించుట వలన రసానుభూతికి అంతరాయ మేర్పడదు. యథార్థమునకు రసాస్వాదన మును సుకరము చేయుననియే కదా కవిసమయములు. ఇట సర్పమైన వాసుకిని నాగరాజుగా సంబోధించినాడు.

"హేనాగరాజ! బహుమస్య నితంబభాగం
భోగేన గాఢమభివేష్ట్య మందరాద్రేః
సోఢా విషహ్యా వృషవాహన యోగలీలా
పర్యంక బంధన విధేస్తవకోఽతిభారః"

—రాజశేఖరుని కావ్యమీమాంస అధ్యాయము-16.

పురాణేతిహాస కావ్యములలో నాగసర్పములకు అభేదమును పాటించి వర్ణించిన సందర్భములనేకములు. మహాభారతమున క్షీరసాగరమధన సందర్భమున వాసుకి నాగుడుగా పేర్కొనబడినాడు.[1]

"శేషః ప్రథమతోజాతో వాసుకిస్తదనంతరమ్" అని కాద్రవేయు నాగులతో వాసుకి పేర్కొనబడినాడు.[2]

## కమలా సంపదలకు ఐక్యము చెప్పుట :

"లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీర్హరిప్రియా" అని అమర

1. మహాభారతము - 1-8-13,15.
2. మహాభారతము - 1-25-4.

కోశము లక్ష్మికి పర్యాయ పదముగా 'కమల'ను పేర్కొన్నది. "సంపత్తిః శ్రీశ్చ లక్ష్మీశ్చ" అని లక్ష్మిని సంపదకు పర్యాయవాచిగా పేర్కొన్నది.

సంపద పార్థివమైన వాస్తుసంతతి. లక్ష్మి పారమార్థికమైన భౌతికాతీతమైన చైతన్య స్వరూపిణి అయిన దేవత. శ్రీమన్నారాయణుని హృదయము నధిష్ఠించిన లోకమాత.

భారతీయ సంప్రదాయమునందు లక్ష్మి సంపద్వైభవ సౌందర్యములకు అధిష్ఠాతృదేవత. కనుక సంపదరూపమున ఉన్నవన్నియును లక్ష్మీస్వరూపములుగనే సంభావింపబడుచున్నవి. ఈ దృష్టితోనే కవులు సంపదకును తదధిష్ఠాతృదేవతయైన లక్ష్మికిని అభేదభావమును పాటించివారు. కల్పనలో సాధారణీకరణాంశము ఉన్నప్పుడే దానికిని కావ్యత్వము సిద్ధించును. కవిసమయములు ఈ సత్యమును అడుగడుగున నిరూపించుచున్నవి.

ఈ కవిసమయమునకు ఉదాహరణముగా శరత్కాలీన ప్రకృతివైభవమునందు "ద్వితీయ పార్థివశ్రీ"ని ఉత్ప్రేక్షించిన కాళిదాసు రఘువంశ శ్లోకమును గ్రహింపవచ్చును.

"లబ్ధ ప్రశమన స్వస్థం అథైనం సముపస్థితా
పార్థివశ్రీర్ద్వితయేన శరత్పంకజలక్షణా"

—సర్గ 4, శ్లో-14.

సముద్రమునుండి విష్ణువుచేత ఉద్ధరింపబడిన పృథ్వియందు లక్ష్మిని ఆరోపించి, ఆమె భక్తుల గృహములందు స్థాపింతబడినట్లుగా చెప్పబడిన రాజశేఖరుని ఈ శ్లోకము కూడ దీని తార్కాణముగా చెప్పవచ్చును.

"దోర్మందరిత మందరేణ జలధేరుత్థాపితా యా స్వయం
యాంభూత్వా కమఠః పురాణకకు దన్యస్తా ముదస్తంభయత్
తాం లక్ష్మీం పురుషోత్తమః పునరసౌ లీలాంచితాభ్రూలతా
నిర్దేశైః సమవీవిశత్ప్రణయినాం గేహేషు దోష్ణీక్షితమ్"

—కావ్యమీమాంస-16వ అధ్యాయము.

## దైత్య దానవాసురులకు ఐక్యము చెప్పుట:

దైత్యులు దితి సంతానము. "దైత్యాః దైతేయాః, దితే రపత్యాని దైత్యాః దైతేయశ్చ". దానవులు దనువు అనెడి స్త్రీవలన పుట్టినవారు.

"దనుజాః దానవాః దనోర్జాతా దనుజా దానవాశ్చ" అసురులనగా అమృతము లేనివారు - "అసురాః నవిద్యతే సురామేషాంతే".

సముద్రమునందుత్పన్నమైన సురను గ్రహించిన వారు సురలనియును, గ్రహింపనివారు అసురులైరనియును రామాయణమునందున్నది.[1]

సమస్త సృష్టి దైవాసురములుగా విభాగింపబడి, అందు విష్ణు భక్తులు దేవతలైట్లును, విష్ణు విరోధులు అసురులైనట్లు అగ్నిపురాణము పేర్కొనుచున్నది.[2]

పురాణేతిహాసములలో అసురశబ్దము దేవతల శత్రులను అర్థమున ప్రయుక్తమైనది. వామన మార్కండేయ పురాణములలో శుంభ నిశుంభులను దనుజులు అసురులుగా చెప్పబడినారు. రాజశేఖరుని అనుసరించి హిరణ్యాక్ష, హిరణ్యకశిప ప్రహ్లాద విరోచనబలి బాణాదులు దైత్యులు. విప్రచిత్త శంబర నముచి పులోమాదులు దానవులు. బలవృత్రా విశురస్త వృషపర్వాదులు అసురులు. దేవేశ్వరుని 'కావ్యకల్పలతావృత్తి' యందును ఇదే వివరణము కనిపించుచున్నది. అమరకోశమునకు సంస్కృతాంధ్ర వ్యాఖ్యానము (గురుబాల ప్రబోధిక)ను వెలయించిన లింగయ్యసూరి - "దైత్యా దానవులకు భేదము కలిగియున్నను అసురత్వ సామాన్యముచేత నభేదకథనము" అని వివరించినాడు.[3]

దైత్య దానవాసురులకు ఐక్యమును చెప్పుటకు లింగయసూరి చూపిన అసురత్వ సామాన్యకారణమే బలీయముగా గోచరించుచున్నది. దైత్య దానవాసుర శబ్దములు సాహిత్యమున ఒకదానికొకటి పర్యాయ వాచకములుగా పెక్కుచోట్ల ప్రయోగింపబడినవి. బాణుడు దైత్యుడైనను అసురుడుగా వర్ణింపబడినట్లు రాజశేఖరుడు—

"జయంతి బాణాసురమౌళి లాలితా
దశాస్య చూడామణి చక్రచుంబినః
సురాసురాధీశ శిఖాంత శాయినో
భవచ్ఛిదస్త్ర్యంబక పాదపాంసవః"

అని కావ్యమీమాంసలో 16వ అధ్యాయమున ఉదాహరించినాడు.

1. రామాయణము 1-43-36,37 శ్లో.
2. అగ్నిపురాణము 383/12.
3. గురుబాల ప్రబోధక పుట 22. (1953 ముద్రణ)

"మహాసుర సమాజేస్మిన్ నచైకోఽపి సోఽసురః
యస్స నాశనిష్ప్రేష నీరాజిత ముదః స్థలమ్"

అని మరొక శ్లోకమందు కావ్యమీమాంసలో రాజశేఖరుడు సకల దైత్యదానవాసురులు అసురులే అయినట్లు వివరించినాడు.

అమరకోశకారుడు—

"అసురాదైత్య దైతేయ దనుజేంద్రారిదానవాః
శుక్రశిష్యా దితిసుతాః పూర్వదేవ సురద్విషః

అని దైత్యదానవాసుర శబ్దముల కేకాక రాక్షసులను అర్థమిచ్చు అనేక పదములను ఒక్కచో చేర్చి, వాని కన్నింటికిని ఐక్యమును, అభేదమును పాటించినాడు.

## ద్వాదశాదిత్యులకు ఐక్యము చెప్పుట:

కశ్యపుని భార్య అదితి. ఆమెకొడుకు ఆదిత్యుడు. (అదితేరపత్యం ఆదిత్యః). అతడు పండ్రెండు మూర్తులు కలవాడు. (ద్వాదశ ఆత్మానం మూర్తయః యస్య ద్వాదశాత్మా) హరివంశము[1]లో, విష్ణు ధర్మోత్తర ఖండము[2]లో ఆదిత్య హృదయ స్తోత్రములో సంవత్సరమునందలి పన్నెండు మాసములు సూర్యుని పన్నెండు రూపములు (మూర్తులు)గా ప్రస్తుతింపబడినవి.

"అరుణో మాఘమాసేతు సూర్యోవై ఫాల్గుణే తథా
చైత్రే మాసిచ వేదజ్ఞో వైశాఖే తపతః స్మృతమ
జ్యేష్ఠమాసి తపే న్ద్రిమ్ ఆషాఢే తపతే రవిః
గభస్తి శ్రవణమాపే యమో భాద్రపదే తథా
ఈషే హిరణరేతాశ్చ కార్తికేచదివాకరే
మార్గశీర్షే తపేచ్చైత్ర సౌమ్యే విష్ణుస్సనాతనః
ఇత్యేతే ద్వాదశాదిత్యాః కాశ్యపేయాః ప్రకీర్తితాః
—ఆదిత్య హృదయమ్.

1. శబ్దకల్పద్రుమము – ఆదిత్య హృదయము.
2. "ధాతామిత్రోఽర్యమారుద్రో వరుణః సూర్యఏవచ
భగోవివస్వాన్ పూషాచ సవితా దశవస్తథా
ఏకాదశస్త్వథా త్వష్టా విష్ణు ర్ద్వాదశ ఉచ్యతే

ఈ విధముగా ఈ పన్నెండును సూర్యుని రూపములే కనుక వీనికి ఏకత్వము ఆపాదింపబడినది. ద్వాదశాదిత్యుల నామములు కొన్నిచోట్ల భిన్నముగా ఉన్నవి వానినిట పేర్కొందును.

I. ధాత, మిత్రుడు, అర్యముడు, శక్రుడు, వరుణుడు, అంశుడు, భగుడు, వివస్వంతుడు, పూషుడు, సవిత, త్వష్ట, విష్ణువు

II. అంశుడు, భగుడు, మిత్రుడు. వరుణుడు, ధాత, అర్యముడు, జయంతుడు, భాస్కరుడు, త్వష్ట, పూషుడు, ఇంద్రుడు, విష్ణువు.

III. మిత్రుడు, రవి, సూర్యుడు, భానుడు, భగుడు, పూషుడు. హిరణ్యగర్భుడు, మరీచి, ఆదిత్యుడు, సవిత, అర్కుడు భాస్కరుడు.[3] ఈ కవిసమయము పురాణగాథలకు సంబంధించినది. రాజశేఖరుడు దీనికి ఉదాహృతిగా మయూరుని సూర్యశతకము నందలి ఈ శ్లోకమును ఎత్తిచూపెను.

"యాస్యాద్యో౽ధస్తధో పర్యుపరినిరవధిభ్రామ్యతో విశ్వమశ్వై
రావృత్తా రాతలీలాం రచయతి రయతో మండలం చండధామ్నః
సో౽వ్యాదుత్త ప్రకార్త స్వర సరలశరస్పర్ధిభిర్ధామదండై
రుద్దండైః ప్రాపయన్వః ప్రచురతమ తమస్తోమ మస్తంసమస్తమ్"

(అమితవేగముతో విశ్వమంతటను పరిభ్రమించుచున్న సూర్యుడొక్కడే అను భావమీ శ్లోకమున ఉన్నది)

### నారాయణ, విష్ణు, శేష, కూర్మ, మాధవులకు ఐక్యము చెప్పుట :

నారాయణ, విష్ణు మాధవ శబ్దములు జగద్రక్షకుడైన భగవంతునికి నామాంతరములు. కూర్మము అతని అవతారమనుట పురాణ ప్రసిద్ధమైన అంశము ఇక శేషశబ్దవిచారము. అమరకోశమునందిట్లున్నది—

"అనన్తో౽నవధానపి"- అనంత శబ్దము అవధిలేనిదానికి పేరైనపుడు త్రి అపి శబ్దమువలన శేషునికిని విష్ణువునకును పేరైనపుడు పు. ఆకాశమునకు పేరైనపుడు న. భూమికి పేరైనపుడు స్త్రీ. నవిద్యతే అంతో యస్యేత్యనంతః- కడలేనిది. ''అనంతశ్శేష విష్ణ్వోస్యాదనంతరం సురవర్త్మని, అనంతా శారిబా

3. సంకేత పదకోశము - సంపాదకులు ఆర్. శ్రీహరి 1973.

దూర్వావిశల్యా లాంగలీషుచ, అనంతా హైమవత్యాంచ గుడూచ్యాంచావనా పపీతి విశ్వప్రకాశః"[1].

శ్రీమన్నారాయణుని ప్రసక్తి వేదపురాణేతిహాసములందు అనేక సందర్భములందున్నది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ ధ్యేయముగా అతడు అనేకావతారములతో అనేకములైన మహాత్కార్యములను సాధించెను. ఆయా మహాత్కార్యముల కారణముగా ఆతనికి అనేకనామములు కలిగినవి. మధుసూదనుడు, బలిధ్వంసి, నరసింహుడు, కంసారి, సోమకారి మున్నగు నామములకు సంబంధించిన పురాణ కథలను ఉట్టంకిచుటకు ఇది అదను కాదని వదలవేయుచున్నాను. నారాయణాది శబ్దములందలి ఏకత్వమును గ్రహింపని ఎడల వేదపురాణేతిహాసముల సంగతి అట్లుంచి, భారతీయ కావ్య సాహిత్యమునే ఆస్వాదింపలేము.

వామన, కృష్ణ కూర్మాద్యవతారములనెత్తి, మాధవుడు అద్భుత కార్యములను నిర్వహించినట్లు రాజశేఖరుడు ఒక శ్లోకమును ఈ కవిసమయమునకు ఉదాహృతిగా పేర్కొనినాడు.

"యేనధ్వస్త మనోభవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతో
యోగాంగాచ దధేన్ధక క్షయకరో యోబర్హి పత్రప్రియః
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతిస్తుత్యంచ నామామరాః
సోవ్యాదష్ట భుజంగహారవలయస్త్వాం సర్వదో మాధవః"

—కావ్యమీమాంస-అధ్యా. 16.

## మన్మథ పతాకమున మకర మత్స్యములకు ఐక్యము చెప్పుట:

మన్మథునకు మకర ధ్వజుడనియును మీనకేతనుడనియును నామాంతరములున్నవి. మకర మత్స్యములు రెండును జలచరములు. స్వరూప స్వభావాదులందు భేదములున్నను మకర మత్స్యములకు నిఘంటువులు అభేదమునే చెప్పుచున్నవి అమరకోశ వ్యాఖ్యానములో మకర శబ్దమునకు - "మాయాం కరోతీతి మకరః - దు కృఞ్ కరణే - మాయచేయునది" అని వ్యుత్పత్తి ఉన్నది. మన్మథుని మాయా ప్రభావమునకు లోగనివాడెవడు? కనుక మన్మథుని టెక్కెమునందు మకరమే ప్రధానలాంఛనమనుకొనుటలో ఔచిత్యమున్నది.

1. అమరకోశము - (గురుబాల ప్రబోధిక) లింగయసూరి విరచితా పదవృత్తిః (1953).

మత్స్య మకరములకు అభేదము పాటించుటవలన మకరముతో పాటు చేపయు వలరాజు టెక్కెమున కెక్కినది. మన్మథుడు వరుణదేవుని అవతారము. వరుణుడు జలాధిదైవతము. ఆతని వాహనము మకరము. వాహనములనే పతాకలాంఛనములుగా చెప్పుట పురాణ ప్రసిద్ధ విషయము. కనుక వరుణుని లాంఛనమైన మకరము మన్మథునకు లాంఛనమైనదని విష్ణు ధర్మోత్తరఖండము పేర్కొను చున్నది.[1]

రాజశేఖరుడు ఈ కవిసమయమున కుదాహరణముగా రెండు శ్లోకములను పేర్కొనుచు ఒక శ్లోకమున మన్మథుని మీనకేతనునిగను, మరొకదాని యందు మకరకేతనునిగను వర్ణించినాడు.

"మీనధ్వజ స్త మసినో నచపుష్పధన్వా..."

"చాపం పుష్పమయం గృహాణమకరం కేతుస్సముచ్ఛ్రీయతాం"

—కావ్యమీమాంస-అధ్యాయము-16.

## అత్రినేత్ర, సముద్రములనుండి చంద్రోత్పన్నతకు ఐక్యము చెప్పుట :

చంద్రుడు అత్రినేత్రమునుండి ఉద్భవించెనని మత్స్య,[1] మార్కండేయ[2], అగ్నిపురాణము[3]లు చెప్పుచున్నవి- మహాభారతము[4]న అనసూయాత్రులకు సోముడు (చంద్రుడు) జన్మించెనని ఉన్నది. అందులోనే ఆదిపర్వమున చంద్రుడు సముద్రమునందుద్భవించెనని పేర్కొనబడినది.[5] అందుకే ఆతడు అబ్జుడయ్యెను (అప్సుజాతః అబ్జః).

చంద్రుడు అత్రినేత్ర సముద్భవుడనుటకు కాళిదాసు రఘువంశమునందలి

"అథనయన సముత్థం జ్యోతిరత్రే రివద్యోః

సుర సరిదివతేజో వహ్ని నిష్ఠ్యూతమేశం

1. విష్ణు ధర్మోత్తర ఖండము - 358

1, 2. పూర్వగాథాలహరి - వేమూరి శ్రీనివాసరావు. పుట-152 (1952.

3. అగ్నిపురాణము 1-42.

4. మహాభారతము 1-20-12.

5. మహాభారతము 1-18-34.

నరపతికుల భూత్యై గర్భమాధత్తరాజ్ఞీ
గురుభిరభినివిష్టం లోకపాలానుభావైః"

అను శ్లోకము ఉదాహరణము.

"తదన్వయే శుద్ధిమతి ప్రసూతశ్శుద్ధి మత్తరః
దిలీప ఇతి రాజేందురిందుః క్షీరనిధావివ"

అని రఘువంశమునందే కాళిదాసు మరొకచోట వర్ణించినాడు క్షీరసముద్రము నందు చంద్రుడుదయించినట్లే సూర్యవంశమున దిలీపుడుదయించెనట.

**చంద్రునిలో హరిణ శశములకు ఐక్యము చెప్పుట :**

చంద్రుడు మృగాంకుడు. శశధరుడు. చంద్రబింబమునందు కనిపించు కళంకమును కవులు అనేక విధములుగా ఉత్ప్రేక్షించినారు. ఆ కళంకము అనేకాకృతులుగా కనిపించుటకు అవకాశమున్నది. కాని జింకవలెను, కుందేలు వలెను ఉన్నట్లు కనిపించుట సర్వజనామోదమును పొందిన కారణమున ఇతరేతరములైన ఆకృతులు ఆకట్టుకొనలేకపోయినవి. కనుక చంద్రునకు మృగాంక శశాంక నామములు పర్యాయ వాచకములైనవి. హరిణాంకుడన్నను, శశాంకుడన్నను చంద్రత్వమునకు లోపములేదుకదా! ఊహాకు విశ్వజనీనతను కల్పించుటయే కవిసమయ ప్రయోజనము గదా! విశేష ధర్మమును సామాన్య ధర్మముగా వివక్షించుటయే కవిసమయ లక్షణము. ఈ సందర్భమును పురస్కరించుకొని రాజశేఖరుడు రెండు శ్లోకములను చూపి, ఒకదానిలో చంద్రుని శశాంకునిగను, రెండవదానిలో మృగాంకునిగను చెప్పినాడు.[1]

**క్షీరసాగరములకు ఐక్యము చెప్పుట :**

వాస్తవ ప్రపంచమున సాగరమనగా క్షారసాగరమే. ఇక క్షీరసాగర మనునది పురాణ ప్రపంచమందలిదే క్షీరక్షార సాగరములు సప్తసముద్రముల లోనివని పురాణ కథనము. పాలకడలిని చిలికినపుడు కవ్వముగా ఉపయుక్తమైన మందర పర్వతాంతర్గతములయిన ఓషధుల సంపర్కముచేత సముద్ర జలములు క్షీరమయములయినవని మహాభారతమువందున్నది.[1]

1. కావ్యమీమాంస - అధ్యాయము 16.

1. మహాభారతముగా ఆదిపర్వము.

కవిసమయములు కవులకు సహృదయులకు ఆహ్లాదాసక్తులకు సంబంధించినవి. కావ్యప్రపంచమునకు మాత్రము పరిమితములైనవి. కావ్యమున సముద్రవర్ణన ప్రసక్తి వచ్చినప్పుడు, అది క్షీరమయమైనది కావచ్చును; క్షార మయమైనది కావచ్చును. ఏది ఏమైనను సముద్రమాత్రస్ఫూర్తి వ్యంజితమైన చాలు. దీనివలన పాఠకులకు అవగాహనా సౌలభ్య మేర్పడును. నిజమునకు కావ్య రసాస్వాదనము ఈ దృశమైన అవగాహనమునందు నిక్షిప్తమై ఉండును కదా! వెన్నెలలో సముద్రము పాలకడలిగనే భాసించును. రాకాచంద్రోదయ వేళలలో సముద్రముప్పొంగినట్లు కావ్యములలో వర్ణనములున్నవి పాల సముద్రములో చంద్రుడుదయించినను క్షారసాగరమున చంద్రుడుదయించినట్లే. కవయిత్రి మొల్ల చంద్రికావర్ణనము చేయుచు ఉప్పొంగుచున్న సముద్రమును "కొడుకుదయించెనంచు నెరికోరి సుధాంబుధి" తన తరంగహస్తములతో ఆ చంద్రుని కౌగిలించుకొనుటకో అనునట్లు వర్ణించినది. వెన్నెలలో ఉత్తాల తరంగములతో చెలంగునది మనక్షార సముద్రమే!

క్షీరసాగరమునందు శ్రీమన్నారాయణుడు శయనించును. లక్ష్మియు ఆ సాగరమునందే జన్మించెను. చింతామణ్యాద్యనర్ఘ రత్నము లందుడియే పుట్టెను. కాని పిపాసాబాధితులైన జీవులకు ఆ సముద్రము మరుభూమిలోని కూపముకంటె నికృష్టము కదా అని రాజశేఖరుడు[1] ఒక శ్లోకమున వర్ణించినాడు.

## సాగర మహాసాగరములకు ఐక్యము చెప్పుట :

సాగరమన్నను మహాసాగరమన్నను కవి మనోనేత్రము ముందు మహోత్తాల తరంగములతో పరవళ్లు త్రొక్కుచున్న సముద్రమే సాక్షాత్కరించును. సాగర మహాసాగరములకున్న భేదము భూగోళశాస్త్రజ్ఞులు వైశాల్యమును బట్టి పాటించినారు. కృవిదృష్టికి ఈ శాస్త్రమర్యాద అవరోధము కల్పింపజాలదు. ఆతడు తలచుకొన్నచో సరస్సులనే తన వర్ణనా సామర్థ్యముతో సాగరాలుగా భాసింప జేయగలడు. పెదపెద్ద చెరువులకును మన మిప్పుడు సాగరములనుటకు కవులే కారకులు. నాగార్జునసాగరము, నిజాం సాగరము, కృష్ణరాజసాగరము ఇత్యాది. కవుల తలపుల చలువ అట్టిది. భాషా

1. కావ్యమీమాంస - అధ్యాయము 14.

నిర్మాణమున వారికున్న పాత్ర అట్టిది. వారి అతిశయోక్తులు సహజోక్తులుగా రూపొందు పరిస్థితి అట్టిది. లోకశాస్త్రముల పొలిమేరలను దాటిన తీరు అట్టిది. బిందువులో సింధువును దర్శింపగలుగు ప్రజ్ఞా చతురులైన కవులకు సాగర మహాసాగరములొకటిగా కనిపించుటలో అనౌచిత్యమేముండును?

రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఈ శ్లోకము నుదాహరించినాడు—

"రంగత్తరంగ భ్రూభంగైస్తర్జయంతీమివాపగాః
స దదర్శ పురోగంగా సప్తసాగర వల్లభామ్"

—కావ్యమీమాంస-అధ్యా-14.

(చంచల తరంగ భ్రూభంగములతో ఇతర నదులను తిరస్కరించుచున్నట్లున్నదియు సప్తసాగరముల ప్రియతమయునైన గంగానదిని యాత్రా సంరంభమున ఆ రాజు దర్శించెను.)

గంగ సాగరము (బంగాళఖాతము)తో సంగమించినను సప్తసాగరములకు ఆ నది ప్రియతమమైనది అనుటలో సాగర మహాసాగరములకు ఐక్యము ధ్వనించుచున్నది.

ప్రశాంత మహాసాగరమని, హిందూమహాసముద్రమని, అరేబియా సముద్రము, అట్లాంటిక్ మహాసాగరమని, నల్లసముద్రమని, బంగాళాఖాతమని ఆయా ప్రాంతములలోని సంద్రములను సౌలభ్యముకొరకు అనుచున్నామే కాని నిజమునకు ఒకే ఒక్క సముద్రము. అందలి పెద్ద చిన్న దీవులలో మనము కాపురమున్నాము. కనుకనే భూమి 'ఉదధి మేఖల' అయినది. ఉదధివేలావలయితమైనది.

## శుక్ల గౌర వర్ణములకు ఐక్యము చెప్పుట :

శుక్లమనగా తెలుపు. గౌరశబ్దమునకుగూడ తెలుపనియే సామాన్యార్థము. కాని పసుపుపచ్చరంగు కలసిన ఎరుపు అనియు, కేవలము ఎరుపనియు, పసుపుపచ్చ రంగనియు, స్వచ్ఛమైనదనియు, శుద్ధమైనదనియు అర్థములున్నవి ఈ అర్థములనుబట్టి చూడగా శుక్ల గౌరవర్ణములకు కొంత భేదము లేకపోలేదని తెలియవచ్చును. సూక్ష్మ భేదమున్నను తెలుపుమాత్రము సాధారణము. ఈ మాత్రమైన సూక్ష్మభేదమును పాటింపక కవులు వాని సమష్టి స్వరూపమునే

గ్రహించి, కావ్యములందు శుక్లగౌర శబ్దములను సమానార్థకములుగా ఏక వర్ణములుగా గ్రహించినారు. తత్ఫలితముగా ఇవి పర్యాయపదములుగా నిఘంటువుల కెక్కినవి.

కాళిదాసు ధవళవృషభమును కైలాసమువలె గౌరవముగా ఉన్నదని వర్ణించినాడు [1] అతడే కుమారసంభవమందు చంద్రుని శ్వేత కిరణములను గౌరములనెను [2]

## పీత రక్తములకు ఐక్యము చెప్పుట :

పీత రక్తవర్ణములు మిశ్రవర్ణములుగాక స్వతంత్ర వర్ణములు. అనగా ఇతర వర్ణముల సమ్మిశ్రణముచేత ఈ వర్ణము లేర్పడవు. ఉదాహరణమునకు పసుపుపచ్చరంగును నీలివర్ణమును కలిసినపుడు ఆకుపచ్చ వర్ణమేర్పడును. పీతరక్తవర్ణములట్లుగాక సహజవర్ణములు కాని సాంద్రముగా ఉన్నప్పుడు ఈ రెండును ఒకటిగానే భాసించును. కావున వానికి అభేదము పాటింపబడి యుండవచ్చును. స్వర్ణ అగ్ని పరాగములలో ఈ రెండు వర్ణములును కలగలసి యున్నట్లు కనిపించును. అందుకే ఆయా సందర్భములకు అనుగుణముగా పీతముగనో రక్తముగనో వర్ణించుచు ఈ రెండిటికి ఐక్యమును పాటించుట కవి సంప్రదాయమై ఉండవచ్చును. ఈ రెండు వర్ణములొక్కటే అన్నచో ఎవరును ఒప్పుకొనరు. శాస్త్రము కూడ అంగీకరింపదు. సంప్రదాయమున లోకశాస్త్ర విరుద్ధమైన ఈ విషయము కవిసమయమై నిలిచిపోయినది.

చంద్రుడు విమల ప్రవాళమువంటి కాంతితో చీకట్లను పారద్రోలినట్లు ఆదివరాహమూర్తి స్వర్ణ ఖండకాంతి సన్నిభమైన తన పచ్చని కోరలతో భూమండలమును జలరాశినుండి ఉద్ధరించెనని కిరాతార్జునీయము నుండి రాజశేఖరుడు ఈ శ్లోకమును ఉద్ధరించెను.

"లేఖయా విమల విద్రుమ భాసా
సంతతం తిమర మిందు రుభానే
దంష్ట్రయా కనక భంగ పిశంగ్యా
మండలం భువ ఇవాది వరాహః"

—కిరాతార్జునీయము-9-22.

1. రఘువంశము - 2-35.
2. కుమారసంభవము - 1-13.

తరుణ చంద్రకిరణములలోని రక్తిమమునకును వరాహమూర్తి దంష్ట్రలయందలి పీతత్వమునకును సాదృశ్యము (సమానధర్మము) చెప్పి పీతరక్త వర్ణములకు ఐక్యమును ధ్వనింప జేసినాడు.

**కృష్ణనీలములకును కృష్ణహరితములకును కృష్ణశ్యామలములకును ఐక్యము చెప్పుట :**

నిజమునను చిక్కగా ఉన్నప్పుడు కృష్ణనీలవర్ణములు, కృష్ణ హరిత వర్ణములు, కృష్ణశ్యామ వర్ణములు ఒకటిగనే భాసించును. నీల హరితశ్యామ వర్ణములు కృష్ణములు కాకపోయినను చిక్కదనమును సంతరించుకొన్నప్పుడు ఇవి కృష్ణత్వమునే పొందును. ఇంగ్లీషులో ముదురు వర్ణమును చెప్పవలసి వచ్చినప్పుడు ఆయా వర్ణములకు **Dark** అను విశేషణమును ప్రయోగింతురు. **Dark** అనగా నల్లనిది లేక చిక్కనిది. కాని వింత ఏమనగా చిక్కదనమువలన ఏర్పడు వర్ణము కృష్ణమే **Dark** అగుచున్నది. అందువలననే ఆ ప్రయోగము సార్థకము. నీలజలమును కామిని కృష్ణ కేశపాశములతో ఉపమించి కృష్ణనీలములకు ఐక్యము చెప్పిన రాజశేఖరుని ఈ శ్లోకము ఇందుకు ఉదాహృతి—

"నదీం తూర్ణాం కర్ణోఽప్యనుసృత పులినాం దాక్షిణాత్యాంగనాభిః
సముత్తీర్ణో వర్ణాముభయతట బలాబద్ధవా నీరహారామ్
తజ్జే సహ్యాస్యోచ్చైః స్వసలిలినివహోభాతినీలః సయస్యాః
ప్రియస్యాంశే పీనే లులిత ఇవ ఘనః కేశపాశః సుకేశ్యాః"

—కావ్యమీమాంస-అధ్యా-15.

కృష్ణ హరితములకు ఐక్యము చెప్పుచు రాజశేఖరుడు మరకత (హరిత)ములతో సమానములైన యమునాజలములు హరిని పోలినవని ఈ శ్లోకమును ఉదాహరించెను.

"మరకత సదృశం చ యామునం
స్ఫటిక శిలావిమలం చ జాహ్నవం
తదుభయముదకం పునాతువో
హరిహరయోరివ సంగతం వపుః

—కావ్యమీమాంస-అధ్య-15.

కృష్ణశ్యామములకు ఐక్యము చెప్పుచు రాత్రి నల్లనిదైనను దానిని శ్యామనిశ అని వర్ణించుచు రాజశేఖరుడు ఈ శ్లోకమును ఉదాహరించెను.

"ఏతత్సుందరినందనం శశిమణిస్నిగ్ధాలవాల ద్రుమం
మందాకిన్యాభిషిక్త మౌక్తికశిలేమే రోస్తలే నందతి
యత్ర శ్యామ నిశాసు ముంచతి మిళింద ప్రదోషానిలా
ముద్దామామర యోషితా మభిరతం కల్పద్రుమశ్చంద్రికామ్"

—కావ్యమీమాంస-అధ్యా-15.

## శివజటా జూటమువందున్న చంద్రునకు బాలత్వమే చెప్పుట :

శివుడు చంద్రశేఖరుడు. చంద్రునికి పదునారుకళలు. వానిలో ఒకకళ శివుని జటాజూటమునందుండునట. మిగిలిన పదునైదు కళలను దేవపితృగణములు ఆహారముగా గ్రహింతురు. చంద్రునికళలే అమృతము కదా! కనుకనే దేవతలు అమృతాంధసులు. ఈ పదునైదు కళలున్న చంద్రునకే వృద్ధిక్షయము లును శుక్ల కృష్ణ పక్షములును కళంకమును, ఇక శివుని జటలయందున్న చంద్రకళ ఒక్కటే. ఆ కళకు నిత్యతారుణ్యమే లక్షణము. నిత్యబాల్యమే లక్షణము. కనుకనే శివుడు బాలేందుశేఖరుడు.

కాళిదాసు కుమార సంభవమున చంద్రుడు పదునైదు కళలతో తారకుని సేవించెనను టకు ఇదియే ఆధారము. ఇది పురాణసంబంధమైన కవిసమయము. ఈ కవిసమయము కవులకు లాక్షణికులుచేసిన ఉపదేశముకూడ.

## మన్మథునికి మూర్తత్వామూర్తత్వములుండువట్లు చెప్పుట :

మన్మథుడు హరకోపానలజ్వాలలకు భస్మసాత్కృతుడై మూర్తత్వమును కోల్పోయినాడు. అయినను ఆతని క్రియా స్వభావములకు మృతిలేదనుటకు పార్వతీ పరమేశ్వర పరిణయమే ప్రబల తార్కాణము. శరీరమున్నను లేకున్నను మన్మథుడు తన ప్రభావమును ప్రదర్శించుచునే ఉండును. లేకున్నచో సృష్టి వైచిత్ర్యమే నశించును కదా! మన్మథుడు దగ్ధమైపోయినను తిరిగి ప్రద్యుమ్ను నిగా అవతరించినాడు. ఈ విధముగా మన్మథునికి ఆదియందు రూపమున్నది. అంతమునందు రూపమున్నది. మధ్యకాలముననే మూర్తత్వము అస్తంగమిత మైనది. మూర్తిలేకున్నను మహిమలో మాత్రము మార్పులేదు. మన్మథుడు

మదనుడైనను అనంగుడైనను ప్రద్యుమ్నుడైనను భావజత్వమునకు లోపము లేదు. అందువలననే కవులు కాముని మూర్తత్వామూర్తత్వములకు ఐక్యమును సంబంధించినారు. ఈ నియమ రూపక కవిసమయమునకు గీర్వాణాంధ్ర కావ్యములలో ఉదాహృతులను చూపవలసి వచ్చినచో పున్నమినాడు నిండుచంద్రుని చూపినంత పనియగును.

## విశేషించి చెప్పకున్నచో పుష్ప జల ఛత్ర వస్త్రములు తెల్లనివే ;

సాధారణముగా లోకమున కనిపించు పుష్పములలో తెల్లనివే ఎక్కువ. ఈ ఆధిక్యమును బట్టియే పువ్వనగానే తెల్లనివి అనే భావమే కలుగుచున్నది.

శ్వేతవర్ణము శుచిత్వమునకు పవిత్రతకును ఔజ్జ్వల్యమునకును యశోహాసములకును సంకేతము. విరులు విరిసినవనగా నవ్వినవనియే భావము నవ్వు తెల్లనిదే కదా! ప్రకృతిలో పలువన్నెల పూవులున్నవి. ఆయా వన్నెల పూవులను పేర్కొన్నప్పుడు ఆ రంగులను సూచించు విశేషణములను కూడ ప్రయోగింపవలసి యుండును. విశేషించి చెప్పకున్నచో పూలు తెల్లనివనుకొనుట సర్వసాధారణ విషయము. ఇదే విధముగా జలమన్నను ఛత్రమన్నను వసనమన్నను విశేషించి వాని వర్ణములను పేర్కొనకున్నచో అవి తెల్లనివనియే లోకప్రసిద్ధము.

పార్వతిహాసమును కాళిదాసు పూలతో ఉపమించి పూలు సాధారణముగా తెల్లనివని ధ్వనింపజేసినాడు.[1] హాసము తెల్లనిదే కదా !

## విశేషించి చెప్పకున్నచో మాణిక్య(మణి), జపాపుష్ప పద్మ, పల్లవ, బంధూక, దాడిమ పళములు ఎఱ్ఱనివే :

మాణిక్యమనగా కెంపు, పద్మరాగము ఎఱ్ఱనిమణి. నవరత్నములలో పద్మరాగము ఉత్తమమైనది. అన్ని వర్ణములలో రక్తవర్ణము మిక్కిలి ఆకర్షణ గుణము కలది. ఎంత దూరమునుండి చూచినను ఈ వర్ణము స్పష్టముగా కనిపించును. తక్కిన వర్ణములు మసకమసకగా కనిపించుటయో లేక తెల్లగా కనిపించుటయో జరుగును. కనుకనే ప్రమాదమును సూచించుటకు రక్తవర్ణము నుపయోగింతురు. భూమికి కొన్నిమైళ్ళదూరమున అంతరిక్షమున ఉన్న అంగారక

---

1. కుమార సంభవము – 1-44.

గ్రహము ఎఱ్ఱనిది కనుకనే మనము దాని రక్తత్వమును స్పష్టముగా చూడ గలుగుచున్నాము. మిగిలిన గ్రహనక్షత్రములకు వేర్వేరు వర్ణములున్నవని ఖగోళశాస్త్రజ్ఞులు తెలుపుచుందురు. కాని అవియును మనకు తెల్లనివిగానే కనినంచును. సూర్యుడు మనకు ఎఱ్ఱగా కనిపించును. మణి అనగా ఎఱ్ఱనిదే కనుక సూర్యుడు నభోమణి అయినాడు. మణులలో పద్మరాగము ఉత్తమ మైనది. శ్రేష్ఠమైనది. ఆకర్షణీయముగా ఇది కనిపించుచున్నందున మణి అనగా సాధారణముగా వేరు వర్ణము ఏదియును తోపక అరుణవర్ణమే నేత్రముముందు పొడకట్టును. అన్యవర్ణములుగల మరకత గోమేధికాది మణులను గూర్చి చెప్పు నప్పుడు ఆయా వర్ణములను సూచించు విశేషణములను ప్రయోగింపవలసి యుండును. విశేషించి చెప్పని ఎడల మాణిక్యములు (మణులు) ఎఱ్ఱనివనియే సాధారణభావము. అదే విధముగా జపాకుసుమ మన్నను, పద్మమన్నను, బంధూక మన్నను, పల్లవమన్నను దాడిమ మన్నను సర్వసాధారణముగా ఎఱ్ఱనివే. కాకున్నచో వాని వర్ణములకు ప్రత్యేక విశేషణములను ప్రయోగింపవలసి యుండును. ఉదాహరణమునకు - సితపద్మము, తెల్ల దానిమ్మ మున్నగునవి.

## ధ్వజ చామర హంస హార భక భస్మములకు తెల్లదనమును, శైల వృక్ష రాక్షస మేఘ సముద్రంతా ధూప పంక కేశములకు నల్లదనమును చెప్పుట :

ధ్వజ చామరాది పదార్థములన్నియును పలువన్నెలలో నుండుటకు అవకాశమున్నది. ధ్వజములు ఎన్నియో రంగులలో ఉండవచ్చును. హంస లన్నియును తెల్లనివి కావు. రకరకముల రంగులలో హంసలు ఉండునట్లు హిమ వత్పర్వత ప్రాంత పరిసరములలో పర్యటించిన వారి అనుభవములే చెప్పు చున్నవి. హారమనగా ముత్యాలమాల. మంచిముత్యాలు తెల్లనివి. ఇతర వర్ణముల మౌక్తికములును లేకపోలేదు. కొంగలు కూడ పలువన్నెలవి. భస్మములలోను వివిధ వర్ణములవి ఉన్నవి. చామరములు చామరీమృగముల తెల్లని తోకలకున్న కేశములతో చేయబడు వీవనలు. వీనికి రంగులు వేయ వచ్చును. ఈ విధముగా ఈ వస్తువులన్నియును అనేక వర్ణములలో ఉండుటకు అవకాశమున్నను తెల్లనివిగనే వర్ణింపవలెనను నియమమేర్పడుటకు కారణము అవి తెల్లగా ఉండుట యందే సార్థకత ఉన్నట్లు భావించుట. అనగా ధావళ్యము నకే ప్రాముఖ్యము. లోకమున ఇతర వర్ణములలో ఈ పదార్థములున్నను

పేర్కొనక పోవుట సత్తును నిబంధింపకుండుటయే. ఉన్నదానిని లేనిదిగా చెప్పుటయే అలౌకికమే. అయినను తెల్లనివిగానే వర్ణించుట సంప్రదాయమై నందువలన నియమరూప కవిసమయమైనది.

ఇదే విధముగా శైల వృక్ష రాక్షస పంక కేశాదులకు నల్లదనమే వర్ణింప వలెననుట నియమ రూప కవిసమయమైనట్లుగా ఊహించుటకు వీలగుచున్నది. ఇందు లతా వృక్షములు హరితములైనను, హరిత కృష్ణములకు ఐక్యము కనుక నల్లనివిగనే చెప్పవలెను. ధూపమునకు ఉపయోగించిన ద్రవ్యమునుబట్టి ధూప ధూమవర్ణ మేర్పడును. అయినను నల్లనిదిగనే చెప్పుట నియమము. శైల పంకముల వర్ణములు, అవి ఉన్న భూప్రదేశములుబట్టి మారుచుండును. నర్మదా నదీతీరమున (మధ్యప్రదేశ్, జబల్‌పూర్) పాలరాతి కొండలున్నవి. చౌటినేలల బురద, ఇసుక భూముల బురద నల్లగా ఉండకపోవచ్చునుగదా! ఇక కేశములను తెల్లగా వర్ణించక నల్లనివిగనే వర్ణించవలెననుటలో సౌందర్య దృష్టి ఉన్నది. పలితకేశములు జుగుప్సావహములు కదా! విశేషముగా చెప్పకున్నచో మబ్బులు నల్లనివనియే కవిసమయము. వర్షించు మేఘములు నల్లగా ఉండును. కనుకనే మబ్బులకు జలదములను పేరు సార్థకమైనది. నిజమునకు మబ్బు అను మాటకే నల్లనిదను ఛాయార్థమున్నది. మబ్బు అనగా చీకటి, రాత్రి అను అర్థములు కూడ కొన్ని మండలములలో ఉన్నవి. అన్యవర్ణాంకితములైన మేఘముల ప్రసక్తి వచ్చినప్పుడు వానికి ఆయా విశేషణములుండును. పదార్థములను మేఘములతో ఉపమించిన సందర్భములలో మేఘ కార్ష్ణ్యము గ్రాహ్యము, మేఘశ్యాముడు, జలదవేణి మున్నగు సమాసము లేర్పడుటకు ఈ కవిసమయము ఆధారమైనది. భాషానిర్మాణమునకు కవిసమయములు అందించిన సామగ్రి ఇంతింతనరానిది.

## భాషా సంబంధ కవిసమయములు

**1. శివుని 'శూలి' అనవచ్చును. 'సర్పి' అనరాదు.**
**2. చంద్రుని 'శశి' అనవచ్చును. 'మృగి' 'హరిణి' అనరాదు.**
**3. శివుని 'ఇందుమౌళి' అనవచ్చును. 'గంగామౌళి' అనరాదు.**

శూలము గలవాడు 'శూలి' అగునపుడు, సర్పముగలవాడు 'సర్పి' కావలసినదే. 'శశము' గలవాడు 'శశి' అయినప్పుడు, మృగ లాంఛనము

గలవాడు 'మృగి' ఏలకాకూడదు? ఈ తర్కము సముచితముగనే కనిపించు చున్నది. కాని శబ్ద ప్రయోగమును మాత్రము దృష్టి యందుంచుకొనినచో, అర్థాంతరములు వచ్చు అవకాశములున్నవి. సర్పి అనగా సర్పములు గలవాడు (శంకరుడు) అని కాక ఘృతమను అర్థమువచ్చును. మృగి అనునప్పుడు మృగ లాంఛనుడు (చంద్రుడు) కాక ఆడులేడి అను అర్థము వచ్చును. హరిణి అను నప్పుడు హరిణాంకుడు (చంద్రుడు) అనికాక, ఆడుదుప్పి అను అర్థమువచ్చును. హరిణి అనునప్పుడు హరిణాంకుడు (చంద్రుడు) అనికాక, ఆడుదుప్పి అను అర్థము వచ్చును. ఇట్లు సర్పి, మృగి, హరిణి శబ్దములు శివచంద్రులకు పర్యాయ వాచకములుగా ప్రయుక్తములగుచో పఠితలు కవి హృదయమును అవగతము చేసికొనలేరు. కనుక శివ చంద్రార్థములలో సర్పి, మృగి, హరిణి శబ్దములు ప్రయోగ యోగ్యములు కావని కవి శిక్షారూపమున ఆలంకారికులు చెప్పి యుందురనియును. కవి సమయములుగా గాక కవిసమయాభాసములుగా కనిపించుచున్నవనియును స్థూలదృష్టికి తోపకమానదు. కాని కేశవమిశ్రుడు వీనిని కవిసమయములుగా పేర్కొనుట గమనార్హమైన అంశము. శూలి సర్పి, హరిణి అను కేవలశబ్దములను కాక "శివుని శూలి అనవచ్చును, సర్పి అనరాదు" అను నియమమును సూచించు మొత్తము వాక్యమును పరిశీలించినచో కవిసమయ మని పేర్కొనుటకు కూడ వీలులేకపోలేదు. దానిని ఇట్లు వివరించవచ్చును. "శివుని శూలి అనవచ్చును. సర్పి అనరాదు". అనగా సర్పి అనకుండుట సంప్రదాయము. ప్రయోగములే లేవు కదా! సర్పి అని అనకుండుట అశాస్త్రీ యము. అనగా చక్రముగలవాడు చక్రి అయినట్లు, వజ్రముగలవాడు వజ్రి అయినట్లు గుణముగలవాడు గుణి అయినట్లు సర్పము గలవాడు సర్పి ఏల కారాదు? కారాదు అనుట అశాస్త్రీయమే కదా! అనకూడదనుట హేతు బద్ధము కాదు కదా! ఇక శివుని శూలి అనగలిగినప్పుడు లోకము సర్పి అనికూడ అనగలగవలెను. మరి ఇట్లనకుండుట అలౌకికము కాక మరేమి?

ఇట్లు కవిసమయ సంకేతమునకు కావలసిన అశాస్త్రీయ అలౌకిక పరం పరాయాత లక్షణములకు ఇవిలక్ష్యముగా కనిపించుచున్నదనుట సాహసము కాదు.

చంద్రుని 'శశి' అనవచ్చును. 'మృగ' 'హరిణి' అనరాదు శివుని ఇందు మౌళి అనవచ్చును. గంగా మౌళి అనరాదు - అనునప్పుడు కూడ ఇదే ఉపపత్తిని చూపవచ్చును.

# కవి సమయములు

## చతుర్థ ప్రకరణము

### కవిసమయాభాసములు

**సంఖ్యాత్మతక నియమములు :**

శాస్త్రములలో పురాణములలో విషయ విభాగములను వివరించు సందర్భమునందు వానిని పలువిధములుగా విభజించి, ఆయా విషయములకు నామకరణములు చేయుట, వాని సంఖ్యలను నిర్ణయించుట పరిపాటి. చరాచర జగత్తులోని వివిధ పదార్థములను, వాని గుణదోషములను, అవస్థలను, పురుషార్థములను, శాస్త్రములను, విద్యలను, కళలను, వర్ణములను సురాసుర గణములను సాగరములను, దిశలలు ఇంకను అనేకములైన దృశ్యాదృశ్య విషయములు నెన్నింటినో సంఖ్యా నిబద్ధముచేసి మన ప్రాచీనులేమి అర్వాచీనులేమి వినియోగించు చునే ఉన్నారు. ఉదాహరణమునకు ద్వీపములు, తాపత్రయము, చతుర్విధ పురుషార్థములు, పంచేంద్రియములు, షడంగములు, సప్తస్వరములు, అష్టైశ్వర్యములు, నవరసములు, దశావస్థలు, ఏకదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, త్రయోదశదానములు చతర్దశ చాటువులు, పంచదశతిధులు, షోడశకళలు, సప్తదశ శబ్దదోషములు, అష్టాదశ పురాణములు, వింశతిముద్రలు, ఏకవింశత్యవతారములు, చతుష్షష్టికళలు, చతురశీతిబంధములు, శతధార్తరాష్ట్రులు, అష్టోత్తర శతనామములు, సహస్ర నామములు ఇత్యాది.

సంఖ్యాత్మకములుగా వాఙ్మయమునందు ప్రయుక్తములగుచున్న ఈ అంశములకు తొంబది తొమ్మిది శాతము అన్యథా విభజనము కనిపింపదు. ఈ క్రిందివానికి మాత్రమే సంఖ్యా వైవిధ్యము కానిపించుచున్నది.

1. భువనములు : (లోకములు) త్రిభువనములు, సప్తలోకములు, చతుర్దశ భువనములు.

2. విద్యలు - చతర్విద్యలు, చతర్దశ విద్యలు అష్టాదశ విద్యలు.

3 సముద్రములు : చతుస్సముద్రములు, సప్తసముద్రములు.

4. దిశలు : చతుర్దిశలు, అష్టదిశలు, దశదిశలు.

ఈ నాలుగు అంశములకు సంబంధించిన సంఖ్యా వైవిధ్యము వేదశాస్త్ర పురాణ సమ్మతము. ఈ సందర్భమున ఎచ్చటను భిన్నత్వము గోచరింపదు. కవులు తమ కావ్యములలో అన్ని విధములను ప్రయోగించినారు. వారి దృష్టిలో భువనములు మూడన్నను పదన్నను, పదునాలుగన్నను ఒక్కటియే. ఇవి పరస్పర విరుద్ధములు కానందున యథా సందర్భముగా యథాయోగ్య ముగా వానిని ప్రయోగించినారు. ఆలంకారికులలో అజితసేనుడు, దేవేశ్వరుడు కేశవమిశ్రుడు వీనిని నియమ రూప కవిసమయములుగా పేర్కొనినారు. నిజమునకు ఇవి కవిసమయ పరిధిలోనికి రావు. రాజశేఖరుడు కావ్యమీమాంసలో 'శాస్త్రనిర్దేశము' అను ద్వితీయాధ్యాయమునందును, 'దేశవిభాగము' అను పదునేడవ అధ్యాయమునందును భువనములను గూర్చియు, విద్యలను గూర్చియు, సముద్రములను గూర్చియు, దిశలను గూర్చియు వివరించుచు వాని సంఖ్యా వైవిధ్యము అశాస్త్రీయ మనుటకు వీలులేదనియును వాని కన్నింటికి శాస్త్రాధారములున్నవనియును ప్రస్తావించెను [1] లోకమునందును వీనికి ఏదో విధముగా సమన్వయమున్నది. అనగా ఇవి అలౌకికములు కావు. ఈ కారణము చేతనే రాజశేఖరుడు వీనిని కవిసమయములుగా గుర్తింపలేదు. పరంపరాయాత ముగా కవులు ఈ నియమములను పాటించుచు వచ్చుటచేత అజితసేనాదులు వీనిని కవిసమయములుగా పేర్కొని యుండవచ్చునని ఊహింపవచ్చును. కేవలము సంప్రదాయానుసరణము కవిసమయమనిపించుకొనదు. అశాస్త్రీయ త్వము, అలౌకికత్వము అను లక్షణములు కూడ ఉండవలెను కదా! కేవలము సంప్రదాయమే కవిసమయమే అయినచో తరతరములుగా మనకు అందుచున్న జ్ఞాన సంపద అంతయును కవిసమయ సంకేతమును పొందవలసి యుండును. కనుక విద్యాభువనదిశాసాగరములకు సంబంధించిన సంఖ్యానియమములు కవి సమయములు. కావు

---

.1 "భిన్నాభిప్రాయతయా సర్వము పపన్నాం ఇతియాయావరీయః
సప్తసముద్రావాదివస్తు శాస్త్రాదనపేతా ఏవ" —కావ్యమీమాంస-అధ్యాయము-17.

ఇక తక్కిన సంఖ్యాత్మకములైన నియమములను విడిచి, ఈ నాల్గింటిని మాత్రమే ప్రస్తుతము చర్చించి కవిసమయములు కావని చెప్పుటకు కారణము, కొందరు ఆలంకారికులు వీనిని కవిసమయములుగా పేర్కొనుటయే.

## రణవిహతులు సూర్యమండలమును ఛేదించుకొని పోవుట :

యోగమార్గమున జీవయాత్ర చాలించిన యోగి సూర్యమండలము ద్వారమున బ్రహ్మలోకమును చేరునని యోగశాస్త్ర పురాణము లందున్నది. ధర్మయుద్ధమునందు అసువులు విడిచిన వీరపురుషులు కూడ ఇదే మార్గమున బ్రహ్మలోకమునకు పయనింతురు అగ్నిపురాణమునందు యోగి సూర్యమండలమును ఛేదించుకొని పోవునని ఉన్నది.[1] బ్రహ్మజ్ఞానియైన యోగి సూర్యమండల ద్వారముననే బ్రహ్మలోకమును చేరునని భగవద్గీతావాక్యము.[2] శ్రీ నిర్వికల్పానంద స్వామివారు భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాయుచు అందు—

"యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమ పావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశమ్"

(అ) "ద్వావిమౌపురుషౌలోకే సూర్యమండల భేదినౌ
ఆధ్యాత్మయోగ యుక్తాత్మా రణేచాభి ముఖోహతః"

అను శ్లోకమును వివరించుచు—

(ఆ) "యత్రయత్ర హతః శూరః శత్రుభిః పరివారితః
అక్షయాన్ లభతే లోకాన్ యది క్లైబ్యం న గచ్ఛతి"

అను రెండు శ్లోకములను ఉద్ధరించి యుండిరి.[3]

"హతో వా ప్రాప్స్యసే స్వర్గం - జిత్వావా భోక్ష్యసే మహీమ్" అని కూడా భగవద్గీతయే చెప్పుచున్నది రణనిహతులైన వారికి స్వర్గప్రాప్తి అగునని పురాణేతిహాసములు ఉద్ఘోషించుచున్నవి స్వర్గప్రాప్తి రణనిహతులైన

---

1. "ఊర్ధ్వమేకః స్థితస్తేషాం యోభిత్వా సూర్యమండలమ్.
బ్రహ్మలోక మతిక్రమ్యతే నయాతి పరాంగతిమ్" —అగ్ని పురాణము-376-22.

2. "అగ్నిర్జ్యోతిరహః శుక్ల షాణ్మాస ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మందోజనాః" —భగవద్గీత-8-24.

3. భగవద్గీత - నిర్వికల్పానంద స్వామి వ్యాఖ్యానము - రామకృష్ణ మఠము - మద్రాసు - (పుట. 34).

యోధులకు గమ్యమైనప్పుడు మరి, ఆ గమ్యము శాస్త్ర సమ్మతమైనప్పుడు గమనమార్గము (సూర్యమండలమును ఛేదించుకొనిపోవుట) శాస్త్రీయము కాకపోవునా? శాస్త్ర బద్ధమైనప్పుడు కవిసమయమనుట పొసగదు. రాజశేఖరుడు దీనిని కవిసమయముగా పేర్కొనలేదు. ఆలంకారికులలో కేశవమిశ్రుడు మాత్రము నియమరూప కవిసమయముగా చెప్పినాడు. గతానుగతికముగా కవులు అనేకులు ఇట్లు వర్ణించి యుండుటచేత కవిసమయమను అభిప్రాయము ఏర్పడియుండవచ్చును. కొన్ని శాస్త్రీయములైన అంశములు పరంపరగా జనసామాన్యవ్యవహారములోనికి దిగుమతి అయినప్పుడు కవిసమయములుగా భాసించుటకు అవకాశము ఏర్పడును. శాస్త్ర సమ్మతముకానిది కవులు చెప్పనే చెప్పరను విశ్వాసము సామాన్యజనులకుండును. స్థూల దృష్టికి కవివచనము ప్రమాణమే. శాస్త్ర జ్ఞానము తలస్పర్శిగా లేనివారికి "కవిర్మనీషీభూః పరిభూః స్వయంభూః అను ఉపనిషద్వాక్యముపట్ల ఉన్న ప్రత్యయముచేత కవి వచనము వేదవాక్యముతో సమానము. కాని ఇది కవివచనము కాదు. ధర్మాంశము పురాణగతమైన విశ్వాసము అంతేకాని కవిసమయము కాదు.

## దేవతలను పాదములను మొదలుకొని, మానవులను శిరస్సు మొదలుకొని వర్ణించుట :

దేవతలు పూజనీయులు. పూజనీయులకు పాదాభివందనము చేయుట సముదాచారమనియును, అవశ్యానుసరణీయమనియును శాస్త్రము నిర్దేశించు చున్నది. ఈ పూజ్యభావము తోడనే దేవతలను ఆపాదమస్తకము వర్ణించుట సంప్రదాయమైనది. ఈ సంప్రదాయమును పాటించవలసినది కేవలము కవులే కాదు. సంస్కృతి సంప్రదాయాభిమానులందరికిని ఇది కర్తవ్యము. షోడశోప చారములందును ఆవాహన - ఆసనముల తర్వాత పాద్యమే ఆచారణీయము. పాద్యమనగా పాదపూజనము. కృత్యాదియందు మంగళాచరణమువలెనే దేవతలను పాదమునుండి శీర్షమువరకును వర్ణించు క్రమమును పాటించుట కవులు విధివిహితముగా భావించినారు. నిత్యజీవితమునందును పూజార్హుల ఎడ ఈ విధముగా ప్రవర్తించుట సర్వసామాన్యము. ఇక శిరస్సునుండి పాదముల వరకు మనుష్యులను వర్ణించు క్రమము కూడ లోకవ్యవహారసిద్ధమే. శిరస్సు ఉత్తమాంగము. మనిష్యుని గుర్తుపట్టుట ముఖమునుబట్టియే కదా! ముఖలక్షణ మునుబట్టి హృదయ సంస్కారమును కొంతవరకు అవగతము చేసికొనవచ్చును.

అందచందములకు ఆకారము ముఖమే కదా! మనుష్యుడు తారసిల్లిగానే తొలుదొల్త కనిపించునది ముఖము. కనుక ముఖము నుండి పాదములవరకు వర్ణించు క్రమము తర్కమునకును, లోకానుభవమునకును అనుకూలముగా ఉన్నది. శాస్త్రమర్యాదలకును లోకవ్యాపారమునకును ఒదుగుచున్న ఈ అంశము సిద్ధాంతపరముగా చెప్పినచో కవిసమయ నిర్వచనమునకు అత్యవ్యాప్తి మనుటకు వీలులేదు. దేవేశ్వరుడును కేశవమిశ్రుడును దీనిని కవిసమయముగా పేర్కొనుటకు కారణము కేవలము సంప్రదాయబలముచేతనే. కేవల సంప్రదాయ విహితత్వము కవిసమయ మనిపించుకొనదు. ఇది ఒక హితోక్తి; పూజావిధానము; ధర్మనిర్దేశము. అంతేకాని కవులకు నిర్దేశముకాదు. కవులకు ఉపదేశమన్నను చిక్కులేదు.

## దేవదేవులను నాయిక నాయకక్రమమున వర్ణించుట :

ఇది కావ్యరచనకు సంబంధించిన సముదాచారముగా, కవి శిక్షా రూపముగా ప్రాచుర్యము నందుకొన్న నయమముగా కన్పట్టుచున్నది. దివ్యులను వర్ణించునప్పుడు దేవదేవీక్రమము, మనుష్యులను వర్ణించునప్పుడు నాయికా నాయక క్రమము అభిలషణీయము అనుభావమే ధ్వనించుచున్నది కాని లోక శాస్త్ర మర్యాదలకు ప్రతికూలముగా గోచరించుటలేదు. కావ్యప్రపంచమున కవులు ఈ వర్ణన విషయమున స్వేచ్ఛా ప్రవృత్తిని అవలంబించిన సందర్భములే ఎక్కువగా ఉన్నవి. రాజశేఖరుడు దీనిని పేర్కొనలేదు. కాని అరిసింహ అమరచంద్రులు మాత్రము తమ కావ్యకల్పలతావృత్తిలో దీనిని నియమరూప కవిసమయముగా పేర్కొనిన్నారు. వారి దృష్టిలో ఇది కేవల సంప్రదాయమో లేక కవులకు ఒక సూచనమో అయియుండవచ్చును నిజమునకు ఇది కవి సమయముకాదు కవిసమయముగా భాసించు అంశము మాత్రమే.

## సృష్ట్యాదియందు లోకములు మహద్రూపమునను సృష్ట్యంతమునందు సూక్ష్మ రూపమునను ఉండునని చెప్పుట :

ఇది శ్రుతి స్మృతి పురాణోక్తమయిన విషయము. కల్పాంతమున లోకములన్నియును లయమొందినట్లు కనిపించినను, అవి సూక్ష్మరూపమున ఉండుననియును, వానినే తిరిగి సృష్ట్యాదిని బ్రహ్మ సృజించుచుండు ననియును పురాణములు పేర్కొనుచున్నవి. పురాణమునకున్న పంచలక్షణములలో సర్గ ప్రతిసర్గములున్నవి కదా! సర్గమనగా ఆదిసృష్టి. ప్రతిసర్గమనగా కల్పాంతర

మున జరుగు. పునః సృష్టి : "ధాతా యథా పూర్వమ కల్పయత్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. శాస్త్రగతమైన ఈ అంశము కావ్యగతమైనను కవిసమయము కాదని చెప్పవచ్చును, ఆలంకారికులలో కేశవమిశ్రుడు మాత్రము దీనిని నియమరూప కవిసమయముగా పేర్కొనుట కేవలము సంప్రదాయ జ్ఞానముకు తెల్పుటకే అని నిశ్చయింపవచ్చును.

**భాషాబంధములు :**

(I) ఇవ, వత్, వా, హి, హీ, హు, స్మ, వై, ను, కిల, ఏవ, చ అను అవ్యయములను పదాది యందు ఉపయోగించుట నిషిద్ధము. ఇది సంస్కృత వ్యాకరణమునకు సంబంధించిన నియమము. కొందరు ఆలంకారికులు దీనిని కవిసమయముగా గుర్తించినారు. కాని అసంగతము. శాస్త్రీయమైన ఈ అంశము కవిసమయమనుకొనుట పొరపాటు.

(II) 'మహత్' శబ్దమును భూత, ఇంద్ర, భారత, ఈశ శబ్దములకు ముందు ఉపయోగించుట నిరర్థకమనియును బ్రాహ్మణ, వృష్టి, భోజ్య, ఔషధ, పథ్యాది శబ్దములకు ముందు ప్రయోగించుట నిందార్థకమనియును చెప్పి, దీనిని నియమరూప కవిసమయముగా కేశవమిశ్రుడు (అలంకారశేఖరము) పేర్కొనినాడు. భాషావ్యాపారమున ఈ అంశములు సుప్రతిష్ఠితములు అయినను వీనిని కవిసమయములుగా చెప్పుట విచార్యమే. సంప్రదాయముగా వచ్చుచున్న వానిని కవి శిక్షారూపములుగా పేర్కొనుటలో విప్రతిపత్తి ఉండదనుకొనుచున్నాను. సాహిత్యశాస్త్రమునకు దర్శనాది శాస్త్రములకున్న ప్రతిపత్తిని, ప్రామాణికత్వమును సంతరింప జేయుటలో కృతకృత్యుడైన రాజశేఖరుడు ఈ విషయమును కవిసమయముగా పేర్కొనకపోవుట గమనార్హము.

**ప్రసిద్ధోపమాసామగ్రి :**

కావ్యప్రపంచమునందు స్త్రీ పురుషులను ప్రత్యేకించి నాయికల అవయవములను వారి కటాక్ష, గమన, హాస, నిశ్వాస వాగ్వ్యాపారములను నాయకుల ప్రతాపకీర్త్యాదులను వర్ణించు సందర్భములలో రమణీయములైన ఉపమానములతో పోల్చుట సంప్రదాయమై ఉన్నది. ఈ సంప్రదాయము (ఉపమాలంకారము) ను పలువురు కవిసమయములుగా భావించుచున్నారు. అలంకారములు కవిసమయములు కావు. అయినను వీనిని కవిసమయములుగా తలచుటకు ప్రధానకారణము. పరంపరాయాతముగా అవి కావ్యలోకమున

ప్రయుక్తములగుచుండుటయే. వేదకాలమునుండి నేటివరకును వీని ప్రాచుర్యము అతిమాత్రముగను, అనివార్యముగను ఉండుట కావ్యరసాస్వాదనపరులందరు ఎఱిగిన అంశమే. ఈ ఉపమాద్రవ్యములను ప్రయోగించుటలో అశాస్త్రీయత గాని, అలౌకికత్వముగాని కనిపించుటలేదు. స్వర్గాది దివ్యలోకములలోని అప్సరోగణమును, కల్పవృక్షములను తదితర పదార్థములను భూలోకములోని వస్తువులతో ఉపమించినను అవి బాగుగా బలపడిపోవుట సంప్రదాయ ప్రభావము ననే. ఉపమాన - ఉపమేయముల సాదృశ్యము సహజముగా మనోజ్ఞముగా ఉన్నప్పుడు ఉపమానమును పలువురు అనుకరింతురు. ఈ అనుకరణమువలననే ఉపమాసామగ్రి ప్రసిద్ధిపొందినది ఈ ఉపమాద్రవ్యములను ఆలంకారికులు సూచించినను, అవి మార్గదర్శకములే, ఆదర్శములే; అంతేకాని కవిసమయములు కావు. సమయమనగా ఆచారమను స్థూలమైన అర్థమును గ్రహించి ఈ విధముగా నమ్మి ఉందురు. కేవలము సంప్రదాయ బలముచేత ప్రయుక్తములగునవి కవిసమయములు కావు. ప్రాయికముగా ఉపమాన - ఉపమేయముల మనోహర సాదృశ్యము లోకమునకు తెలియును. సహృదయులకు అవగతమగును. ఆయా పోలికల స్వరూపస్వభావములతో అతివేలమైన పరిచయము సహృదయుల కుండుటచేతనే వారు ఆనందించగలుగుచున్నారు. కలువరేకులవంటి కన్నులు అన్నప్పుడు సామ్యము కనిపించుచునే ఉన్నది. లోకవిరుద్ధమేమియు ఇందులేదు. ఇట శాస్త్రమునకు ప్రసక్తి రానేరాదు. ఇందుమీదుగా లోకానుభవమునకు సన్నిహితముగా ఉన్న ఉపమాద్రవ్యములే పోలికలే కావ్యములకు అందములు పులుమును. అశాస్త్రీయతగాని, అలౌకికతగాని సోకని ఈ ఉపమాద్రవ్యములు కవిసమయ సంకేతమును పొందలేవు. కనుక కవిసమయములుగా కనిపించినను, ఇవి కవిసమయములు కావు. కవిసమయాభాసములు మాత్రమే.

(ఏయే అవయవములను ఏయే పదార్థములతో పోల్చుచు వచ్చుచున్నారో ఆ పదార్థముల పట్టికను అనుబంధము - 2లో పేర్కొనినాను.)

## వర్ణనియమములు :

పురాణగత వ్యక్తులకును, వస్తుజాలమునకును, నియతములైన వర్ణములు (రంగులు) ఉన్నవి. ఆ వ్యక్తులు మనకు కానరారు. ఆ వస్తువులును మనకు కానరావు ఆ వ్యక్తుల ఆ వస్తువుల వర్ణములు పురాణనిర్దిష్టములు. ఉదాహర

ణమునకు శంకర, నారద, బలరామ మందార స్వర్గంగామృతాదులు శ్వేతములు. కృష్ణ, వ్యాస, రాము, శని, ద్రౌపది, ధనంజయాద్భుత శృంగారాదుల వర్ణములు నీలములు అంగారక, క్షాత్రధర్మ, త్రేతాయుగ రౌద్ర రసాదుల వర్ణములు శోణములు బ్రహ్మ, ద్వాపరయుగ హరజటాజూట, వీర రసాదుల వర్ణములు పీతములు. సూర్యతురంగములు హరితములు.

అదృశ్యములగు ఈ పురాణ సంబంధ విషయములేగాక, లోకమున దృశ్యమానములగు వస్తువులకుగల సహజవర్ణములు సహితము కవులకు ఉపాదేయములగుచు వచ్చుటవలన, అవన్నియును కవి శిక్షారూపనియమములుగా స్థిరపడిపోయినవి. సంప్రదాయ లక్షణమున్నందువలన వీనినన్నింటిని కొందరు కవిసమయములుగా భావించుటకలదు. కాని అశాస్త్రీయములును, అలౌకికములును కానందున వీనిని కవిసమయములనుకొనుటకు అవకాశము లేదు.

(నియతములైన ఈ వర్ణముల పట్టికను, ఆయా వర్ణములుగల పదార్థముల పట్టికను అనుబంధము - 2లో పేర్కొనినాను.)

**ఋతువర్ణనము :**

అనుక్షణ పరిణామశీలమైన ప్రకృతిని నవనవోన్మేష ప్రతిభా సంభూతమైన కవితకును అవినాభావ సంబంధము. ఆయా ఋతువులలో కనిపించు చరాచర ప్రకృతి విశేషములను కావ్యములందు వర్ణించు సందర్భములందు లోకానుభవమునకును, శాస్త్రనుర్యాదలకును అనుకూలములైన దేశకాల ప్రకృతి లక్షణములను, అవగతము చేసికొనకపోయినచో వర్ణనాంశములు ప్రమాద భూయిష్ఠములు కాకతప్పవు. ఈ దృష్టిచేతనే ఆలంకారికులు ఏయే ఋతువులలో ఏయే పదార్థములను. పశుపక్ష్యాదుల చేష్టా విశేషములను, తరుగుల్మలతాదుల లక్షణములను, వాతావరణ పరిస్థితులను, మానవసమాజమునకు కలుగుకష్టసుఖములను వర్ణింపవలయునో సూత్రప్రాయముగా కవిశిక్షారూపమున అందించినారు. ఈ ఋతువర్ణన లక్షణములన్నియును లోకశాస్త్ర ప్రమాణబద్ధములు. కావున కవిసమయములు కావు. నేటివరకును ఈ ఋతువర్ణనమునకు సంబంధించిన సూచనలు మార్గదర్శకములుగా ఉన్నవి. రాజశేఖరుడు కావ్యమీమాంస పదునెనిమిదవ అధ్యాయమున ఋతువుల లక్షణములను గూర్చి సమగ్ర సుందరముగ తెలిపియు, వానిని కవిసమయములుగా భావింపకపోవుటకు

కారణము ఇదియే. ఇవి యన్నియు కవులకు మార్గదర్శక మాత్రములవియే. కొందరు వీనిని కవిసమయములనుకొనుటకు ఆధారము కేవలము వానికిగల సంప్రదాయముమాత్రమే. దేశకాలమర్యాదలను లక్షణము ఃమ సూచించు నియమములు కవిసమయములు కావు. కవులు భ్రమప్రమాదములకు లోను గాకుండ ఉండుటకై దేశకాల వర్ణనౌచిత్య పరిజ్ఞానమును సమకూర్చి పెట్టుటయే. ఈ ఋతువర్ణనాంశములను సూచించుటలోని ఆంతర్యము. అందువలననే ఇవి కవి శిక్షా సంబంధములు మాత్రమే.

(రెండవ అనుబంధమున ఈ ఋతువర్ణనాంశములకు సంబంధించిన విశేషములను పొందుపరచి ఉన్నాను.)

## విశేషణము (ఉపాధి)వివట్టి వామము లేర్పడుట :

వ్యక్తుల నామములకు మారుగా కొన్నికొన్ని సందర్భములందు ఆ వ్యక్తుల రూపమునుగాని, గుణమునుగాని, లేక ఆ వ్యక్తి ఒనర్చు కృతినిగాని బోధించు శబ్దములను ప్రయోగించి విశేషార్థములను కల్పింపవచ్చును. ఈ విశేషార్థములు అర్థస్ఫూర్తికి దోహదము కలగించును. శంకరుని వృషభవాహను డనియును, ఫాలలోచనుడనియును, చంద్రశేఖరుడనియును చెప్పవచ్చును కవులు సాభిప్రాయ పదప్రయోగము చేయదలచినప్పుడు వర్ణనాంశములకు సంబంధించు ఉపాధులను అనగా విశేషణములను చేర్చుదురు. ఇది కవులకు ఒక విధముగా మార్గదర్శకమే, కాని కవిసమయ మనుకొనుటకు వీలు కనిపించదు. కేశవమిశ్రుడు దీనిని నియమరూప కవిసమయముగా పేర్కొనినాడు. కాని దీనిలో కవిసమయమునకు ఉండవలసిన అశాస్త్రీయత కాని అలౌకికత కాని సంప్రదాయము కాని లేదు. ఇది కవులకు లాక్షణికులు కల్పించిన సౌలభ్యము మాత్రమే. ఈ కారణముచేతనే నేను దీనిని కవిసమయాభాసముగా పేర్కొన వలసివచ్చినది.

చిత్రకావ్యములలో రల, డల, వబ, శసలకు అభేదమును పాటించుటయు, అనుస్వార విసర్గములను పరిగణనలోనికి తీసికొనకపోవుటయును సంప్రదాయ ముగా ఉన్నది. కేశవమిశ్రుడు ఈ సంప్రదాయమును నియమరూప కవిసమయ

ముగా పేర్కొనినాడు. చిత్రకావ్యముల మాట అటుంచి సాధారణ కావ్యము లందును ఈ అభేదము కనిపించుచునే ఉన్నది. వేదములందును ఈ అభేదమునకు లక్ష్యములున్నవి. ప్రాయికముగా ఇది వ్యుత్పత్తికిని, కవిశిక్షకును సంబంధించిన విషయము. అభిలషితార్థస్ఫూర్తికొరకు కవులు ఈ అభేదమును ఒక సదవకాశముగా వినియోగించుకొనుచు వచ్చుచున్నారే కాని ఇందు అశాస్త్రీయత గాని, అలౌకికతగాని గోచరించుటలేదు. వేదసమ్మతమైన అంశములను అశాస్త్రీయములనుకొనుట ప్రామాదికము గదా!

## న్యాయములు కవిసమయములుకావు :

న్యాయమునకుగల బహ్వర్థములలో దృష్టాంతము కూడ ఒక్కటి. ప్రమాణము మొదలైన షోడశపదార్థములలో ఒకటియగు దృష్టాంతపదార్థమునకు నామమైన న్యాయశబ్దముతో శాస్త్రమునకు పేరేర్పరుప బడినందున అది న్యాయశాస్త్రమైనది. ఈ శాస్త్రమువలన తెలియని వస్తువులను, తెలిసిన వస్తువుల సాహాయ్యముచే అనగా ఉదాహరణములచే తెలిసికొనుటకు వీలగుచున్నది. ఉదాహణమునకు స్వప్రయత్నములేకున్నను భగవంతుడే రక్షించుచునను భావమును స్పష్టముగా కన్నులకు కట్టినట్లు తెలుపుటకు మార్జాల కిశోర న్యాయ మేర్పడినది. పిల్లి తననోటితో పండ్లుతగులకుండ అతి జాగ్రత్తతో కూనను తీసికొనిపోవునని ఈ న్యాయమునకు తాత్పర్యము. ఈ విధముగా దైనందిన జీవితమునందు కానిపించు దృశ్యములను, సన్నివేశములను, అనుభవములను ఊతగాగొని కనిపించని పరమాత్మతత్త్వమును సులభముగా సుబోధకముగా ఉపదేశించుటయే దీని లక్ష్యము. ఇదే విధముగా మర్కటకిశోరన్యాయము, గతజలసేతుబంధన న్యాయము, ఘుణాక్షరన్యాయము, కరతలామలక న్యాయము, కాకతాళీయన్యాయము, నారికేళఫలాంబున్యాయము, పిష్టపేషణ న్యాయము వంటి న్యాయములనెన్నింటినో పేర్కొనవచ్చు.

న్యాయములన్నియు నిత్యజీవితమునందు అనుభవమునకు వచ్చుసత్యాంశములు. శాస్త్రనిహితములు, లౌకికములైన శాస్త్రీయములైన ఈ న్యాయములు కవిసమయములు కావు.

కొన్ని కవిసమయములు, మేఘచాతక న్యాయము, చంద్రచకోర న్యాయము వంటివి. వాని విస్తృత ప్రాచుర్య ప్రాబల్యవశమున న్యాయములలో చోటుచేసికొని ప్రసిద్ధి పొందినవి. మేఘములకు చాతకములతోడను, చంద్రునకు చకోరముతోడను గల సంబంధము కేవలము కవికల్పనములే కదా! వ్యంగ్యార్థ ప్రతిపాదమునకే గదా!

కవిసమయముల తత్త్వమును పరిశీలింపక అవి సత్యములా? లౌకికములా అను విచికిత్సచేయక వానిని యథాతథముగా యథార్థములుగా పరిగణించి సులభార్థబోధకములగు న్యాయములుగా పేర్కొనుటవలననే కొన్ని కవిసమయములైనవి అందుకే కొందరు న్యాయముల లక్షణములనుచూచి అవి కవిసమయములే అను భ్రాంతికి లోనగుచున్నారు. కనుక న్యాయములను కవిసమయాభాసములని చెప్పవలసి వచ్చినది.

# కవి సమయములు

## పంచమ ప్రకరణము

### కవిసమయ ప్రయోజనము :

"నియతి కృతినియమ రహితాం, హ్లాదైకమయీమనన్య
పరతంత్రాం, నవరసరుచిరాం, నిర్మితి మాదధితి భారతీకవేర్జయతీ"

అని మమ్మటాచార్యుడు కవిసృష్టిని విశ్లేషించిన తీరు కవితా లక్షణమునే ప్రపంచించుచున్నది. కావ్య ప్రయోజనమును భంగ్యంతరముగా ఉద్ఘోషించుచున్నది. కేవలము సత్యకథనమే కావ్యకథము కాదను పరమార్థమును ఉద్బోధించుచున్నది. సత్యకథనమును త్రోసిరాజనుచున్నప్పుడు కావ్యము శాస్త్రమర్యాదలను అతిక్రమించుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ కారణముచేతనే "శాస్త్రేషు హీనాః కవయోభవన్తి, కావ్యేన హన్యతే శాస్త్రమ్" అను అభియుక్తోక్తులు ప్రాచుర్యమును పొందినవి. కేవలము పదార్థముల యథార్థ తత్త్వదర్శనమును కాక, వానికిని మానవుల మానసికానుభూతులకును ఉన్న సన్నిహితత్త్వమును రమణీయముగా రసాత్మకముగా వ్యంజించుటయే కవితా లక్షణము. ఇట్లు కవిత్వము అలౌకికతాగంధమును పులుముకొనుచున్నది. ఇట్టి కవిత్వ లక్షణములో కవిసమయతత్త్వము ప్రతిబింబించుచుండుట సహజసిద్ధము. కవిసమయమనగా అశాస్త్రీయమైన అలౌకికమైన పరంపరాయాతమైన అర్థకల్పనము కదా! కవితా లక్షణలక్షితమగుచునే కవిసమయము కావ్యరసాస్వాదనమునకు ఉపస్కారకమైన అంశముగా సహృదయ సమాజమున ప్రధానస్థానమును ఆక్రమించుకొనుచున్నది. కలువలేమ పగటివేళ విరాళిని అనుభవించుచున్నదన్నప్పుడు, కలువలు రాత్రియందే వికసించునట్లు వర్ణింపబడెనను కవిసమయ పరిజ్ఞానమున్ననే గదా ఆ వర్ణనములోని సారస్యము నెరుగగలుగుట. వృక్షదోహదములనుగూర్చి తెలియకపోయినచో పద్మినీజాతి నాయికల సౌందర్యోత్కర్షను వ్యంజించుటకు కవులు చేసిన వర్ణనములన్నియు వ్యర్థములే కదా!

కవిసమయములన్నియును రసాభివ్యంజకతను ప్రతిపాదింపదలచుకొన్న కవులకు శిక్షారూపమున మార్గదర్శకములగుచున్నవి. కావ్యగతములైన అనేక రహస్యములను (మర్మములను) తెలిసికొనుటకు ఇవి తోడ్పడుచున్నవి. పీతరక్త వర్ణములకు ఐక్యము చెప్పవచ్చునను కవిసమయ పరిచయములేనిదే స్వర్ణపరాగ అగ్ని జ్వాలలందున్న పీతత్వ (పసుపుపచ్చ) రక్తత్వము (ఎరుపు) లకు ఏకత్వము ఉన్నదను సంప్రదాయము అవగతము కాదు. క్షీరలవణ సముద్రములకు ఐక్యము చెప్పుచున్న కవిసమయము కవులకెంత ఉపకారమొనర్చునో వేరుగా చెప్పనవసరము లేదు.

కవిసమయములు కేవలము అసత్యకల్పనములు కావు. కొంతేనియు సత్యము ఆధారముకానిచో కావ్యసృష్టియే అసాధ్యముకదా! అనూహ్యము కదా! కవిసమయముల ద్వారమున కవులు జ్ఞాన విశేషములెన్నింటినో తెలుపుటకు ప్రయత్నింతురు. సమయశబ్దమునకు జ్ఞానము (సంవిత్తు) అను అర్థము కూడ ఉన్నది పశుపక్ష్యాదులను గూర్చియు, తరులతాగుల్మాదులను గూర్చియు అనేక విషయములు ఈ కవిసమయములవలన తెలియవచ్చుచున్నవి. సముదాచారములను గూర్చియు, బాహిరప్రకృతి స్వరూప స్వభావాదులను గూర్చియు అనేకాంశములు ఈ కవిసమయములు వెల్లడిచేయగలుగుచున్నవి. అస్తినాస్తి విచికిత్సా హేతువైన సత్యము కవిసమయగతమై పరమరమణీయముగా ఉండును. బీజప్రాయముగా ఉన్న ఈ సత్యమును ఆధారముగా చేసికొని సత్యగవేషణా తత్పరుడు మహావృక్ష సాక్షాత్కారమును పొందగలడు. స్థూలముగా దృష్టి గోచరము కానంతమాత్రమున ఆ విషయములే అసత్యములనుట తొందరపాటే అగును.

కవిసమయములలో స్థానము గడించుకొని నామరూపములు లేకుండ మృగ్యములైపోయిన పశువులు పక్షులు తీవలు తరువులు అసంఖ్యాకములు. సృష్టిలోని చరాచరముల క్రమవికాసములను మనము ఇంచుక పరిశీలించితిమేని ఈ విషయము స్పష్టముగా అవగతము కాగలదు. సువిశాలమైనది ఈ ప్రపంచము. ఈ భూగోళమునందు ఒకే విధమైన మృత్తిక భూమి అంతటను లేదు. ఒకే విధమైన తరువులు అన్ని ప్రాంతములందును లేవు. పశు పక్షి మనుష్యాది జీవసంతతి లక్షణములలో వైవిధ్యమున్నది మన భారతదేశమునే తీసికొందుము. ఇట శీతోష్ణపరిస్థితులు, పశు పక్ష్యాదులు, తరులతా గుల్మాదులు

ప్రజా జీవిత విధానములు ఇత్యాద్యంశములలో కొట్టవచ్చినంత వైవిధ్యము కానవచ్చుచున్నది. ఆయా ప్రాంతములందలి జనులకును కవులకును మనోహర ములుగానో భయంకరములుగానో జుగుప్సావహములుగానో కన్పట్టు పదార్థ ములు అనేకములుండును. ఆయా ప్రదేశములందలి ప్రకృతి వింతలు విను చున్నప్పుడు చదువుచున్నప్పుడు మనకు దిగ్భ్రాంతికలిగి కలయో మాయయో అనిపించును. ఇటీవల సహారా ఎడారిలో ఇప్పుడున్న ఏనుగుకంటె ఎనిమిదిరెట్లు పెద్దదైన ఏనుగు అస్థికంజరమును జంతుశాస్త్రజ్ఞులు కనుగొనిరట. ఖడ్గమృగ ములు, సింహములు, పులులు, కొన్నిరకములైన పక్షులు మృగములు ఇప్ప డరుదై పోవుచున్నవి. కార్చిచ్చులకు భూకంపములకు వరదలకు జనపద నిర్మాణములకు వేటలతాకిళ్లకు కాలపురుషుని ధార్ష్ట్యమునకు బలియైపోయిన అరణ్యములెన్నో! వనస్పతి సంపద ఎంతో! జంతుజాలమెంతో! ఇవన్నియు ఒకనాడు తమతమ విశిష్ట లక్షణములతో కవులను ఆకర్షించినట్టివే. జనులలో లేనివి, జగతిలో లేనివి కవితలకు ఎక్కుట చాల అరుదైన విషయము. అందుకే రాజశేఖరుడు—

"పూర్వేహి విద్వాంసః సహస్రశాఖ సాంగంచవేదమ
వగాహ్య, శాస్త్రాణిచావబుధ్య, దేశాంతరాణి,
ద్వీపాంతరాణిచ పరిభ్రమ్య యానర్థానుపలభ్య,
ప్రణీతవంతస్తేషాం, దేశకాలాంతరవశేన అన్యథాత్వేఽపి
తథాత్వేనోపనిబంధోయః స కవిసమయః కవిసమయ
శబ్దశ్చాయం మూలమపశ్యద్భిః ప్రయోగమాత్ర
దర్శిభిః ప్రయుక్తోరూఢశ్చ"

"తత్రకశ్చిదాద్యత్వేన వ్యవస్థితః కవిసమయేనార్థః
కశ్చిత్పరంపరోపక్రమార్థ స్వార్థాయ ధూర్తైః ప్రవర్తితః"

కావ్యమీమాంసలో చతుర్దశాధ్యాయమునందు కవిసమయములను నిర్వచించిన సందర్భమున వివరించియుండెను. రాజశేఖరుని కావ్యమీమాంసను తెనిగించిన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఈ అంశమునిట్లు వివరించిరి.

"ప్రాచీనులగు విద్వాంసులు సహస్రశాఖలుగలిగి, అంగోపాంగసహితమై యొప్పుచుండెడి వేదసమువగాహనము చేసికొని (అనగా వేదమును అర్థసహిత ముగా సాంగముగా సాంతముగా చర్చించి యనిభావము.) ఆయా శాస్త్రములం నెల్ల పూర్తిగా తెలిసికొని దేశదేశాంతరములను ద్వీపద్వీపాంతరములను పరిభ్ర మించి యే యర్థముల సేకరించి కూర్చిరో, అయ్యవి దేశము కాలము మున్నగునవి మారుచు దూరమగుచు వచ్చుటంజేసి, అన్యథాభావము నొందియున్నను, వానిని వానిని తొలుత సేకరించి కూర్చిన వారెట్లు గూర్చిరో, ఆ మార్గముననే పర్వాచీ కవులు కూర్చుచు వచ్చుట యెయ్యదిగలదో, అదియే కవిసమయమని చెప్పబడు చున్నది. ఇట్టి కవిసమయమును నీ మాటలోని తునకుదిగి మూలార్థమును చర్చింపకయే ప్రయోగమాత్రదర్శులగు కవులచేత తఱచుగా ప్రయోగింపబడి చివరకు అది పైని చెప్పిన యర్థమునందు రూఢము అగుచున్నది."

"ఇట్లు ఏర్పడిన కవిసమయములందు గూడ ఒక్కొక్కటి వెనుక చెప్ప బడిన రీతిగా తొట్టతొల్లింటి కవిసమయముచే నేర్పడినదై యుండును. మఱొక్కటి ఇటీవలి ధూర్తులు ఒకరినొకరు సమర్థించుకొని వెల్లడించకొనుటకై స్వార్థపర్వతమున ధూర్తులచే కల్పింపబడినదై కూడ యుండుట కలదు."

కవిసమయములు భావములను సంక్షిప్తముగా వ్యక్తము చేయుటకు సాధనభూతములు. ఇవి భాషలో జాతీయములుగా, అలంకారములుగా న్యాయములుగా లోకోక్తులుగా స్థిరపడిపోయి భావవినిమయమునకును సద్యః స్ఫురణమునకును, అర్థావగాహనమునకును, ఎంతేని తోడ్పడుచున్నవి. కన్నెఱ్ఱ జేయు. గుండెబ్రద్దలగువంటి పదబంధములు కవిసమయ సముద్భూతములే. యశోహాసములను ధవళిమతోను, అయశపాపములను కాళిమతోను ఉపమించు టకు కారణములు ఈ కవిసమయములే. కొన్ని కవిసమయములు న్యాయము లుగా (దృష్టాంతములుగా) తమ రూపములను తీర్చిదిద్దుకొన్నవి. చంద్రచకోర న్యాయము, మేఘచాతక న్యాయమువంటి వానిని ఇందు తార్కాణములుగా గ్రహింపవచ్చును. అశాస్త్రీయములైన ఈ కొన్ని న్యాయములు శాస్త్రబద్ధమై న్యాయముల సరసన చోటుకల్పించుకొని శాస్త్రపద్ధతిలోనికివచ్చుట కవిసమయ ముల విస్తృత ప్రభావమునుచెప్పక చెప్పుచున్నవి.

వేదచోదితములైన ధర్మములకు వ్యాఖ్యానప్రాయములైన పురాణము లందలి బహువిషయములను సూచించు ఈ కవిసమయములు ఒక విధముగా

పౌరాణిక విజ్ఞాన సంపదను విశ్వాసములను, కథలను అందించుచు, ప్రాచీన - ఆధునిక సాహితీ మర్యాదలకు కుసుమసేతువులుగా ప్రవర్తిల్లుచున్నవి. పురాణములేకాక ఎన్నియో శాస్త్రములకు సంబంధించిన రహస్యములు ఈ కవిసమయముల రూపమున అయాచితముగా అప్రయత్నముగా లభ్యములగుచున్నవి. సముద్రమునుండియు అత్రినేత్రమునుండియు పుట్టిన చంద్రులకు ఐక్యము చెప్పుటవంటి కవిసమయములు అందుకు నిదర్శనములుగా నిలిచి, సహృదయులకు పురాణపఠన జిజ్ఞాసను రేకెత్తింపజాలుచున్నవి.

మన సంస్కృతి రహస్యములను మహత్వమును తెలుపుచునే ఈ కవిసమయములు మన జాతీయ సంప్రదాయమునందలి కవితాంశమును సాక్షాత్కరింపజేయుచున్నవి. కావున భారతీయాత్మావిష్కరణమునకు కవిసమయములు కూడ అత్యంతోపయుక్తములై విలసిల్లుచున్నవి.

కవిసమయములందున్న పదార్థముల సుందరములైన లక్షణములకును, జాతీయ జీవనమునందు సుప్రతిష్ఠితములై ఉన్న సౌందర్యాదర్శములకును ఈ కవిసమయములు లక్ష్యప్రాయములై జనుల సమకాలిక జీవనమునకు వారి ఊహాలోక స్వరూప స్వభావములకు దిఙ్మాత్రముగా సూచికలగుచున్నవి.

కవిసమయములు కావ్యములకు సౌందర్యమును సంతరింపజేయు ప్రధాన సాధనములు. అని న్యాయముగా అలంకారములు కాకపోయినను, అలంకార సృజనమునకు హేతుభూతములుగా వరలుచున్నవి.

కావ్యప్రపంచమునందు రూఢములైపోవు తత్త్వముల కంటెను, వర్ణనామర్యాదల కంటెను కవిసమయములు విశిష్టములు. విభిన్నములు. రూఢుల అవధులను దాటిపోయి, అవి అభివ్యక్తీకరణ కౌశలమునకు కొలమానములుగా ప్రమాణములుగా భాసిల్లుచుండును

ప్రౌఢిమకు అనగా భావముల కుదింపునకును, భావ సంశ్లిష్టీకరణమునకు ఈ కవిసమయములు కవులకును సహృదయులకును ఉపయోగపడుననుటలో సందేహము ఉండకూడదు. కవిసమయ ప్రభావముచేత వర్ణనములు పాఠకునకు అవలీలగా అవగతములగును. యువతి పాదాఘాతముచేత అశోకము కుసుమించెనని కవి వర్ణించినపుడు సహృదయునకు అందునను కవిసమయ రహస్యమెరిగిన

సహృదయునకు ఆ యువతి పాదములెట్టివనియును ఆమె పద్మినీజాతికి చెందిన స్త్రీ అనియును బోధపడును.

సాహిత్యశాస్త్రాచార్యులలో అనేకులు కవిసమయములకు అంతగా ప్రాముఖ్యము నీయలేదు. అలంకారసామగ్రిగా భావించి వదలివేసినారు. కనుకనే వీని వివేచనము అంతగా జరిగియుండలేదు. సంప్రదాయమునకున్న ప్రాబల్యము అట్టిది. గతానుగతికముగా జనులలో కవులలో ప్రాచుర్యము నందుకొన్న ఈ కవిసమయములు జాతీయ జీవనమునందలి సౌందర్య భావమును సువ్యక్తము చేయుచున్నవి. వీని తత్త్వమును తెలిసికొన్నప్పుడు, కావ్యము లందు ఇవి ప్రయుక్తములైన ఘట్టములు వరణీయములుగా రమణీయములుగా భాసించును.

దేశ ప్రజలకు ఏ పూవులన్న మక్కువ? ఏ రంగులన్న అనురాగము? ఏ పక్షులన్న ప్రేమ? ఏ పక్షుల నడకలు ఆకర్షణీయములు? ఏయే వేళలు ఏయే కాలములు ఏయే ధ్వనులు తమకు ప్రీతిపాత్రములు? తమ కట్టులో, బొట్టులో జుట్టులో ఏది ఉన్నప్పుడు గుణమో, ఏదిలేనప్పుడు దోషమో, ఏది సొగసో ఏది దొసగో కవిసమయములే చెప్పగలవు. ప్రజల మనస్సులు సౌందర్యమునకు సంబంధించినంత మేరకు కవిసమయములలో కనపడియు కనపడనట్లు ఒదిగియుండును. ఈ ప్రజల మనోవ్యాపారమే కవుల హృదయ సంస్కార నిర్మాణమునకు మార్గదర్శకమగునను యాథార్థ్యము విజ్ఞులెరుగనిది కాదు.

కవిసమయ తత్త్వపరిశీలనమునకు, కావ్యతత్త్వ పరిశీలనమునకు నడుమ నున్న యువనిక కడుసున్నితమైనది. సూక్ష్మమైనది. ఈ తెర అభాసమువంటి దన్నను ప్రమాదము లేదు.

# కవి సమయములు

## షష్ఠమ ప్రకరణము

### ఉపసంహారము

వాస్తవిక ప్రపంచమునకు భిన్నముగా తోచు కవిసమయములకును కేవల కల్పనములకును భేదమున్నది. కవిసమయగతమైన అంశము అనుకరణము కాదు. వానికి భిన్నముగా వినూత్న సృష్టి జరిగినచో అది కవి ప్రతిభాజన్యముగా మాన్యతను పొందును. మరి ఆ నూత్న సృష్టిని ఎవ్వడేని అనుకరించినచో ఆ సృష్టికి అనుకరణదోషమంటును. కాని వేద పురాణేతిహాసకాలమునుండి నేటిదనుక సాగుచున్న సంప్రదాయబద్ధమైన కావ్యజగత్తులో కవిసమయముల ప్రయోగము తైలధారావదవిచ్ఛిన్నముగా సాగుచుండినను వానికి అనుకరణ దోషము పట్టలేదు. మీదు మిక్కిలి అవి కవి ప్రతిభాదర్శనమునకు స్వతస్సిద్ధ సాధకములుగా పరిణమించుచు వచ్చుచున్నవి. వరదను ప్రవాహమనరు. ఒడ్డులను ఒరసికొని పోవుచున్నప్పుడే అది ప్రవాహమగును. కవి ప్రతిభ కూడ ప్రవాహము వంటిది. పరితృహృదయములను రసాధీనమొనర్చుటకు కవి తనకు ఇచ్చవచ్చిన రీతిని గాక కొన్ని నియతములైన ధర్మములను అనుసరింపవలసి వచ్చును. ఆ ధర్మములు భాషాసంబంధములైనవి కావచ్చును; సంప్రదాయ సంబంధములైనవి కావచ్చును ప్రజాబాహుళ్యమునందు సుప్రతిష్ఠితములైన విలువలకును ఆదర్శములకును అనుకూలముగా ఉన్నప్పుడే రచనలు మహాకావ్య శబ్దవాచ్యములగును. సంగీతముకాని, భాషకాని, ఉన్నది ఉన్నట్లుగా శంపాలతా సన్నిభముగా పుట్టదు. తరతరముల కృషికి అది ఫలితముగా ఉండును. ప్రజల సౌందర్యాదర్శములేమి; భౌతిక - ఆధిభౌతికవిశ్వాసములేమి, దైనందిన జీవితానుభవములేమి, తలస్పర్శిగా తెలియకపోయినచో కావ్యప్రయోజనమే ఉడిగిపోవును. ఇవి అన్నియును కవిసమయములతో పెనవేసికొని పోయినవి.

నేటికిని విద్వత్కవుల రచనలలో సంప్రదాయ సిద్ధముగా మనకు అందిన కవిసమయములు ప్రత్యక్షములగుచున్నవి. వానిని ప్రాచీనములనియును నిరర్థకము లనియును అభూతకల్పనములనియును అవాస్తవిక కల్పనములనియును మిథ్యా కథనము లనియును త్రోసిరాజని తూష్ణీంభావమును వహించినచో విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము, పింగళికాటూరి సౌందరనందము, గడియారమువారి శివభారతము, రాజశేఖరశతావధానిగారి రాణాప్రతాప సింహ చరిత్రము, మధునాపంతులువారి ఆంధ్రపురాణము, వానమామలై వరదాచార్యులవారి పోతన చరిత్రము, నారాయణరెడ్డిగారి కర్పూర వసంత రాయలు, దాశరథిగారి అగ్నిధార మున్నగు జనప్రియములైన మహాకావ్యముల మాట అటుంచి, ప్రాచీన కవితారీతులపై దండెత్తిన అభ్యుదయ కవి మూర్ధన్యుడు శ్రీశ్రీ మహాప్రస్థానము కూడ అర్థము కాదు. సంప్రదాయ ప్రభావమే అననేల ? కవిత్వతత్వమునే పరిశీలించినచో దానికి కొత్తపాతలు లేవనియు, అది కొత్తపాతల మేలికలయిక అనియు నిత్యనూతనమనియు స్పష్ట మగును. కొత్తసూర్యుడు పాతసూర్యుడు ఉండరు. కొత్తహృదయము పాత హృదయము ఉండవు. నిన్న కావ్యజగత్తులో కవిసమయములు రసానుభూతికి కారణముగా ఉండెననుటయు, నిన్న వెన్నెల చల్లగా ఉండెననుటయు ఒక్కటియే.

కవిసమయములను విశ్లేషించు పట్టులలో వానిలో కొంత సత్యము లేక పోలేదను రాజశేఖరుని అభియుక్తోక్తి నా మననమననమునకు ఊతగా పనిచేసినది. కవిసమయమునకు రాజశేఖరుడు ఒసగిన సుస్పష్టమైన నిర్వచనకరదీపికతో కవిసమయములలోని విశేషములను ఎన్నింటినో చూచుటకు ప్రయత్నించితిని. నా కనుచూపునకు ఆనినంతమేరకు నా ఈ ప్రయత్నము కొనసాగించితిని.

విశ్వసాహిత్యమునందు ఈ కవిసమయముల స్వరూప స్వభావములను గూర్చి పరిశోధనలు జరుగవలసి యున్నది. ఆయా దేశములందలి ప్రజల అభిరుచు లను అందచందాలపట్ల వారికి ఉన్న విలువలను, తీరుతెన్నులను ఈ కవి సమయములు కొంతవరకేనియు తెలుప సమర్థములు. కవితాత్మ విశ్వజనీన మను పరమయాథార్థ్యమును నిరూపించుటకు ఈ కవిసమయములను విశ్లేషించవలసిన అగత్యము ఎంతేని ఉన్నది.

నేను విశ్లేషించిన కవిసమయములన్నియును ప్రాచీనాలంకారికులు పేర్కొన్నవే. ప్రాయకముగా ఇవి అన్నియును పురాణేతిహాసములకో, ప్రకృతి

అభూతకల్పనములు కావా? శాస్త్రములముందు ఇవి నిలబడగలవా? ఇత్యాది ప్రశ్నలు ఉదయింపకమానవు. కవిసమయ తత్త్వమునకును కావ్యతత్త్వమునకును సామ్యమే కాని వైషమ్యము లేదను సత్యము సూక్ష్మపరిశీలనము చేసినమీదట గాని అవగతము కాదు. అప్పుడే కవిసమయములలోని విశ్వజనీనదృక్పథము బహిర్గతమగును. వీనికి శాస్త్ర మర్యాదను సవదరింపజేసిన రాజశేఖరుని సిద్ధాంత మునకు ఏ కారణముచేతనో విశేషప్రచారము కలుగలేదు. ఆయన కాలము నాటికే కవిసమయము లుప్తమై ఉండెనట. తన బుద్ధికి తోచిన విధమున దానిని ఆయన ఉద్ధరించెనట. కవి శిక్షారూపమున అవి నిలిచిపోయి కవులకు మార్గ దర్శకములుగా ఉండిపోయినవి. వాని సత్యాసత్యముల జోలికిపోక కవులు, వానిని తమ కావ్యములందు ఉపయోగించి, జనవ్యవహారమునకు సన్నిహితము చేసిరి. జనులలో అవి విశ్వాసములుగా నిలిచిపోయినవి. వాని లోతుపాతులను తెలిసికొను ప్రయత్నములు జరుగకుండుటవలన, వానికి కాలదోషము పట్టినదను దురభిప్రాయము ప్రబలిపోవుచున్నది. వాని యథార్థస్వరూపమును తెలిసినచో అవి కావ్యాత్మధ్వని అను సిద్ధాంతమును నిరూపించుటకు సాధనభూతములగు ననుటలో సందేహము లేదు.

కేవలము ఆలంకారికులు పేర్కొనిన కవిసమయములనే విశ్లేషించుటయా? ఆధునిక కాలమున కవిసమయములు కొత్తగా పుట్టుకొని రాలేదా? ఈ విధమైన ప్రశ్నలు సమాధేయములే.

నేటి కవితా ప్రపంచమున లౌకిక దృక్పథమునకును శాస్త్రీయ దృక్పథ మునకును ప్రాధాన్యము మిక్కుటముగా పెరిగిపోవుచున్నది. సంప్రదాయాను సరణము కంటె సంప్రదాయవిచ్ఛేదమే కవిత్వమున ఎక్కువగా గోచరించు చున్నది. ఒకనివలెకాక ఒకనికి మించి మరొకడు వాస్తవిక దృష్టికి సన్నిహిత ముగా ఉండునట్లు రచనలు చేయుచున్నాడు. వాస్తవికదృష్టి ప్రబలుచున్న కొలదియు దైనందిన జీవిత సమస్యలే కావ్య వస్తువులుగా రూపొందుచున్నవి. ఊహాసౌందర్యముకంటె వాస్తవిక చిత్రణమే కవితా లక్ష్యమగుచున్నది. జన సామాన్యములో సామాజిక స్పృహను కలిగించు ఉద్దేశముతో వ్యంగ్యార్థ ప్రతిపాదనమునకు నేటి కవులలో పలువురు స్వస్తి చెప్పుచున్నారు. కవిత్వము వాచ్యమైపోవుచున్నది సంప్రదాయాభిజ్ఞత కొరవడుచున్నది కవి వ్యుత్పన్నుడు

కానక్కరలేదను మరూహా రచయితలలో పేరుకొని పోవుచున్నది. కనుకనే రచనలు తాత్కాలిక ప్రయోజనమును సాధింపగలుగుచున్న వే కాని సార్వజనీన, సార్వకాలీన భావములను వెదజల్లి పఠితలకు చేతోమోదమును గూర్చలేకపోవు చున్నవి. లోకశాస్త్ర పరిధులను దాటిపోకుండ రచనలు సాగింపవలెనను ధోరణికి ప్రాచుర్యము కలుగుచున్న ఈ దినములలో అలౌకిక అశాస్త్రీయ సంప్రదాయ లక్షణ లక్షితములైన కవిసమయములు పుట్టుటకు అవకాశములేకుండ పోవు చున్నది అయినను గుండెలలో రైళ్లు పరుగెత్తుట వంటి కవిసమయములు సకృత్తుగా ప్రచారములోనికి వచ్చుచున్నవి. ఇట్టివి ఎట్లు కవిసమయములగునో కావో విచారింపవలసి ఉన్నది. ఇప్పుడు సుందరములైన కల్పనలు, కొన్నినాళ్లకు కవిసమయరూపమును దాల్చవచ్చును.

కేవలము లోకానుభవపరిధులను దాటుటయేకాదు, శాస్త్ర మర్యాదలను పాటింపకపోవుటయేకాదు, ప్రశ్నించుటకు వీలులేని సంప్రదాయబలమును సమకూర్చుకొన్నప్పుడే కాని ఏదేని వర్ణనాంశము కవిసమయముగా రూపొంది ప్రాపుచెందదు. అయిదువేలేండ్లకు మించిన వయస్సున్న భారతీయుల ప్రాచీన కవితలలో కవిసమయములుగా నిలిచిపోయినవి నూరో నూటయేబదియో, అంతే! ఇంక అయిదారు దశాబ్దముల కవిత - అందునను సంప్రదాయమునకు ఎదురుతిరిగిన కవిత ఎన్ని కవిసమయములను సృష్టించుకొనగలదు? సంప్రదాయ బద్ధమైన కవితామార్గము, సంప్రదాయ విచ్ఛేదకమైన కవితామార్గము సమానాంతరముగా సాగిపోవుచున్న తెలుగు సాహిత్య ప్రపంచమున కవిసమయ ములు క్రొత్తగా పుట్టుకొనివచ్చి నిలిచిపోగలుగుట సంభవమా? ఏమో! కాలమే దీనిని నిర్ణయించగలదు.

కవిసమయ ప్రపంచము రహస్యమయము. దాని మూలమును తెలిసి కొనుట "ఏరులజన్మంబు", "మునుల జన్మంబు" తెలిసికొనుట వంటిది అనాది కాలమునుండి వచ్చుచున్న విశ్వాసములో, పురాణగాథలో, పెద్దలసుద్దులో, ఆప్తవాక్యములో, అశాస్త్రీయములుగా అందములుగా అల్లుకొనిపోయిన ఊహాలో, వీనికి మూలములు కావచ్చును. ఇదమిత్థముగా ఇదే మూలమని చెప్పుట నా పరిశోధనోద్దేశము కాదు. కవిసమయముల విశ్లేషణము కావ్యరసా

స్వాదనమునకు ఎట్లు ఉపస్కారకములగునో, వాని అదర్శ ప్రయోజనము లేమో వివరించుటయే నా ప్రయత్నముగా భావించినాను.

నా ఈ ప్రయత్నము విద్వల్లోకమునకు ఏ మాత్రము సంతృప్తిని కలిగించి నను నేను కృతార్థుడనే.

"నమోఽస్తుతే భ్యోవిద్వద్భ్యో యేఽభిప్రాయం కవేరిమాం
శాస్త్రలోకాసపాస్యైవం నయన్తి నయవేదినః"

—భామహుడు

—o—

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

# కావ్యమీమాంస - (రాజశేఖరుడు)

## చతుర్దశోఽధ్యాయః

### జాతిద్రవ్యక్రియా సమయస్థాపనా

అశాస్త్రీయమ లౌకికంచ పరంపరాయాతం యమర్థ
ముపనిబధ్నన్తి కవయః సకవిసమయః

'నన్వేపదోషః కథఙ్కారం పునరుపనిబద్ధన్వాః?' ఇతి ఆచార్యాః. 'కవిమార్గానుగ్రాహీ కథమేవదోషః?' ఇతి యాయావరీయః. 'నిమిత్తం తర్హి వాచ్యమ్' ఇతి ఆచార్యాః. 'ఇదమభిధీయతే' ఇతి యాయావరీయః.

'పూర్వేహి విద్వాంసః సహస్రశాఖం సాఙ్గేచ వేదమవగాహ్య, శాస్త్రాణి చావబుధ్య, దేశాన్తరాణి ద్వీపాన్తరాణిచ పరిభ్రమ్య యానర్థానుపలభ్య ప్రణీత వంతస్తేషాం దేశకాలాన్తరవశేన అన్యథాత్వేనోపనిబన్ధోయః స కవిసమయః. కవిసమయశబ్దశ్చాయం మూల మపశ్యద్భిః ప్రయోగమాత్ర దర్శిభిః ప్రయుక్తో రూఢశ్చ'.

"తత్ర కశ్చిదాద్యత్వేన వ్యవస్థితః కవిసమయేనార్థః కశ్చిత్పరం పరోక్రమార్థం స్వార్థాయ ధూర్తైః ప్రవర్తితః."

'స చ త్రిధా స్వర్గ్యో భౌమః పాతాలీ యశ్చ.

స్వర్గపాతాలీయ యోర్భౌమః ప్రధానః. సహి మహా విషయః సచ చతుర్ధా జాతి ద్రవ్యగుణక్రియా రూపార్థతయా తేఽపి ప్రత్యేకం త్రిధా, అసతో నిబన్ధనాత్, సతోఽప్యనిబన్ధనాత్, నియమతశ్చ".

తత్ర సామాన్యస్యాఽసతో నిబన్ధనంయథా. నదీషు పద్మోత్పలాదీని, జలాశయ మాత్రేఽపి హంసాదయో, యత్ర తత్ర పర్వతేషు సువర్ణరత్నాదికంచ.

... ... ... ... ... ...

సతోప్యనిబన్ధనం. తద్యథా న మాలతీవసన్తే, న
పుష్పఫలం చన్దనద్రుమేషు, న ఫలమశోకేషు.

... ... ... ... ... ...

అనేకత్ర ప్రవృత్తవృత్తీ నామేకత్రాచరణం నియమ
స్తద్యథా. సముద్రేష్వేవ మకరాః తామ్రపర్ణ్యామేవ మౌక్తికాని.

... ... ... ... ... ...

అసతోఽపి ద్రవ్యస్య నిబన్ధనం తద్యథా. ముష్టిగ్రాహ్యత్వం
సూచీభేద్యత్వం చ తమసః కుమ్భోపవాహ్యత్వం చ జ్యోత్స్నాయాః

... ... ... ... ... ...

ద్రవ్యస్య సతోఽనిబన్ధనం తద్యథా. కృష్ణపక్షే
సత్యా అపి జ్యోత్స్నాయాః, శుక్లపక్షే త్వన్ధకారస్య.

... ... ... ... ... ...

ద్రవ్యనియమస్తద్యథా. మలయ ఏవ చన్దనస్థానం,
హిమవానేవ భూర్జోత్పత్తిస్థానమ్.

... ... ... ... ... ...

ప్రకీర్ణకద్రవ్య కవిసమయస్తు తద్యథా, క్షీరక్షార
సముద్రయోరైక్యం సాగరమహాసముద్రయోశ్చ.

... ... ... ... ... ...

అసతోఽపి క్రియార్థస్య నిబన్ధనం యథా చక్రవాకమిథునస్య
నిశిభిన్నతటాశ్రయణం చకోరాణాం చన్ద్రికాపానంచ.

... ... ... ... ... ...

సతోఽపి క్రియార్థస్యానిబన్ధం తద్యథా. దివానీలోత్పలానా
మవికాసో, నిశానిమిత్తశ్చ శేఫాలికా కుసుమానామవిస్రంసః.

... ... ... ... ... ...

నియమస్తు తద్యథా. గ్రీష్మాదౌ సమ్భవతోఽపి కోకిలానాం విరుతస్య
వసన్త ఏవ, మయూరాణాం వర్షాస్వేవ విరుతస్య నృత్తస్యచ నిబన్ధః.

... ... ... ... ... ...

## పంచదశోఽధ్యాయః గుణసమయ స్థాపనా

అసతో గుణస్య నిబన్ధనం యథా, యశోహాసప్రభృతేః శౌక్ల్యమ్,

నారాయణ మాధవయోశ్చ

... ... ... ... ... ...

ఏవం దామోదరశేషకూర్మాదేః కమలాః సమ్పదోశ్చ.

... ... ... ... ... ...

భౌమ స్వర్గ్య వత్పాతాలీయోఽపిక విసమయః

... ... ... ... ... ...

తత్ర నాగసర్పయోరైక్యమ్.

... ... ... ... ... ...

దైత్యదానవాసురాణామైక్యమ్, యథాతత్ర హిరణ్యాక్షు హిరణ్యకశిపు ప్రహ్లాద విరోచన బలిబాణాదయోదైత్యాః విప్రచిత్తి శమ్బరన ముచి పులోమప్రభృతయో దానవాః బలవృత్ర విథురస్త వృషపర్వాదయోఽసురాః... తేషామైక్యం.

... ... ... ... ... ...

ఏవమన్యేఽపి భేదాః
సోఽయం కవీనాం సమయః కావ్యే సుప్త ఇవస్థితః
స సామ్ప్రతమిహా స్మాభిర్యథాబుద్ధి విబోధితః.

## II. అలంకార చింతామణి - అజిత సేనుడు

ప్రథమాధ్యాయము 68-80.

కవీనాం సమస్త్రేధా నిబన్ధోపసస తత్సతః
అనిబన్ధస్య జాత్యాదేనియమేన సమానతః
అసతోఽపి నిబన్ధయథా—

"గిరౌ రత్నాది హంసాదిస్తోక పద్మాకరాదిషు
నీరేభాద్యం ఖంగాయాం జలజాద్యం న దీ ష్వపి
తమసః సూచ్య భేద్యత్వం ముష్టిగ్రాహ్యత్వముచ్యతే
అంజలి గ్రాహ్యతా చంద్రత్విషాకుంభో పవాహ్యతా
ప్రతాపే రక్తోష్ణత్వే కీర్త్యావాసాది శుభ్రతా

కృష్ణత్వ మపకీర్త్యాదౌ రక్తత్వం కోపరాగయోః
చతుష్టయం సముద్రస్య వియోగాశోక యోశ్శిఖ

చకోరాణాం సురాణాం చ జ్యోత్స్నా వాసం నిగద్యతే
రమయః పద్మవాసిత్వం రాజ్ఞోవక్షసి చ స్థితిః
సముద్ర మథనం తత్రసురేంద్ర శ్రీసముద్భవః

సతోఽప్యనిబన్ధో యథా—

చందనే ఫలపుష్పాచ సురభేమాలతీ సుమన్
శుక్లపక్షేతమోకృష్ణే జ్యోత్స్నా ఘేమశోకకే
రక్తిమా కామిదన్తేషు హరతత్వంచ కుందకే
దివాసనిశోత్పలాబ్జానాం వికాసిత్వం నవర్ణ్యతామ్

నియమేన నిబన్ధోయథా—

సామాన్యే నతు ధావళ్యం ఫల పుష్పాంబు హోసనాం
చందనం మలయేష్వేవ మఘామేవపికధ్వనిమ్
అంబుదాంబుధి కాకాహి కేశ భృంగేషు కృష్ణతామ్
బింబబంధూక నీరేషు సూర్య బింబేచ రక్తిమమ్
రవం నాట్యంమయూరాణాం వర్షాష్వేవివర్ణయేత్
నియమస్య విశోషోన్యః కశ్చిదత్ర ప్రకాశతే
భువనాని చతస్త్రోఽష్టౌదశవా కకుభోమతాః
వణౌ రలౌడ చైతే యమకేశ్లేష చిత్రయోః
నవిద్యంతే నిసర్గాను స్వారౌ చిత్రాయనో మతః.

## III. కావ్యాను శాసనము - హేమ చంద్రుడు

### ప్రథమాధ్యాయము

**శిక్షాం లక్షయతి—**

సతోఽప్యనిబంధోఽ సతోఽపి నిబంధో నియమశ్ఛాయా ద్యుప జీవనాదయ **శ్చశిక్షా.** సతోఽపి జాతిద్రవ్య గుణక్రియా దేరనిబంధనమ్, అసతోఽపి జాత్యే దేరేవ నిబంధనమ్. నియమోఽతి ప్రసక్తస్య జాత్యాదేరేవైకత్రావధారణమ్,

ఛాయాయాః ప్రతిబింబ కల్పతయా ఆలేఖ్య ప్రఖ్యతయా తుల్య దేహితుల్యతయా పరపుర ప్రవేశ ప్రతిమతయా చోప జీవనమ్. ఆదిశబ్దాత్పద పాదాదీనామ్ చ కావ్యాంత రాద్యర్థౌచిత్య ముపజీవనమ్. పునరాది పదాత్సమస్యా పూరణాద్యాః శిక్షా. తత్ర సతోఽపి సమానస్య నిబంధో యథా – మాలతీ వసంతే పుష్ప ఫలస్య చందన ద్రుమేషు ఫలస్యాశోకేషు

ద్రవ్యస్య యథా – కృష్ణ పక్షేసత్యాపి
జ్యోత్స్నాయాః శుక్ల పక్షేత్వంధకారస్య
గుణస్యయథా - దివానీలోత్పలానాం వికాసస్య
నిశానిమిత్తస్య శేఫాలికా కుసుమానాం విస్రంసస్య.

అసతోఽపి సామాన్యస్య నిబంధో యథా–
నదీషు పద్మ నీలోత్పలానాం జలాశయ మాత్రేపి,
హంసాదీనాం యత్ర తత్ర పర్వతే సువర్ణ రత్నాదీనామితి.

ద్రవ్యస్య యథా–
తమస్య ముష్టిగ్రాహ్యత్వస్య సూచీ భేద్యత్వస్యచ,
జ్యోత్స్నాయాంచ కుంభోపవాహ్య త్వాదేః,

గుణస్య యథా–
యశోహాసా దౌశ్శాక్లస్యమ్, అయశపాపా దౌకార్ష్ణ స్య
క్రోధానురాగయోర క్తస్య.

క్రియాయాయథా–
చకోరేషు చంద్రికాపానస్య, చక్రవాక
మిథునేషు నిశిభిన్నతటా శ్రయస్య.

జాతేర్నియమోయథా–
సముద్రేష్వ మకరాః తామ్ర పర్ణ్యామేవ మౌక్తికాని.

ద్రవ్యస్య యథా–
మలయ ఏవ చందనస్థానమ్ హిమవానేవ భూర్జోత్పత్తి సద్మ.

గుణస్య యథా–

సామాన్యో పాదానే రత్నానాం శోణతైవ,
పుష్పాణాం శుక్లతైవ, మేఘానాం కృష్ణతైవ.

క్రియాయాయథా—

గ్రీష్మాదౌ సంభవ దపి కోకిలరుతం వసంత ఏవ
మయూరాణాం వర్షాస్వేవ నియతం నృత్యం చేతి.

అథవా నియమః సమయః కవీనాం యథా—

కృష్ణనీలయోః, కృష్ణ హరితయోః, కృష్ణ శ్యామయోః పీతరక్తయోః శుక్ల గౌరయోః, చంద్రశశామృగయో, కామకేతనే మకర మత్స్యయోః, అత్రినేత్ర సముద్రోత్పన్న యోశ్చంద్రయోః, ద్వాదశ నామస్యాదిత్యానాం, నారాయణ దామోదర విష్ణుమాధవ కూర్మాదేః కమలాసంపదో, నాగ సర్పయోః, క్షీరక్షార సముద్రయోః, సాగర సముద్రయోపి.

దైత్య దానావాసురాణాం చైక్యం
తథా చక్షురాదేరనేక వర్ణోపి వర్ణనమ్
బహుకాల జన్మోఽపి శివచంద్రమసోర్బాలత్వం
కామస్య మూర్తత్వా మూర్తత్వం చేత్యాది.

## IV. అగ్నిపురాణము – కావ్యదోష వివేకము

అనేకస్య తథైకేన బహూనాం బహుభిః శుభా
కవీనాం సముదాచారః సమయోనామ గీయతే
సామాన్య స్య విశిష్టస్య స ధర్మ వద్భవతి ద్విధా
సిద్ధ సైద్ధాన్తికానాంచ కవీనాం వా వివాదితః.

యః ప్రసిధ్యతి సామాన్య ఇత్యసౌ సమయోమతిః
సర్వే సైద్ధాన్తికా యేవ సంచరంతి నిరత్యయమ్.
కియన్త ఏవ వా యేన సామాన్యస్తేన వాద్విధా
భేదసిద్ధాన్తతోఽన్యః స్యాత్కేషాం చిద్భ్రాన్తితోమయా.

తర్కజ్ఞానంమునేః కస్య చిత్ క్షణ భంగికా
భూత చైతన్య తాకస్య జ్ఞానస్య సుప్రకాశతా.

ప్రజ్ఞాత స్థూలతా శబ్దానే కాంతత్వం తథ్యార్థతః
శైవ వైష్ణవ శాక్తేయ సౌరసిద్ధాన్తి నాంమతిః.

జగతః కారణం బ్రహ్మ సంఖ్యానాం సప్రధానకమ్
అస్మిన్నసాస్వతీ లోకే సంచరంతః పరంపరమ్.
బధ్నన్తి వ్యతిపశ్యన్తో యద్విశిష్టః స ఉచ్యతే
పరిగ్రాహోదప్య సతాం సతామేవా పరిగ్రహాత్.

భిద్యమానస్య తస్యాయం ద్వైవిధ్యముప గీయతే
ప్రత్యక్షాది ప్రమాణై ర్య ద్వాధితమ్ తదసద్విదుః.
కవిభిస్తత్ప్రతి గ్రాహ్యం జ్ఞానస్య ద్యోతమానతా
యదేవార్థక్రియాకారి తదేవ పరమార్థసత్.

అజ్ఞానాజ్ఞాత తత్త్వే చ బ్రహ్మైవ పరమార్థసత్
విష్ణుః స్వర్గాది హేతుః శబ్దాలంకార రూపవాన్.
అపరా చపరావిద్యా తాం జ్ఞాత్వా ముచ్యతే భవాత్.

## V. కావ్యకల్పలతా వృత్తి - అరిసింహ అమర చంద్రులు

### ద్వితీయ ప్రతానము

అసతోఽపి నిబన్ధేనానిబన్ధేన సతోఽపిచ
నియమేనచ జాత్యాదేః కవీనాం సమయస్త్రిధా.

అసతోఽపినిబన్ధనోయథా —

రత్నానియత్ర తత్రాద్రౌ హంసాద్యల్పజలాశయే
జలేభాద్యం నభోనద్యా మంభోజాద్యం న దీష్వపి.
తిమిరస్య తథాముష్టిగ్రాహ్యా సూచి విభేద్యతామ్
అంజలి గ్రాహ్యతా కుంభోప వాహ్యత్వే విధుత్విషః.
శుక్లత్వం కీర్తిహాసాదౌ కార్ష్ణ్య దుష్కీర్త్య వాదిషు
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః.
నిశాయాం భిన్నతటాశ్రయణం చక్రవాకయోః
జ్యోత్స్నాపానం చకోరాణాం వర్ణయేదస దప్యదః

నియమోయథా—

ముక్తాస్తామ్రపర్ణ్యామేవ మకరానపి
భూర్జద్రూన్ హిమవత్యేవ మలయేష్వేవచందనమ్
సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వమేవహి
రక్తత్వమేవరక్తానాం పుష్పాణాం శౌక్ల్యమేవచ
తథా వసన్త ఏవాన్యభూతానాం ధ్వనితోద్భవమ్
వర్షాస్వేవ మయూరాణాం రుతం నృత్తం చవర్ణయేత్

నియమ విశేషోయథా—

నీలకృష్ణయోః హరితకృష్ణయోః శ్యామకృష్ణయోః
పీతపాటలయోః శుక్లగౌరయోర్నాగ సర్పయోః
మహార్ణవసాగరయోః క్షీరక్షారసముద్రయోః
ద్వాదశానామప్యర్కాణా వార్ధ్యత్రిదృగ్చంద్రయోః

చంద్రే శశేణయోర్విష్ణుశేషకూర్మాదికస్య చ
నారాయణ దామోదర మాధవ ప్రభృతేరపి
దానవాసురదైత్యానామైక్యమేవాభిసమ్మతమ్
దానవాస్తు విప్రచిత్తిః శమ్బరోనముచిస్తథా
పులోమాదయోఽథ దైత్యాహిరణ్యాక్ష్యోవిరోచనః
బాణోహిరణ్యకశిపుర్బలి ప్రహ్లాదకాదయః
అథాసురావృషపర్వ బలవృత్రాదయాస్మృతాః
స్త్రీణామక్ష్ణః కటాక్షాణాం శుక్లతాకృష్ణతాథవా
కృష్ణతాప్యథవా శుక్లశ్యామతాశుక్ల కృష్ణతా
బహుకాల జన్మోఽపి శివచంద్ర స్యబాలతా
మనోభవస్య మూర్తత్వాముర్తత్వమ్ చవర్ణ్యతే
దేవదేవీస్థితిం విద్యా నాయికానాయకక్రమమ్
స్వభవాన్ సర్వజీవానాం వ్యవస్థాదేశకాలయోః

## VI. కవికల్పలత - దేవేశ్వరుడు

అసతోఽపి నిబన్ధేనాఽనిబన్ధో సతోఽపివా
నియమేన చ జాత్యాదేః కవీనాం సమయస్తథా

అసతో౽పి నిబన్ధో యథా—

రత్నాని యత్ర తత్రాద్రౌ హంసాద్యల్పజలాశయే
జలేభాద్యం నభోనద్యామమ్భోజాద్యం నదీష్వపి
తిమిరస్య తథా ముష్టిగ్రాహ్యత్వం సూచిభేద్యతా
అంజలి గ్రాహ్యతా కుంభోపవాహ్యత్వం శశిత్విషః

శుక్లత్వం కీర్తిహాసాదౌ కార్ష్ణ్యం చాకీర్తిపాపయోః
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః
విభావర్యాం భిన్నతటాశ్రయణం చక్రవాకయోః
జ్యోత్స్నాపానం చకోరాణాం చతుష్కత్వం పయోనిధేః

సతో౽ప్య నిబన్ధో యథా—

వసన్తేమాలతీ పుష్పం ఫలపుష్పేచ చన్దనే
అశోకే చ ఫలం జ్యోత్స్నాధ్వాన్తే కృష్ణాన్యపక్షయోః
కామిదన్తేషు కున్దానాం ముకులేషుచ రక్తతా
హరితత్వం దివానీలోత్పలానాం చ వికసితా

వర్ణయేన్న సదప్యేతన్నియమో౽థ ప్రకాశ్యతే -
భూర్జత్వాగ్దివత్యేవ మలయేష్వేవ చన్దనమ్
సామాన్య గ్రహణే శౌక్ల్యం ఛత్రాంభః పుష్పవాససామ్
కృష్ణత్వం కేశకాకాహి పయోనిధి పయోముచాం

రక్తత్వం రక్తబన్ధూక బింబామ్భోజ బిబస్వతాం
తథావసన్తే ఏవాన్య పుష్టానాం కలకూజితమ్
వర్షాస్వేవ మయూరాణాం రుతం నృత్తంచ వర్ణయేత్
నియమస్య విశేషో౽థ పునఃకశ్చిత్ ప్రకాశ్యతే

కమలాసంపదయోః కృష్ణహరితో ర్నాగసర్పయోః
పీతలోహితయోః స్వర్ణపరాగాగ్ని శిఖాదిషు
చంద్రే కైశణయోః కామధ్వజే మకరమత్స్యయోః
దానవాసుర దైత్యానామైక్యమేవాభి సమ్మతమ్

బహుకాల జన్మనోఽపి శివచంద్రస్యబాలతా
మానవామౌలితో వర్ణ్యా దేవాశ్చరణతఃపునః

# VII. సాహిత్య దర్పణము - విశ్వనాథుడు

కవిసమఖ్యాతానిచ—

మాలిన్యం వ్యోమ్నిపాపే యశసి ధవలతా వర్ణ్యతే హాసకీర్త్యో
రక్తౌచి క్రోధరాగౌ సరిదుధతిగతం పంకజేందీవరాది
తోయాధారేఽఖిలేఽపి ప్రసరతిచ మరాలాదికః పక్షిసంఘో

జ్యోత్స్నా పేయా చకోరైర్జల ధరసమయే మానసం యాంతిహంసాః
పాదాఘాతాదశోకం వికసతి బకులం యోషితామాస్యమద్యైః
యూనామంగేషుహారాః స్ఫుటతిచ హృదయం విప్రయోగస్యతాపైః
మౌర్వీరోలంబమాలా ధనురథ విశిఖాః కౌసుమాః పుష్పకేతో

భిన్నం స్యాదస్య బాణైర్యువజన హృదయం స్త్రీకటాక్షేణతద్వత్
అహ్న్యంభోజం నిశాయాం వికసతికుముదం చంద్రికాశుక్లపక్షే
మేఘధ్వానేషు నృత్యం భవతి చశిఖినాం నాప్యశోకే ఫలంస్యాత్
న స్యాజ్జాతివసంతే న చ కుసుమఫలే గంధసారద్రుమాణా
మిత్యాద్యున్నేయ మన్యత్కవిసమయగతం సత్కవీనాం ప్రబంధే
ఏషా ముదాహరణాన్యాకరేషు స్పష్టాని

# VIII. భావప్రకాశనము - శారదాతనయుడు

## నవమాధికరణము

అనిబంధన మర్థానాం సతామపి విశేషతః
నిబంధనం పదార్థానాం అసతామపిత త్త్వతః
సతోనిబంధనం తద్వద సతోఽప్యనిబంధనం
ఏవం కవీనాం సమయస్త్రి ధైవ పరికల్ప్యతే
వసంతే చూతపుష్పాదేరనుత్పాదో న దుష్యతి
అనింబంధనమేత త్స్యాత్సతోఽస్యార్థస్య త త్త్వతః

సముద్రనద్యోః శైవాలపద్మాద్రేరప్య వర్ణనం
అయశః పాపయోః కార్ష్ణ్యంహాస కీర్త్యోశ్చశుక్లతా

యదప్య వర్ణనీయం స్యాల్లౌహిత్యం క్రోధరాగయోః
భూభృన్మాత్రే సువర్ణాదివర్ణనం ననిబధ్యతే
ఉదకాశయ మాత్రేఽపి హంసాదిర్నైవవర్ణ్యతే
కుముదాది వికాసస్తు రాత్రావేవేతి వర్ణ్యతే
శిఖండి తాండవం వర్షాస్వేవేతి పరికల్ప్యతే

## IX. అలంకారశేఖరము - కేశవమిశ్రుడు

పంచదశోః మరీచిః

ఇదానీం కవిసంప్రదాయస్య సర్వాపేక్షయాభ్యర్హితత్వం దర్శయన్నాహ—

అసతోఽపి నిబంధేన సతామప్యనిబంధనాత్
నియమస్య పురస్కారాత్సంప్రదాయస్త్రిధాకవేః
అసతోఽపీతి వస్తుగత్యా యన్న భవతి తదపి కవిభిర్నిబధ్యతే
రత్నాని యత్ర తత్రాద్రౌ హంసాద్యల్పజలాశయే
జలేభాద్యం నభోనద్యా మంభోజాద్యం నదీష్వపి

తిమిరస్య తథా ముష్టిగ్రాహ్యత్వం సూచి భేద్యతా
శుక్లత్వం కీర్తిపుణ్యాదౌ కార్ష్ణ్య చాకీర్త్యఘాదిషు
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః
జ్యోత్స్నాపానం చకోరాణాం శైవాలం సర్వవారిషు
కేసరాశోకయోః సత్ స్త్రీ గండూషాత్పాదఘాతతః
మాసాంతరేఽపి పుష్పాణి రోమాలిస్త్రివలిస్త్రియాం
సతామపీతి పారమార్థికమపి న నిబధ్యతే

యథా—

వసంతే మాలతీ పుష్పం ఫలపుష్పేచ చందనే
కామిదంతేషు కుందానాం కుడ్మలేషుచరక్తతా

నారీణాంశ్యామతాపాతః స్తనయోర్వ్యచ్ఛవాహ్యయే

నియమ వ్యేతి—

హిమవత్యేవ భూర్జత్వక్ చందనం మలయేవహం
హేమంత శిశిరౌత్యక్త్వా సర్వదా కమలస్థితిః
సామాన్య గ్రహణే శౌక్ల్యం పుష్పాంశశ్ఛత్రవాససాం
ధ్వజచామర హంసానాం హారస్యబక భస్మనోః
కృష్ణత్వం శైల వృక్షాది మేఘవారిధి వీరుధామ్
ఖిల్లికా చాసురాణాం ధూప పంక శిరోరుహాం
లౌహిత్యం ధాతుమాణిక్య జపారత్న శివస్త్వతామ్
పద్మపల్లవ బంధూక దాడిమీకరజాదిషు
పీతత్వం శాలిమండూక వల్కలేషు పరాగకే
వర్షాస్వేవ శిఖిప్రౌఢి మేఘూవేవ పికధ్వనిః

అన్యశ్చ—

కమలాసంపదోః కృష్ణహరితోర్నాగ సర్పయోః
పీతలోహితయోః స్వర్ణపరాగాగ్నిశిఖాదిషు
చంద్రేశమైణయోః కామధ్వజే మకర మత్స్యయోః
దానవాసుర దైత్యానామైక్యమేవాభి సంహితమ్

అపిచ—

చిరంతన స్యాపితథా శివచంద్రస్య బాలతా
మానవా మౌలితో వర్ణ్యా దేవాశ్చరణతఃపునః
భువనాని నిబంధీయత్రీణి సప్త చతర్దశ
చతస్త్రోఒష్టాదశ దిశశ్చతురః సప్త చాంబుధీన్
అష్టాదశస్మృతావిద్యాశ్చ వత్రస్నశ్చ చతుర్దశ
యేష్థలే తే జలే జీవా భిందన్త్యర్క ఇ ణేమ్యతాః
మహాత్వామాదౌ సర్గంతే సూత్మతామపి
శైలాదిర్భిద్యతే శబ్దాన్నభః శతధనూషి

నామ తత్తదుపాధౌ స్యాచ్ఛంకరో వృషవాహనః
చిహ్నత్వేచ వృషాంకోఽయం సత్యాద్వృషధ్వజః
శూలీ స సర్పీ గిరిశః శశి సహారిణీవిధుః
ఇందు మౌళిర్మహాదేవో గంగామౌలిర్నతుక్వచిత్

డలయోర్డలయోశ్చైవ వబయోః శస యోర్నభిత్
సానుస్వార విసర్గౌ చ చిత్రభంగాయ సమ్మతౌ.
ఇవవద్వాహిహీ హాస్మవతవైతు కిలైవచ
పదాన్యేతాని దేయాని పాదస్యాద్యే న జాతుచిత్
భూతేంద్ర భారతే శాస్త్రాప్యజ్మహచ్ఛబ్దో నిరర్థకం
దురర్థో బ్రాహ్మణే వృష్టిభోజ్యాషధపథాదిషు.

## X. అవయవవర్ణనము - ప్రసిద్ధోపమా సామగ్రి

**స్త్రీని** చంద్రకళా, సరోజమాలా, శిరీష, విద్యుత్, తారా, కనకలతా, రత్నశలాకా, దమనకయష్టి (దవనపు బొమ్మ) కాంచనయష్టులతో నుపమించ వచ్చును

**తనుద్యుతి** – గోరోచనా, స్వర్ణ, విద్యుత్, చంపక, కనక, కేతకీ ప్రభృతులతో.

**కచములను** – తమస్సు, శైవాలము, మేఘము, బర్హిపించము, భ్రమరములు, చామరములు, యమునా తరంగములు, నీలరత్నములు, నీలాబ్జములు, ధూమము, ధూపము మొదలగువానితో.

**వేణిని** – సర్ప, అసి, భృంగావళి, దండము (వేణీదండము) మొదలగు వానితో.

**ధమ్మిల్లమును** – రాహువు మొదలగు వానితో.

**కనుబొమ్మలు** - వల్లి, స్మరచాప, తరంగ, భృంగావళి. సర్ప, కృపాణక మలు, పల్లవములతో,

**కపోలములు** - చంద్ర, అదర్శము మొదలగువానితో,

**ముఖము** - చంద్ర, పద్మ, దర్పణములతో,

**నాసిక** - తిలప్రసూనము, సంపెంగ మొగ్గ, మన్మథ తూణీరములు, వంశము (నాసావంశము) పాటలీ పుష్పము మొదలగు వానితో,

**కంఠము** - శంఖము మొదలగు వానితో,

**నేత్రములు** - మృగనేత్ర, పద్మ, కుముద, ఝష, ఖంజన, చకోర నేత్ర. కేతకాళి, మన్మథ బాణములు, తుమ్మెదలు మొదలగువానితో,

(ఈ కాలమున "దాని కన్నులు చక్రాలవలెనున్నవి" అని నేత్రములకు చక్రములతోడను సాటిని చేయుచున్నారు).

**అధరములు** - ప్రవాళము, బింబము బంధూకము (మంకెన పువ్వు) జపాపుష్పము, పల్లవము మున్నగువానితో,

**దంతములు** - ముక్తా, మాణిక్య నారంగబీజ. దాడిమబీజ, కుందకోరకములు మొదలగువానితో,

**వాక్కులు** - మధురములైన హంస శుక, పిక, శారిక, వేణు వీణా నాదము మొదలగు వానితో,

**బాహువులు** - విద్యుల్లతలు, మృణాళములు, వల్లరులు మొదలగు వానితో.

**కరములు** - పద్మము, పల్లవము, విద్రుమము మొదలగు వానితో,

**నఖములు** - చంద్రకళలు, కుందకోరకములు, తారలు మొదలగు వానితో,

**స్తనములు** - పూగములు (పోకలు), తమ్మిమొగ్గలు, బిల్వఫలములు, తాటికాయలు, పూగుత్తులు, కరికుంభములు, కొండలు, కుండలు. చక్రములు, దబ్బపండ్లు, దానిమ్మపండ్లు మున్నగువానితో,

**వాపి** - పాతాళము, ఆవర్తము, హ్రదము, కూపము, నదము మొదలగు వానితో.

**వళులు** - పాశములు తరంగములు, సోపానములు, నిచ్చెన మొదలగు...

**పృష్ఠములు** - కాంచనపట్టము మొదలగు......

**నడుము** - ముష్టి గ్రాహ్యముగా, సూదిమొన, శూన్యము, అణువు, వేది, సింహము నడుము మొదలగు......

**జఘనము** - పులినము మొదలగు......

**నితంబము** - పీఠము, తపనీయశిల, చక్రము, భూమి మొదలగు......

**ఊరువు** - కరిహస్తము, కదళీకాండము, కరభము (మణికట్టుమొదలుకొని చిటికెన వ్రేలువరకు నుండెడి చేతివెనుకటి భాగము మొదలగు......

**చరణము** - పల్లవ, పద్మ, స్థల పద్మప్రవాళములు మొద......

**అంగుష్ఠనఖము** - పూర్ణచంద్రుడు మొదలగు......

**గమనము** - గజగమనము, హంసగమనము మొదలగు......

**కటాక్షములు** - యమునాతరంగములు, భృంగావళి, విషము, అమృతము మొదలగు...

**హాసము** - వెన్నెల, చంద్రుడు, పుష్పము, పీయూషము, ఫేనము, కైరవము మొదలగు......

**శ్వాసము** - పరిమళముతో పోల్చదగును.

**నూపురధ్వని** - హంస, సారస, ధ్వనులతో నుపమించవచ్చును.

శరీర తదవయవ గుణ విశేషములను తెలుపుదుము.

**శరీరమునకు :** సౌందర్యము, మార్దవము, అతికోమలత, కాంతి, జాజ్జ్వల్యమాన ఉజ్జ్వలత్వము, మొదలగునవి వర్ణ్యములు.

**కేశములకు:** దీర్ఘత్వము, కౌటిల్యము, మృదుత్వము, సాంద్రత్వము, నీలత్వము వర్ణ్యములు.

**కపోలములకు** : స్వచ్ఛత వర్ణ్యము.

**కంఠమునకు** : దీర్ఘత్వము, త్రిరేఖత్వము వర్ణ్యములు.

**నేత్రములకు** : స్నిగ్ధత, విశాలత, లోలత, అపాంగ దీర్ఘత, నీలత, ప్రాంత లౌహిత్యము, శ్వేతత్వము నిబిడపక్ష్మతయు వర్ణ్యములు.

**అధరములకు** : అత్యంత మాధుర్యము, ఉచ్ఛ్రాయత్వము, రక్తిమయు వర్ణ్యములు.

**దంతములకు** : తెలుపు, ఎఱుపు, 32 సంఖ్య గలిగియుండుట, అతిదీప్తత వర్ణ్యములు.

**వాక్కులకు** : మాధుర్యము, స్పష్టత మృదుత్వము వర్ణ్యములు.

**భుజములకు** : సమత్వము వర్ణ్యము.

**కరములకు** : అతిమృదుత్వము, శీతత్వము, శోణత్వము వర్ణ్యములు.

**స్తనములకు** : శ్యామాగ్రత్వము, ఔన్నత్యము, విస్తారము (బలుపు) దృఢత్వము, పాండుత్వము వర్ణ్యములు.

**రోమావళి** : మార్దవము, సౌక్ష్మ్యము, శ్యామత, నాభిప్రవేశము వర్ణ్యములు.

**జంఘములకు** : వృత్తాను పూర్వత్వము (మెలికలు తిరిగి యుండుట) కాంతి, అనతి దీర్ఘత్వమును వర్ణ్యములు.

**నిశ్వాసమునకు** : అత్యంత మందత, శైత్యము, అతిసుగంధత్వము వర్ణ్యములు.

## IX. కావ్యమార్గమున నేయేవస్తువు లేయే వర్ణములుగా వర్ణించవలయునో తెలుపుదుము

చంద్ర, ఉచ్చైశ్శ్రవ, శంకర, నారద, భార్గవ, బలరామ, శేషశరత్, ఐరావత, సింహ, సౌధ, శారదమేఘ, ఇందుకాంత, నిర్మోక (కుబుసము) మందార, హిమాద్రిహిమ, హంస, మృణాల, స్వర్గంగా, గజదంత అభ్రక, సికతా, అమృత, లోధ్ర, గుణ, కైరవ శర్కరలు **శ్వేతములు**.

కృష్ణ, చంద్రాంక, వ్యాస, రామ, ధనంజయ, శని, ద్రౌపదీ, కాళీ, విష, ఆకాశ అమావాస్య, శస్త్ర, అగరు, పాప, అంధకార నిశలును, మధత మాల, రాహువులు, అమృత, శృంగారములు **నీలములు**.

క్షాత్ర ధర్మము, త్రేతాయుగము, రౌద్రరసము, చకోర, కోకిలా పారావత నేత్రములు, వానరముఖము, తేజస్సు, అంగారకుడు, కుంకుమము, శుకుడు, జిహ్వా, ఇంద్రగోప, ఖద్యోత, విద్యుత్, కుంజర బిందువులును (ఏనుగు నొసలి మీది బిందువులు) శోణములు.

దీప, జీవ, ఇంద్ర, గరుడ, హరలోచనములు, హరజటాజూటములును, బ్రహ్మయును పీఠసమును, స్వర్ణము, కపి, ద్వాపరయుగము, గోరోచనము, కింజల్కము, చక్రవాకి, హరితాళము, మనశ్శిల పీతములు.

రజస్సు, సాలెపురుగు, ఒంటె, కపోతము, మూషకము, దుర్గ, కాకకంఠ స్వరము మొదలగునవి ధూసరములు.

సూర్యతురగములు హరితములు.

## ఋతువర్ణనము

కవులు కాలౌచిత్యమును పాటింపవలెను. వారు తమ కావ్యముల యందాయా ఋతువులను వర్ణింపవలయును. ఆ వర్ణనములందు వారు ప్రమాద పడకుండుటకై ఋతువర్ణనము జూపుదుము. జ్యోతిష్కులు సంవత్సరము చైత్రమాసముతో నారంభించునని యును, లోకయాత్రావేత్తలు శ్రావణ మాసమునో నారంభించునని యును చెప్పెదరు.

**వర్షఋతువు :** శ్రావణ భాద్రపద మాసములు వర్షర్తువు. ఈ ఋతువున, అందుగు వట, పుట్టగొడుగు, అడవి మొల్లలు, తంగోట్లు, గిరిమల్లిక, కడిమి, మద్ది, ఏరుమద్ది, మొగలి మొదలగు చెట్లు పుష్పించును. ఇంద్రగోపపురుగులు, వెన్నెల పులుగులు, చాతకములు, కేళ్లు, గోదురుకప్పలు, నెమళ్లు, సీరుకాకులు, గ్రద్దలు, వీనికి క్రొవ్వు పట్టును. బలాకాపక్షులు, (బెగ్గురు పిట్టలు) గర్భము ధరించును............రజస్సు, (ధూళి) శమించును. రాజులు యాత్రల నుండి నివర్తిల్లుదురు. వనభూములు శ్యామలములై యుండును. జలాసారమువలన

పర్వతములు కడగబడినట్లు రమ్యముగానుండును. నదులు ఒడ్డులొరసి ప్రవహించుచు నొక్కొక్కచోగట్లు తెగుట వలన లోకోపద్రవము కలిగించుచుండును. యతులను, చారులును తిరిగివత్తురు ప్రోషితభర్తృకలు భర్తలకై దారులు చూచుచుందురు. పాంథులు గృహములకు మరలుదురు. మేఘబృందముచే నాకాశము చీకట్లు గ్రమ్మును. దిఙ్ముఖముల మెరుగుతీగలు మెరుగిడుచుండును. మేఘగర్జనములచే వైడూర్య భూములందు రత్నాంకురములు పొటమరించును. కామినీ కాముకులు ఉద్యాన యాత్రలు చేయుదురు. సౌధోపరి భాగముల శయ్యలు గల్పింతురు. కస్తూరీ మిశ్రమగు చతుస్సమ విలేపనములు (చందన, కుంకుమ, కర్పూర, అగురు, మిశ్రితమగు మైపూత) బూసికొందురు. కృషీవల కుటుంబినీ బృందములు రాసక్రీడలాడుదురు. కడిమిపూల వాసనల పడమటి గాలిగాని, తూరుపుగాలి గాని వీచును.

**శరదృతువు :** ఆశ్వయుజ కార్తీక మాసములు శరదృతువు ఈ ఋతువులో, లకుముకి పిట్టలకు, తుమ్మెదలకు, కన్నెలేళ్లకు, హంసలకు, కాటుక పిట్టలకు, చక్రవాకములకు బెగ్గురు పిట్టలకు, కొక్కెరలకు, వృషభములకు, ఏనుగులకు, తాబేళ్లకు, కొంగలకు బేడిస చేపలకు క్రొవ్వుపట్టును. తామరలు, తెల్లకలువలు, నల్లకలువలు, ఎఱ్ఱకలువలు, మంకెనలు, కుంకుమ వృక్షములు, వావిలి, ఏడాకులఅరటి, రెల్లు మాలతీలతలు పుష్పించును. మయూరముల క్రొవ్వడగును. హంసలు మానస సరస్సు నుండి తిరిగివచ్చును. అగస్త్యోదయముచే జలములు కలకదేరును. ముత్తెపుచిప్పలు గర్భముదాల్చును. మింట తెల్లని మబ్బులుండును. మహానవమియందు శస్త్రాస్త్రపూజలు జరుగును. గుఱ్ఱములకును, ఏనుగులకును నీరాజనములు సేయుదురు. రాజులు యుద్ధయాత్రలకు వెడలుదురు. బాటలయందు బురద యెండును. సూర్యకిరణమును దుస్సహములుగానుండును. శ్రీమహావిష్ణువు నిద్రనుండి మేల్కొనును. పొలములలో వరి పండును. గోపికలు గీతములు పాడుదురు. ఈ ఋతువున నియతముగా వాయువు ఒక దిక్కునుండి వెడలక అన్ని దిక్కుల నుండి వీచును.

**హేమంతర్తువు :** మార్గశీర్ష పౌషమాసములు హేమంతర్తువు. ఈ ఋతువున మల్లె, ముచికుందము, లవలీ, ప్రేంకణము, లొద్దుగ సురపొన్నలు

పుష్పించును తుమ్మెదలకు, పాములకు, మయూరములకును క్రొవ్వరుగును. కామినులు కుంకుమ పువ్వును గంధతైలములను సేవింతురు. పెరుగు రుచ్యముగా నుండును. కామినీకుచములు నులివెచ్చగా నుండును. జనులు నులివెచ్చని జలముల స్నానమాడుదురు. స్త్రీలకు గాఢాలింగన సౌఖ్యమబ్బును. ఆడుపులులు ప్రసవించును. కూపజలములు గోర్వెచ్చగా నుండును. రేగులు, గారింజలును బాగుగా ఫలించును. చెఱుకున రసము చిప్పిలుచుండును. మందిర గర్భములందు శయనము సరసులు గబ్బిగుబ్బలుగల ప్రియురాండ్ర భుజపంజరముల శయనింతురు. పగటి ప్రమాణముతగ్గును. ఈ ఋతువున పడమటిగాలి గాని, యుత్తరపుగాలిగాని వీచును.

**శిశిరర్తువు :** మాఘ ఫాల్గుణములు శిశిరఋతువు. ఈ ఋతువు హేమంతము వలెనే ఉండును. విశేషించి ఏనుగులకు, లేళ్లకు, పందులకు, దున్నలకు క్రొవ్వు పట్టును. కామినులు విచిత్ర సురతోపభోగయోగ్యలుగా నుందురు. చందనమునంగరుచి కలుగును. జలములకు మిక్కిలి శైత్యము గలుగును. మరువకములను. గుందములును బుష్పించును. కేళాకూళులయందనాదర యేర్పడును. ఎల్లరును వెచ్చవచ్చగాఁగుంపట్లవద్దఁ గూర్చుండనభిలషింతురు. ప్రచండవాయువు వీచును. కుంకుమపూతను పూసికొని యా చలినిఁగామినులు సహింతురు.

**వసంతర్తువు :** చైత్ర వైశాఖమాసములు వసంతర్తువు. ఈ ఋతువున చిలుకలు, గోరువంకలు, తుమ్మెదలు, గండుకోయిలలును లెస్సగాఁగ్రొవ్వును దాదాపన్ని వృక్షములును జిగిరించును. ఎల్లయుద్యానములందును, నుయ్యాలలూగుట పుష్పాపచయము, మధుపానము, మన్మథపూజ, గౌరీచరిత్రగానము, చంపక పుష్పాభరణము, కోకిల నాదములులు బిక్కటిల్లు చుండును. దక్షిణ వాయువు వీచును.

**గ్రీష్మర్తువు :** జ్యేష్ఠాషాఢములు గ్రీష్మర్తువు. ఈ ఋతువున నవమాలికలు, శిరీషములు, చంపకములు, గేదంగులును పుష్పించును. ఖర్జూరములు, నేరేళ్లు, పనసలు, మామిళ్లు, పోకలును పండును. ఒంటెలు, శరభమృగములు, కంచరగాడిదలు క్రొవ్వును నదీసరఃకూపాదులెండిపోవును. చలిపందిరులందు బాటసారులు మూగియుందురు. పందిళ్లలో మధ్యాహ్ననిద్ర సేయుదురు. దివసావ

సానమున స్నానము సేయుదురు. వేకువజామున సురతక్రీడలు జేయుదురు. చందనాదిశీతలద్రవ్యములు సేవింతురు. రాత్రులందు చంద్రికాసేవనము సేయుదురు. శరీరములకు చందనమలదికొని భోగింతురు. భూతములుడుకుచున్నట్లు, జలములు సెగలు లేచుచున్నట్లు, దుమ్ముకాలుచున్నట్లు, పర్వతములు మండుచున్నట్లుండును.

## XII. కవిసమయములు

సమయమనగా సంప్రదాయము. అనగా నాచారము లేక మర్యాద. ఈ సంప్రదాయములు దేశాచారములవలె నెప్పుడో యేర్పడినవి. సంఘముతో సంబంధమున్నంతవఱకు దేశాచారములను జనులు పాటింపవలసిన విధమున కవులును నౌచిత్యముతో సంబంధము గలిగియుండవలసినపుడు వీనిని పాటింపవలసినదే నేడు వీనిని మార్ప వీలులేదు. మార్చినచో భాషయే తలక్రిందు లగును. ఔచిత్యదృష్టితో క్రొత్తవానిని సృష్టించుకొనవచ్చును.

ఈ సమయములు మూడు విధములు. ౧. ఉన్నధర్మమును నిబంధింపకుండుట. ౨. లేనిధర్మమును నిబంధించుట. ౩. నియతముగా గొన్నింటికి గొన్ని యెడలనే యునికిని నిబంధించుట.

ఈ క్రింది వస్తువులందున్నను నాయా ధర్మములను నిబంధింపరాదు.

౧. మాలతీలత వసంతమున పుష్పించునట్లు వర్ణింపరాదు.

౨. చందన ద్రుమములకు ఫలపుష్పములున్నట్లు " "

౩. అశోకమునకు ఫలములున్నట్లు " "

౪. కృష్ణపక్షమున వెన్నెల యున్నట్లు " "

౫. శుక్లపక్షమున నంధకార మున్నట్లు " "

౬. మల్లెమొగ్గలకును, గాముకుల దంతములకును (తాంబూల చర్వణముచే నెఱ్ఱగా నున్నను) నెఱ్ఱదనమును వర్ణింపరాదు.

౭. కమలముకుళములకు పచ్చదనమున్నను వర్ణింపరాదు.

౮. ప్రియంగు పుష్పములకు " "

౯. పగటిపూట నీలోత్పల వికాసమును వర్ణింపరాదు.

౧౦. పగటిపూట వావిలి చెట్టు పూలు రాలిపోయినట్లు " "

౧౧ స్త్రీలకు నల్లదనమును, స్తనపాతమును " "

ఈ క్రింది వస్తువులందు లేని ధర్మమును నిబంధింపవచ్చును.

౧. నదులయందు పంకజ నీలోత్పలాదులు లేకున్నను వర్ణింపవచ్చును.

౨. ప్రతి తటాకమునందును హంసలు " "

౩. ప్రతి పర్వతమునందును, బంగారము, రత్నములు, గజములు లేకున్నను వర్ణింపవచ్చును.

౪. చీకటిని ముష్టిగ్రాహ్యమనియు (పిడికిటితో పట్టదగినది) సూచీ భేద్యమనియు (సూదులచే భేదింపదగినది) వర్ణింపవచ్చును.

౫. ఆకాశగంగలో దిగ్గజములు స్నానమాడుచున్నట్లు వర్ణింపవచ్చును.

౬. ప్రతాపమున రక్తత్వమును ఉష్ణత్వమును " "

౭. వెన్నెలను నంజలి గ్రాహ్యముగా (దోసిళ్లతో తీసి ఎత్త దగినది) కుంభోపవాహ్యముగా (కడవలతో ముంచుకొని పోదగినది) వర్ణింపవచ్చును.

౮. పురాతనుడైనను శివుని శిరశ్చంద్రుని బాలునిగా " "

౯. కీర్తిని, పుణ్యమును, హాసమును తెల్లగా " "

౧౦. అపకీర్తిని, పాపమును నల్లగా " "

౧౧. కోపమును, అనురాగమును నెఱ్ఱగా " "

౧౨. స్త్రీకి రోమావళి, త్రివళులు లేకున్నను " "

౧౩. చక్రవాక దంపతులకు రాత్రి వియోగము గలుగునట్లు " "

౧౪. చంపక భ్రమరములకు విరోధమున్నట్లు " "

ఈ క్రింది యెడల నాయా ధర్మములు నియతములుగా నుండును.

౧. సముద్రమునందే మొసళ్లను వర్ణింపవలెను.

౨. తామ్రపర్ణీనదియందే ముత్యములు లభించునట్లు వర్ణింపవలెను.

౩ హేమంత శిశిరములను విడిచి సర్వదా కమలములుండునట్లు వర్ణింపవలెను.

౪. ధ్వజ, చామర, హంస, హార, బక భస్మములకు తెల్లదనమే " "

౫. శైల వృక్షాది, మేఘ, సముద్ర లతలకును, రాక్షస, ధూమ, పంక, కేశములకును నల్లదనమే వర్ణింపవలెను.

౬. మలయ పర్వతమునందే చందన వృక్షముల ఉత్పత్తిని వర్ణింప వలెను.

౭. హిమవత్పర్వతమునందే భూర్జ వృక్షములు " "

౮. వసంతమునసే కోకిల ధ్వనిని వర్ణింపవలెను.

౯. వర్షాకాలమునందే మయూరనృత్యమును, వాని కేకలను " "

౧౦. విశేషించి చెప్పకున్నచో పుష్పములకును, జలములకును, ఛత్రమునకు, వస్త్రములకును తెల్లదనమే వర్ణింపవలెను.

౧౧. శాలి, మండూక, వల్కల పరాగములకు పీతత్వమునే వర్ణింప వలెను.

౧౨. విశేషించి చెప్పకున్నచో, మాణిక్య, జపాపుష్ప, రత్న, సూర్య, పద్మ, పల్లవ బంధూక (మంకెన) దాడిమ, నఖములకు శోణ వర్ణమే వర్ణింపవలెను.

ఈ క్రింది వాని నైక్యమును వర్ణింపవచ్చును. (భేదమును పాటింపనక్కరలేదు).

౧. కృష్ణ (నలుపు) నీల (ఆకాశవర్ణము) హరిత (ఆకుపచ్చ), శ్యామ (ముదురు పచ్చ) వర్ణములకైక్యము చెప్పవచ్చును. భేదమును పాటింప నక్కరలేదు.

౨. స్వర్ణ, పరాగ, అగ్నిశిఖాదులందున్న పీత (పసుపపచ్చన) రక్త (ఎరుపు) ములకు నైక్యము వర్ణింపవచ్చును.

౩. శుక్ల (అచ్చతెలుపు) గౌరములకు (బూడిదరంగు) నైక్యము వర్ణింప వచ్చును.

౪. చంద్రుని యందు శశ, మృగములకైక్యమును " "

౨౩. రణహతులు సూర్యమండలమును భేదించుకొని పోవుదురని వర్ణింపవచ్చును.

౨౪. శివుని శూలి అనవచ్చును (శూలము గలవాడు) సర్పి (సర్పము గలవాడు) అనరాదు.

౨౫. చంద్రుని శశి (శశము గలవాడు) అనవచ్చును, కాని మృగి, హరిణి, అనరాదు.

౨౬. శంకరుని వృషభవాహనుడు, వృషాంకుడు. వృషధ్వజుడు, అని ఆయా ఉపాధినిబట్టి చెప్పవచ్చును.

౨౭. శివుని 'ఇందుమౌళి' అనవచ్చును. కాని 'గంగామౌళి' అనరాదు.

౨౮. పద్మినీ జాతి స్త్రీల తాకులవలన ప్రియంగువృక్షము, వారి పుక్కిటి మద్యము మియుటచేత పొగడచెట్టు, వారి కౌగిలిచే గోరంట, వారి కాలి తన్నులచే అశోకవృక్షము, వారి చూపులచే బొట్టుగు చెట్టు, వారి నర్మవాక్యములచే మందారము, వారి హాసముచే సంపెంగ, వారి ముఖానిలముచే మామిడిచెట్టు, వారి సంగీతముచే సురపొన్న, వారి నర్తనముచే కొండగోగుచెట్టు, వికసించును. (ఇది మల్లినాథుని ఉదాహరణములను అనుసరించి వ్రాయబడినది) వసుచరిత్ర వ్యాఖ్యాత ఈషద్భేదముతో ఉదాహరించెను. భేదించినవి మాత్రము చూపుదుము) మాకందము కరస్పర్శచేతను, సంపెంగ ముఖరాగముచేతను, కొండ గోగు సల్లాపముచేతను, వావిలి ముఖానిలముచేతను ప్రియాళువు సంగీతము చేతను వికసించును.

**X.** అవయవ వర్ణనము - ప్రసిద్ధోపమాసామగ్రి. పుట - ౭౬ - ౭౩ (నాయికను దదవయవములను నేయే వస్తువులతోఁబోల్పఁదగునో యిటఁ దెలుపుదుము.

**XI.** (కావ్య మార్గమున నేయే వస్తువులేయే వర్ణములుగా వర్ణించవల యునో తెలుపుదుము -) పుట - ౪౭౭ - ౪౮౨.

**XII.** కవిసమయములు. పుట - ౪౩౬ - ౪౮౭.

పై యనుబంధత్రయము (X, XI, XII) శిరోమణి శ్రీసన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహము (రామరాజభూషణుని నరసభూపాలీయమునకు వ్యాఖ్య) **నుండి** ఉద్ధృతము.

---

కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) రెండవ కూర్పు. 1959.

వివరణకర్త :

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెని,

సికింద్రాబాదు.

# ఉపకరించిన గ్రంథములు

## సంస్కృత గ్రంథములు


1. అగ్నిపురాణము
2. అమరకోశము — లింగాభట్టీయ గురుబాల ప్రబోధికా వ్యాఖ్యా సహితము
3. అలంకార చింతామణి — అజితసేనుడు
4. అలంకార శేఖరము — కేశవమిశ్రుడు
5. కర్పూర మంజరి — రాజశేఖరుడు
6. కవి కల్పలతా — దేవేశ్వరుడు
7. కావ్యకల్పలతావృత్తి — అరిసింహ-అమరచంద్రులు
8. కావ్యప్రకాశః — మమ్మటాచార్యుడు
9. కావ్యమీమాంస — రాజశేఖరుడు
10. కావ్యానుశాసనము — హేమచంద్రుడు
11. కావ్యాలంకారము — భామహుడు
12. కావ్యాలంకారసూత్రవృత్తి — వామనుడు
13. కావ్యాలంకారము — రుద్రటుడు

| | | |
|---|---|---|
| 14. కావ్యదర్శనము | | దండి |
| 15. ఔచిత్యవిచారచర్చ | | క్షేమేంద్రుడు |
| 16. చంద్రాలోకము | | జయదేవుడు |
| 17. ధ్వన్యాలోకము | | ఆనందవర్ధనుడు |
| 18. ప్రతాపరుద్రీయము | | విద్యానాథుడు |
| 19. నైషధీయ చరిత్రము | | శ్రీహర్షుడు |
| 20. రాజనిఘంటువు | | నరహరిపండితుడు |
| 21. చిత్రమీమాంస | | అప్పయ దీక్షితులు |
| 22. సాహిత్యదర్పణము | | విశ్వనాథుడు |
| 23. రసగంగాధరము | | జగన్నాథపండితరాయలు |
| 24. కవిసమయ కల్లోలః | (అముద్రితము) | అనంతాచార్యుడు |
| 25. రఘువంశము | | కాళిదాసు |
| 26. మేఘదూతము | | ,, |
| 27. కుమార సంభవము | | ,, |
| 28. ఋతుసంహారము | | ,, |
| 29. వాల్మీకి రామాయణము | | ,, |
| 30. మహాభారతము | | వ్యాసుడు |
| 31. రసరత్న దీపిక | | అల్లరాజు |

32. కాదంబరి — బాణుడు

33 సుభాషిత రత్నభాండాగారము — నిర్ణయసాగర్ ముద్రణాలయము

34. చరకసంహిత — ,,

35. పార్శ్వనాథచరితము — భావదేవసూరి

36. భావప్రకాశము — శారదాతనయుడు

37. వాచస్పత్యము — తారానాథభట్టాచార్య సంకలితము

## తెలుగు గ్రంథములు

1 కవిజనాశ్రయము — మల్లియ రేచన

2. కావ్యాలంకార చింతామణి — పిన్నకోట పెద్దన్న

3. ఛందోదర్పణము — అనంతామాత్యుడు

4. నాట్యశాస్త్రము అనువాదము — డా. పి. ఎస్. ఆర్ అప్పారావు

5. ఆంధ్రమహాభారతము — కవిత్రయము

6. అప్పకవీయము — కాకునూరి అప్పకవి

7. సారస్వతాలోకము — రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

8 సాహిత్య శిల్పసమీక్ష — పింగళి లక్ష్మీకాంతము

9. వ్యాసకదంబము — బులుసు వేంకటరమణయ్య

10. వసుచరిత్ర — ప్రచురణ : ఎం. ఎస్కో సంప్రదాయ సాహితి, విశ్వనాథ సత్యనారాయణ పీఠికతో.

11. సంకేతపదకోశము — రవ్వా శ్రీహరి

12. సాహిత్య సౌందర్య దర్శనము — చర్లగణపతిశాస్త్రి

13. కావ్యాలంకార సంగ్రహము — రామరాజ భూషణుడు సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి వ్యాఖ్యాసహితము

14. పదబంధ పారిజాతము — 1, 2. భాగములు. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

15. కాళహస్తీశ్వర మాహాత్మ్యము — ధూర్జటి

16. కావ్యమీమాంస — ఆంధ్రానువాదము-పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

## హిందీ గ్రంథములు

1. హిందీ సాహిత్యకీ భూమిక — పండితహజారీ ప్రసాద్ ద్వివేది

2 కవిరహస్య — పండిత గంగానాథ్ ఝూ

3 కవిసమయ మీమాంస — డా. విష్ణుస్వరూప్

4. విద్యాపీఠ్ పత్రిక — 1936 – కాశీ

5. మేరీకైలాస్ యాత్ర — స్వామీ సత్యదేవ్

6. కైలాస్ - మానససరోవర్ — ప్రణవానందస్వామి

7. భారతీయ సాహిత్యశాస్త్ర బలదేవ్ ఉపాధ్యాయ్
9. సాహిత్యశాస్త్ర డా. రామకుమార్ వర్మ

## ఇంగ్లీషు గ్రంథములు

1. Sanskrit English Dictionary - Monior williams
2. Chamber's Dictionary 20 th centuary
3. Illusion and Reality - Christopher Caudwell
4. Apte's Sanskrit - English Dictionary
5. The ocean of Story - Toney.



# డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి

ఎం ఏ పి. హెచ్ డి.

రీడరు, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం.

జననం : 1930, మహబూబ్‌నగర్ ఆం ప్ర.

వృత్తి : 1957 నుంచి ఆంధ్రభాషా సాహిత్యాధ్యాపనం.

భాషాపరిచయం : సంస్కృతం, ఉర్దూ, హిందీ, ఆంగ్లము.

సాహితికి, జాతికి సేవ :
1. 1968 నుంచి 'యువభారతి' సాహిత్య, సాంస్కృతికసంస్థ (సికింద్రాబాదు)కు అధ్యక్షుడు.
2. 1979 నుంచి 1985 వరకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి.
3. 1986 నుంచి ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యదర్శి.
4. 1944 నుంచి శ్రీసీతారామాంజనేయ గ్రంథాలయ (మహబూబ్‌నగర్) తోను, తెలంగాణా రచయితల సంఘం (1953–55) తోనూ, ప్రస్తుతం అనేక సాహిత్య, విద్యా సంస్థలతోనూ సాన్నిహిత్యం.

1947లో, విద్యార్థిదశలో, హైదరాబాదు సంస్థానం భారతయూనియన్‌లో సంలీనం కావాలని చెలరేగిన సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నందుకు కారావాసం.

ముద్రితరచనలు :
1. తెలుగు-ఉత్తర భారత సాహిత్యాలు (సహరచయిత)
2. చాటువులు (వ్యాఖ్యాన గ్రంథం)
3. వాగ్భూషణమ్ భూషణమ్
4. వేగుచుక్కలు, 5. వెలుగుబాటలు, 6. అడుగుజాడలు,
7. వెలుగుచూపే తెలుగు పద్యాలు, 8 దేశమును ప్రేమించుమన్నా, (బాలసాహిత్యం)
9. కవిసమయములు (సిద్ధాంత వ్యాసం)

అచ్చులో : జాతీయకవి - ఎక్బాల్ (అనువాదం)

అముద్రిత రచనలు : 1. వ్యాస విన్యాసాలు, 2. అక్షర పక్షం, (కవితల సంపుటి)

---

చిరునామా : డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి B-10, F2, విజ్ఞానపురి,
రెసిడెన్షియల్ ఫ్లాట్స్, హైదరాబాదు-500 044.